శ్రీరస్తు

# అచ్చతెలుఁగురామాయణము

కవిసార్వభౌమ

## కూచిమంచి తిమ్మకవి విరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1954



[Price Rs. 2-8-0

శ్రీరస్తు

# అచ్చతెలుఁగురామాయణము

కవిసార్వభౌమ

## కూచిమంచి తిమ్మకవివిరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

1954

# భూమిక



క. "హాటకగర్భవధూలీ, లాటనచలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ, తేటలు మాకూచిమంచితిమ్మయమాటల్."

ఈయచ్చతెలుఁగురామాయణమును రచించినకవి కవిసార్వభౌమబిరుదాంకుండగు కూచిమంచితిమ్మకవిచంద్రుఁడు. ఈతనికవితామృతము గంగాప్రవాహమువలె ననర్గళ మైనది. సలక్షణముగా మృదుమధురపాకమున గ్రంథముల రచించినయాంధ్రకవులలోఁ బెక్కుగ్రంథముల రచించినయతఁ డితఁ డొక్కఁడే యను టతిశయోక్తి గాదు. ఈకవి సార్వభౌముఁ డారువేలనియోగివంశమును దనజన్మముచేఁ బవిత్ర మొనరించెను. ఈయన కౌండిన్యగోత్రసంభవుఁడు. (కౌండిన్యగోత్రసంభవులకవిత సరస యని యెప్పుడును బేర్వడసియే యున్నది.) ఈతనిముత్తాత బయ్యనామాత్యుఁడు. తిమ్మయామాత్యుఁడు పితామహుఁడు. గంగనామాత్యుని కితఁడు కుమారుఁడు. ఈకవిచంద్రునిఁ గన్నతల్లి లచ్చమాంబ. జగ్గన్న, సింగన్న, నరసన్నయనువారు పిన్నతండ్రులు. ఇతనికి వీరమ్మ, పాపమ్మ యనునిద్దఱు మేనయత్తలు గలరు. సింగన్న, జగ్గన్న, సూరన్న యనువారు ముగ్గురు తమ్ములు గలరు. గొట్టిముక్కలరామయమంత్రికుమారిత యగుబుచ్చమ్మ యాతని కుటుంబిని. ఈయన కాచంద్రార్కముగా లోకమునఁ గీర్తి నిల్పినగ్రంథసంతతికన్న వేఱుగా సంతతి యున్నట్టు కనబడదు. ఈయన క్రీస్తుశకము పదునేడవశతాబ్దము చాలవభాగములో జన్మించి పదునెనిమిదవశతాబ్దము నుత్తరార్ధము వఱకును జీవించియుండె నని యూహింప నయ్యెడిని. ఈతిమ్మకవిచంద్రుఁడు గోదావరీమండలములోని శ్రీపిఠాపురపుసంస్థానమునకుఁ జెందియున్న "కందరాడ" అను గ్రామమునకుఁ గరణముగా నుండెను. శ్రీరావుమాధవరాయమహీపాలుఁడు శ్రీపీఠికాపురసంస్థానము నేలుకాలముననే యీకవి గ్రంథములను రచించెను. ఆనృపచంద్రుఁడే యిక్కవిచంద్రుఁడు కొన్నిగ్రంథములు రచించినపిదప నవి చిత్తగించి పరవశాయత్తచిత్తుఁడై యీతనికిఁ "గవిసార్వభౌమ" బిరుద మిచ్చియున్నాఁడు. ఈకవి పీఠికాపురసంస్థానములో నున్నవాఁ డయ్యును గోరినను రాజులకుఁ గృతి యియ్యక తనయిష్టదైవ మగు శ్రీపిఠాపురపుఁగుక్కుటేశ్వర స్వామికే తనగ్రంథముల నన్నిఁటిని నంకితము చేసియున్నాఁడు. కవి తా నద్వైతి ననువిషయము దెల్పుటకుఁ గాఁబోలును సర్పపురమాహాత్మ్యమునుమాత్రము శ్రీపీఠికాపురమునకు నాతిదూరమున నున్నభావనారాయణస్వామి కంకితము చేసెను. ఈయనకు శైవాచారము నేర్పినగురువరుఁడు దెందులూరి లింగనారాధ్యుఁడు.

ఈతనిచే రచింపఁబడినగ్రంథములపట్టిక యిట్టులు కన్పట్టుచున్నది —

1. రుక్మిణీపరిణయము. — మాచే నచ్చొత్తింపఁబడినది.
2. సింహాచలమాహాత్మ్యము.
3. నీలాసుందరీపరిణయము. — మే మచ్చొత్తించితిమి.
4. రాజశేఖరవిలాసము.
5. అచ్చతెనుఁగురామాయణము. — ఇద్దియే.
6. సారంగధరచరిత్రము.
7. సాగరసంగమాహాత్మ్యము. — } ఈరెండుగ్రంథములును నెచ్చటనైన దొరకినచో మాకుఁ బంపుదురుగాక.
8. రసికజనమనోభిరామము. — ఇదియు మేము ముద్రించితిమి.

దీనిని రచించినపిమ్మట నది చదివినయొకరసికురాలైన వారసుందరి యీకవిచంద్రుఁడు వీథిని బోవుచుండఁగాఁ దెలిసికొని యాతనిఁ గౌఁగిలించుకొనిన దనియు నపుడు కవి పెదమొగము పెట్టుకొనఁగా నప్పుడే యాయొప్పులాడి యాశువుగాఁ బద్యము చెప్పి కారణ మడుగఁగా నుత్తరార్ధముతో సమాధానము చెప్పెననియుఁ గింవదంతి గల దదెంతవఱకు నిజమై యుండునో చదువరు లూహించుకొందురుగాక. ప్రసంగము వచ్చినది గనుక నాపద్య మిందుఁ బొందుపఱుపఁబడుచున్నది.

వేశ్య:—చ. "చతురులలోన నీవు గడు జాణ వటంచును నేను గౌఁగిలిం
చితి నిటు మాఱుమో మిడఁగఁ జెల్లునె యోరసికాగ్రగణ్య!
కవి.— అ, ద్భుత మగునట్టి బంగరపుబొంగరపుంగవఁ బోలునీకుచ
ద్వితయము ఱొమ్ము నాటి యలవీఁపున దూసె నటంచుఁ జూచితిన్."

9. సర్వలక్షణసారసంగ్రహము. తెలుఁగుఁగవిత్వము చెప్పువారి కత్యుపయుక్త మైన మూఁడాశ్వాసములలక్షణగ్రంథము.
10. సర్పపురమాహాత్మ్యము.
11. శివలీలావిలాసము. రెండాశ్వాసముల ముద్దుప్రబంధము.
12. కుక్కుటేశ్వరశతకము-92పద్యములుమాత్రమే మాకులభింపఁగా ముద్రించితిమి.

ఇంతవఱకే మాకుఁ దెలిసినవి. ఇంకను నీతనిచే రచింపఁబడినశతకములు మొదలగు నవి యుండియుండు నని యూహింప నయ్యెడిని. అవి యెచ్చటనైనను గలవేని మాకుఁ బంపినచో నిట్లే వీలయినంతలో శుద్ధము చేసి మంచిస్థితికిఁ దెచ్చెదము.

ప్రకృత మీయచ్చతెలుఁగురామాయణము పురాతనముద్రితప్రతిని సంపాదించి యిచ్చిన, మ-రా-శ్రీ, బొడ్డుకూరపాటి వేంకటరంగకవిగారికిని, దానినచ్చున శుద్ధప్రతిగాఁ జేసి యచ్చున కిచ్చిన, బ్రహ్మశ్రీ, పురాణం. సూర్యనారాయణతీర్థులవారికిని కృతజ్ఞతాసూచకముగా ననేకధన్యవాదము లర్పించుచు భాషాభిమానులు మాసదుద్యమమునకుఁ దోడ్పడుచుందురు గాక యని విన్నవించుచు లేఖిని నన్యత్ర వ్యాపారింపఁ బోవుచున్నారము.

ఇట్లు,

**వావిళ్ల వేంకటేశ్వరులు.**

శ్రీ ర స్తు

# అచ్చ తెలుఁగు రామాయణము

## పీ ఠి క



చ. సిరులకు మన్కియై హొయలు చెన్నలరారెడు వెండికొండపై
నరుదుగ వేల్పుచేఁడు మగనయ్యెయు నల్వయుఁ గొల్వఁ జల్వడా
ల్దొరరతనంపుటుప్పరిగలోఁ బలిగుబ్బలిరాచకూఁతుఁ దా
నిరవుగఁ గూడి ముజ్జగము లేలెడు లేనెలదాల్పుఁ గొల్చెదన్.

తే. కొండవిం డేలువేల్పుఁ గూడి పొల, కడలినడుచక్కి బలుమానికములదీవిఁ
బుడుకుమ్రాఁకులు మారేళ్లవాదలి పొదలు, కడిమిపూఁదోఁటలో నాడుగరితఁ దలఁతు.

సీ. గ్రుడ్డుకానుపుటేఁడు గ్రుడ్డుకానుపుటేఁడు గట్టంబు పాన్పు నై కొమరు మిగుల
జంకతాలుపరియు జింకతాలుపరియు మఱందియు నచుఁగు నై మెఱుపుఁ జూపు
నీరుపుట్టువయుఁను నీరుపుట్టువయును బూరయుఁ దొడవు నై పొలుపు నెఱపఁ
బచ్చవార్వపుజోదు పచ్చవార్వపుజోదు పలకన్ను కొడుకు నై వలపు గులుకఁ

తే. జుట్టువాలును నెవ్వ పోఁగొట్టునాలు, బిట్టు గ్రాలుపసిండి క్రొంబట్టుసేలు
మెట్ట జాలు మొగిల్పస మెట్టఁ జాలు, నట్టిడాలును గలజగజెట్టిఁ దలఁతు. 3

చ. పులుఁగుహాలుమాయిజోదు నెదఁ బూనిననిద్దపుఁదమ్మికెంపు సొం
పలరెడుదొండపం డనుచు నక్కఱి ముక్కున నొక్కఁ బోవుకై
చిలుక నదల్ప నై శమది చేరి తమిం దనమోవిఁ జేఱ రాఁ
బొలుపుగ నవ్వునయ్యనలుఁబుట్టువనట్టు వెలంది గొల్చెదన్. 4

క. తెల్లనితామరగద్దియ, తెల్లనియిల్లాలు మిగులఁ దెల్లనికొడుకున్
దెల్లనితోఁబుట్టువయును, దెల్లనితత్తడియుఁ గలుగుదేవర నెంతున్. 5

సీ. వెలిదమ్మిక్రొంబువ్వ కొలువుసింగపుఁబీఁట చెలువారురాచిల్క చెలిమిబోటి
విన్నుద్రిమ్మరిరాచకన్నియ ల్వరవళ్లు పులుఁగులమేల్బంతి వలఁతిమావు
తెఱగంటిదొర లెల్ల దినుసు మీఁగడలెంక లలరుపిల్దాల్పు ముద్దులమఱంది
పారోఁగిరపునిరాబారి కూరిమిపట్టి మామమామ యనంగుమామగారు

తే. తమ్మిపూఁజాలివాలుగు నెమ్మొగమ్ము, లాటగిములు గాఁగఁ జెన్నలరునట్టి
పలుకుననఁబోడి జానగపలుకులిడుచుఁ, గనికరం బెచ్చ మము నిచ్చఁ గాచుఁగాత.

సీ. నేలతాలుపురాచచూలిగాదిలికందు దొసఁగుచీఁకటిచాల్పుతొగలవిందు
దుగలిగ మొగములజగజెట్టితోఁబుట్టు పొగడువారలనట్టుపుడుకుఁ జెట్టు
పెనుబొజ్జ నిద్దైన ల్దిసెదు నేరుపువాఁడు మేలికడానిడాల్తేనివాఁడు
గోడదాల్చెడుటాఁగగుజ్జాపు నెఱజోదు గాటంపుటక్కటికముల పాదు

తే. నగుచు జిగిచెక్కుఁగవ జాలు నామనీదు, గ్రోలుటకుఁ జేరుజమిలిముక్కాలిబారు
గొనబుపాటల కెదఁ జేరుకొనుచు సౌరు, నెఱపు నెలవేల్పు నామది నిలుచుఁగాత.

సీ. లాఁగడాఁగుడుతాఁగ ప్రోఁగు లిడెడు ప్రోడ కొలలఁ దొసంగులు దొలఁచుమేటి
జక్కులరాయిక్కఁ జొక్కు నెక్కటియుద్ది కడిఁదిముక్కొటికసోఁకుములడిగులు
వలపు మోపరిజియ్యవలమూలదయ్యంబు గుండులతలకట్టుపండుదండి
తొలుకడరాతాపసలు గెబ్బునత్తిఱేఁ డెద్దడికబురుకాఁ డిర్లప్రొద్దు

తే. బారకై సీటికానుపు పాపయన్వ, పుడుకుఁగ ల్గలజెట్టికై శౌడమినట్టి
మెట్టవాల్పట్టరామేనిపట్టవేల్పు, క్రచ్చు లొడగూర్చి మము నిచ్చఁ గాచుఁగాత.

క. ఎడఁ గుదు రగువేడుకఁ బొగ,డుదుఁ బవియరదములదొరకొడుకుకత కడు సిం
పొదవఁ గదియించి యనమునఁ, బొదలినబల్లిదుని బుట్టఁబుట్టువుతపసిన్. 9

తే. రంగు మీఱంగ మున్ను తెలుంగుబాసఁ గబ్బములు గూర్చి పొగడికఁ గన్నవారి
భీము నన్నయఁ దిక్కయ సోము నెల్లి, ప్రగ్గడను బాచయను గూర్మి నగ్గడింతు.

సీ. ఏ మేటియడుగుఁదొందామర బగ్గఁపురపుటేల్లిజని కబ్రింపుఁ దెప్ప
యేబల్లిదుఁడు చెవి నిడునక్కరములు చెల్వపుముత్తిమేడకు వరుసమెట్టు
లేపున్నెములగని యెఱిఁగించుమేత్తైర్వి కిల్లజగంబుచీఁకటికి దివ్వె
యేదంట యొసఁగుచున్నాఁడి దోసపుఁదుల్వగాడ్పుదిండులకు వాకట్టుమందు

తే. తనర నేపెద్దపుట్టువు లనుకడింది, తెవులునకు వెజ్జుఱేఁ డట్టిదొందులారి
కొలపుపాలేటిసందుజాబిలి యనంగఁ, దనరులింగనగురుని డెందమునఁ దలఁతు. 11

క. అని యెల్లవేల్పులం జే,రొక్కని కబ్బముహరుపరుల గురునిఁ గడంకం
గొనియాడి యచ్చతెలుఁగునఁ, బనివడి కబ్బంబుఁ గూరుపం గడఁగునెడన్. 12

సీ. కప్పుకుత్తుకవాఁడు గాలిమేఁతరియండె జోటివాఁ డరమేనిజోటివాఁడు
విన్నుకొప్పుముడివాఁడు వెండికబ్బలికుండె మేలువాఁ డుడివోనిమేలువాఁడు
గిత్తతత్తడివాఁడు బుత్తిముత్తు నిడంగఁజాలువాఁ డోదలజాలువాఁడు
మొనలకైదువవాఁడు మినుకుకైవారము ల్మెచ్చువాఁ డని బీర మెచ్చువాఁడు

తే. నంకుజిగివాఁడు వలకేల జింకవాఁడు, ప్రాఁతమగవాఁడు వెలిబూదిపూఁతవాఁడు
మిక్కుటంబగుమక్కువనొక్కవాఁడు, దనరఁ గలలోన మ్రోలఁ గన్గొనఁగ నయ్యె.

క. కనఁబడి యబ్బలుజేజే, కనికరపుఁ గొనబుఁజూపు గనుఁగవకొన నె
క్కొనఁ గన్గొని నాతోని, ట్లనియె న్నుడిదియ్యపలుకు లలరఁగఁ జాలన్. 14

సీ. నీతండ్రి గంగన్న నిచ్చనిచ్చలు మమ్ముఁ బూజించు నపరంజిపూలచేత
నీతల్లి లచ్చమ్మ నే సంచిసిల నోఁచెములు వెట్టఁ బుడమివేల్పులకు నెల్ల
నీచిన్నతండ్రు లెన్నిఁపలు గాంచిరి జగ్గనయును సింగరాజును నరసనయును
నీతమ్ము లెలమి నొందించిరి మమ్ము సింగనయును జగ్గనయు సూరనయుఁ జెలఁగి

తే. నీయనుఁగురాణి బుచ్చమ సెలఁత లెల్ల, మేలనఁ దనర్చ గట్టురాచూలిఁ గొలిచి
మానికంబవు గద కూచిమంచికొలము, నం దరయఁ దిమ్మకవిరాయ యలర నీవు. 15

తే. మునుపు మా కీవె భల్లాణుఁ డనెడిపేని.కథయు రుక్మిణిపెండ్లికథయు బొబ్బ
మెకపుగబ్బిలికథయు మే ల్మిఱి నీల, పెండ్లికథయును గబ్బము ల్పేర్మిఁ గూర్చి. 16

క. కావున మా కప్పనముగఁ, గావింపుము చాల్పుకుత్తుకలతొలిజేజేఁ
జేవ దలిర్ప నడంచిన, యావెరవరికథయుఁ బూని యచ్చతెలుఁగునన్. 17

తే. ఒనరఁ బేరులు బిరుదులు తెలుఁగు సేయఁ,బోల దని మున్ను పెద్దలు పూని త్రోవ
యిడిరి గావునఁ గూరుపు మిదియు నట్లు, తెనుఁగు తెఱఁగెల్ల నేర్పడఁ దిమ్మప్రగడ.

క. నన్నయ మొదలుగఁ గల్గిన, మున్నటి బల్లిదులు గబ్బములు గూర్చినజా
డ న్నుడువుల తెఱఁగెల్లను, బన్నుగ గుఱి యొఱఁగి కూర్పు పద్దెంబులలోన్. 19

తే. అనుచు నానతి యొసఁగి యగ్గానములగని, కనుమొఱంగిన నపుడ మేల్కాంచి యబ్బు
రమును వేడ్కయు మిగుల డెందమునఁ బెనఁగొనంగ నవ్వేలుపునకు దండము లొసంగి.

## షష్ఠ్యంతములు

క. జక్కులదొరచెలికానికిఁ, గొక్కుఱుమాజోదునయ్యకుం జొక్కపుఱే
జుక్కలఱేనిని వేలుపు, జక్కర సొదలను దాల్చుజగవేల్పునకున్. 21

క. మల విల్లుఁ జిలువ నారియుఁ, బులుఁగుసిడముజోదు ముల్కి పుడమి యరదముం
దొలుపలుకువారువంబులుఁ, జెలఁగఁగఁ దిగ ప్రోల్గుఁ గూల్చినబలియునకున్. 22

క. వెండిమలం బండి మొలం, దండి సెలఁగ వెలుఁగులోలుదాల్పువలఁతికిన్
మొందుగఁ బెనుపండుగుగను, గొండయనుఁగుఁగూఁతుఁ గలసి కులికెదుదొరకున్. 23

క. త్రొక్కటఁ బని యక్కట యని, మ్రొక్కుటఁ గని తపసిసుఁగుఁ బ్రోచుతలఁపునన్
మిక్కుటమై యక్కటికము, పిక్కటిల స్వాఱపు మానిపినయొక్కటికిన్. 24

క. మలఁ బ్రోలు న్మోలఁ దోలుం, దల జాలు న్మోసలవాలుఁ దరలనిమేలుం
జెలిడాలు స్మైక మెలసిన, పలకేలుం గలిగి చెలఁగువన్నెలగనికిన్. 25

క. జేజేరాటాబాజుజ, గాజిగి నోగిఁ జెగడి నొగడఁగాఁ జాలెడుమే
త్తే జూనెడుకుత్తుక నిల, జేజేమ న్మొగిలుదారిసిగ జేజేకున్. 26

---

శ్రీ ర స్తు

# అచ్చతెలుఁగురామాయణము

## బా ల కాం డ ము



తే. అప్పనంబుగ నాసేర్చిన ట్లొనర్పఁ, గడఁగుఁ గిప్పన్నియపుబలుకబ్బమునకుఁ
గతతెఱఁ గెట్టు లన్న ము న్గలుసుదిండి, ఒపసిఁ గని కల్గుకానుపుకపసి పలికె. 1

సీ. జడదారిరాయ యిజ్జగమున నాడెంపుగొనమున వాఁడియుఁ గనికరమును
నిక్కువపుంబల్కుఁ జక్కఁదనంబును దెలివియు బాగంబు తేజు పెంపు
కలిమియు బలిమియుఁ గడిఁదినిచ్చలమును గొలమును దిటమును వలఁతితనము
మేలిమియును నెల్లమెయిదాల్పుపిండులయెడ నెయ్యమును జాల నేర్తెఱయును

తే. గలుగుమానిసి యెవ్వఁడు గలఁడు వాని,కల వెదంచగ నా కెఱుఁగంగఁ బల్కు
వలయు నని వేడుకొనిన నన్నులువపట్టి, చిలువపట్టునఁబుట్టినబలియుఁ గాంచి. 2

తే. పెనుతపసిఱేఁడ నీ వడిగిన తెఱఁగునఁ, దనరుమానిసిజేనిచందంబు నీకుఁ
దెలియ నెఱిఁగింతు నిఁకఁ బెఱతలఁపు మాని వినుము వేల్పంతినని యిట్టులనుచుఁ బలికె.

క. ఉడివోనిసిరుల కిర వై, యడరుచు నిపునాల్గుకడల నరుదుగ నెల్ల
ప్పుడుఁ గడుఁ బొగడంగాఁ దగి, పుడమిపయి నయోధ్య యనఁగఁ బ్రోల్వెలుఁగొందున్.

తే. లలి నిరాబారులే యుండునలువప్రోలు బలసి విసదారు లుండు పెంజిలువప్రోలు
కూడు నిమరయు నెప్పుడుఁ జేకూఱ కుండు, వేలుపులప్రోలు నమ్మేటిపీటి కెనయు. 5

తే. పుడమి కెన్నికగా ముత్తి యిడఁగఁ జాలి, పొదలుసతప్రోళ్లయందును మొదలిదగుచు
నొరుల కేరికి గెలువ రాకుండినట్టి, కడిఁది పేర్మోచి యాప్రోలు కరము మెఱయు.

సీ. పెనురాచముంగిళ్లఁ జెంపుడుతోఁటల మావులు మావులు ప్రోవు మీఱ
నాడెంపుఁగోటల నాగవాసమ్ములఁ గొమ్మలుఁ గొమ్మలు గొనబుఁ జూప
గరిసలబొమ్ముల గడితంపుగోడలఁ బట్లును బట్లును బసఁ బొసంగ
దొడ్డికట్టుల దొడ్డదొరసానలయొడళ్ల సొమ్ములు సొమ్ములు సొంపు నెరప

తే నంగడులఁ జేలఁ దప్పియు రం గెసంగి, ముత్తెసరులును బరువంపుముత్తెసరులు
వఱలఁ దరలసిసిరులఁ బల్మఱును మెఱసి, వీడలపు వేల్పురానెల వీడు గాఁగ. 7

సీ. మేడలా రతనంపుగోడలా యపరంజిచేడలా యేవాడఁ జెం పెసంగు
మావులా బలితంపుటావులా చెంగల్వబావులా యెక్రేవఁ బసఁ దనర్పుఁ
గోటలా తుది లేనిపేటలా నెఱియాటపాటలా యెచ్చోట నీటు చూపు
నట్టులా మగతాలపెట్టులా పచ్చతాకట్టులా యేపట్ల బిట్టు మెఱయుఁ
తే. దేరులా కొమ్ముటేనుఁగుబారులా పసారులా చొక్కటపురాచదారులా కొ
టారులా తీరులా గొనబారు నాళ్ల ప్రోలియొయ్యార మేరిఁ బొగడ నరిది. 8

మ. అలరంభున్నమరేలు వేల్పాయలు చేసవ్వేటి గాటంపుక్రొ
న్నెలతా మేడల నాడు చేడియలు పూన్కిం జెంపఁ గన్పట్టువే
ల్పులబువ్వం బెలినిల్వటద్ద మని చేలుంచమ్ములం బట్ట ని
మ్ములఁ గం దంబను గాక యందుఁ గలదే ము న్నిట్టియు న్నట్టియున్. 9

తే. పూని యాప్రోలిమేలిక దానికోట, వాసియు నగ త్తలోతును వలను మీఱఁ
జూడఁ జెప్పఁగ నరిది యాఁ జుమ్మువేయు,కన్నులును నోళ్లు గల నేస్పుకాంత్రకైన.

ఉ. అందలికత్తలాసిగమి నందఱ గాడుపుట్టువాలు సే
పంజెము వైచి పర్వ లిడుపట్టున నోడియ కాచె లేళ్లు బ
ల్గొందల మంది పూరిఁ దినుకొంచును రిత్తయ జంకి చూచుచుం
బాదకనంబు మీఱఁ గడుఁ బాఱఁ దొడంగెను నాటనుండియున్. 11

క. కద లేనిప్రేఁగు మోచుచుఁ, గడగఁడ్లం బడియెఁ గాక కదమేనుఁగు లి
ట్లాడయల బ్రతికించునె యె,మ్మోడలను నని కేసుఁ బ్రోలియేనుఁగుగున్నల్. 12

చ. పలుకువెలందికి న్ననికిప ట్టగుచాలుపువోముఁదామర
ల్గలిగియుఁ బ్రాఁతపల్కులు చొకాటముగా నుమునంగ నేరకే
వల వెగ ప్రేటులం బడియెఁ దా నొకనేసుపుకాఁడె యంచు న
న్నలువను మాటిమాటికిని నవ్వుదు రచ్చటినేలవేల్పుల్. 13

తే. కఱకుఁ జూపక ప్రంతలు గనక నెత్త,ములఁ బొరలుపెనుబాముల మొగి నలుగక
వేల్పుదొరకైన నెఱవక వెలయు నచటి,పుడమిదాలుపుగమి హెచ్చు పొగడ నరిది.

తే. ముత్తియంబులు పగడముల్ మొదలు గలుగు, మానికములకు సిరికిని మనికి యగుచుఁ
గొలుచురొక్కంబుఁ గలుములఁ జెలఁగ నుండుఁ,గడిదికోమటిరతనంపుగనులు వీట.

క. నిలుతురు నిక్కము తోడుగఁ, గొలుతురు తగ జన్నగట్టుఁ గొంకక పొఱం
గెలుతురు బలితపుఁగలుములఁ, బొలుతురు నెఱి నచటియడుగుపుట్టువుపెద్దల్. 16

తే. తేజు గలవారి నెందును దినుసు లేని, కీవిగలవారిఁ గూడి యుండి గిలు నొకింత
వంకయును మచ్చయును గలవారిఁ బెకడి,యాటవలఁదులగమి వొల్చు వీట నెపుడు,

తే. అట్టి ప్రోలికి నేలిక యగుచు నెల్ల, నేలఱేఁడులు దను మేలుమే లటంచుఁ
బొగడ మగుడనికలుముల నెగడి ప్రజలఁ, దన్నయును సాఁకుకొనుచుండు దశరథుండు.

సీ. పిఱికితనంబును గుఱి దప్పి చనుటయు వెఱపును మఱపును గొఱకొఱయును
గఱుకును బేదల నఱముటయును బెఱతెఱవలపయిఁ జూడ్కి వఱపుటయును
ముఱి చెడి దురమున విఱుగుటయును వీఁగి పిఱుఁదఁ జేరినవారిఁ జెఱచుటయును
దెఱపి చూపక మ్రోల గిఱికొని విద్దెలఁ గొఱలువారల రిత్త మొఱఁగుటయును
తే. దఱిపనుల్ నెఱిఁ జేయక యుఱుకుటయును, మఱియుఁ గొఱమాలి పెద్దల తెఱఁగరయక
యఱమఱల్ చేసియామునవఱలుటయును గొఱకవడుటయు నెయ్యెడ నెఱుఁగఁడతఁడు.

సీ తలఁ జూపలేక చిప్పలు ప్రాని ప్రంతల మెలఁగెడుతామేటి మేటి నవ్వి
కుండలు దాల్చి కన్గొనల నీ రొలుకఁ జేతుల జాపుకడ యెనుఁగులను రోసి
నిలువెల్ల వెంద్రుకల్పలసి నేలయుఁ ద్రవ్వుకొని మనుతోల్పందిగున్న నెన్ని
కాళ్లఁ జేతులు వోయి గాలి ద్రావుచు మంటఁ బొరలుచిల్వలపామిఁ బోవనాడి
తే. తిండి యెన్నండు నెఱుఁగక యుండి యడుగు, వరలఁ గాలేసిగుబ్బలిదొరలఁ దెగడి
పుడమిచెలి సేరె సిరులఁ బెంపడరె యటిది తేజు గాంచినయాచాల్పు తేర్లదొరకు.

సీ. కఱవు గేస్తులయిండ్లఁ గప్పునేఁతలయంద సుడిపడి కలఁగుట ల్మడుఁగులంద
కొట్లు బేహారులగోనబుటంగడులంద చిఱుచుగా గొండెము ల్తలుపులంద
పలుగాకిచెయివు లబ్రంపుఁగోనలయంద పొసఁగుచివ్వలు కాఱుపోతులంద
బలిమిమై నరిపెట్టుటలు సింగిణులయంద వాలాయపుంగాఁక పాలయంద
తే. కాని మఱి యెందుఁ గేనియుఁ గల్గనీక, నేల యేలెను దద్దయు నేర్పు మీఱ
వెలుఁగురాపంగడపుపాలవెల్లిసిందు, చలివెలుంగైనయారాచజదలమెకము. 21

క. అకడిఁది మేలిగొనముల రాకొమరుం డాండ్రు గాఁగ రహిఁ గౌసల్యం
గైకను సుమిత్రనుం దగఁ, జేకొని యెనలేనిసెమ్మిఁ జెలఁగుచు నుండెన్. 22

క. ఆటు లుండి యొక్కట న్మిక్కుటముగ నమ్మువ్వురకును గొమరులు లేకుం
డుటకున్ డెందములోపలఁ, గటకటపడి ప్రగ్గడలను గన్గొని పలికెన్. 23

క. కొడుకులు వుట్టనిమానిసి, తొడుకులు బల్మియును నిండ్లఁ దొడవులు మావుల్
పుడమియు నెక్కుడుమెకములు, విడిముడియుం జుట్టములును విత గద తలఁపన్. 24

తే. ఎన్నఁ గొమరులు గల్గక యున్నవారి, నిందు నందును నెమ్మది వొందదనుచుఁ
బుడమివేల్పుఁబెద్దలు నుడువుచుండు, రట్లగుటఁ గుఱ్ఱ లేక నాకు నబ్బవలయు. 25

ఆ. అనుచుఁ బల్కి యొజ్జ యైనవసిష్ఠుఁ, బిలువఁ బనిచి యెలమిఁ దలఁపునందుఁ
గలుగుతెఱఁగుఁ జెప్పి కర్జ మెయ్యది దీని, కనిన నాతఁ డిట్లు లానతిచ్చె. 26

క. విను ఱేఁడ నీకు బొట్టియ, లొనగూడు తెఱంగు నిక్క మొదవఁ జెలిపెడ్
మును రోమపాదుఁ డనఁ గాఁ దనరువనొడయఁడు డొకఁడు పుడమిఁ బగ నేలుతఱిన్.

సీ. వానలు లేక నెవ్వడిఁ బైరు లన్నియు వాడఁ దొడంగిన నోడి ప్రజలు
మిడుక నవ్వెండ్రుకయడుగులదొర యెల్ల నాఁడెంపుఁబాఱులఁ గూడఁబెట్టి
వాల్గుకన్నులవేల్పునకు వ్రేల్మి లెన్నేనిఁ జేసి మే లేమియుఁ జెంద కున్న
పేరుసెడఁ బాఱు లాసామిఁ గన్గొని యొడయఁడ విను మొకయడవిలోన

తే. ఏకలుకొని ఋశ్యశృంగుఁ డన్మునుఁడుదపసి, యుండు నిచ్చటి కాతని నోర్మిఁ దోడి
తెచ్చినప్పుడ వానలు దివిరి కురియు, మేయితాలుపుగమి కెల్ల మే ల్దనర్చు. 28

క. అని తెల్పిన నతఁ డప్పుడ, పనివడి వెలయాండ్ర చెప్పి పనిచి సరగ న
మ్మునిఁబోఁతుకొమ్ముతపసిం, గొని తెచ్చి కడుంకఁ దనమనూఁతు నొసంగెన్. 29

తే. అంత వానలు పుడమిఁ జెల్లడరఁ గురిసె, వంత లెడఁబాసెఁ బ్రజ యెల్ల సంతసిల్లె
దొరయుఁ బలువురుకొడుకుల బిసుసుమగలఁ, గాంచి సరి లేనిబల్వేడుకలఁ జెలంగె.

క. కావున నీ విపు డద్దొర, క్రేవకుఁ జని యతనిఁ జేరి కెంజడదారిం
దేవలయు నిచటి కాయన, వే వచ్చినఁ గోర్కు లెల్ల వెస నొనగూడున్. 31

తే. అనుచు నిటు లొజ్జ చెప్పినయట్ల యతనిఁ, దోడుకొని వచ్చి వేల్పులందొఱుఁగు దనియ
బారులుగఁ బాఱులనుగూర్చి వారువంపు, జన్న మొనరించి యారాచమిన్న మఱియు.

క. కొమరులు గలిగెడిప్రేల్మిఁ, దమి మీఱ నొనర్చుచున్నతఱి జేజేల్మొ
త్తము లై తామరచూలిం, దమముంపఱ నిల్పికొని పెనంగొను పేర్కన్. 33

తే. లచ్చి వాడమినచోటికిఁ బచ్చవిల్తు, నయ్యనెయ్యంపుఁబేటి కింపారు నేల
జోటిమగమానికపుమొలత్రాటి కెన్న, మేటియై మించు పాలమున్నీటి కరిగి. 34

క. అవ్వేల్పు లెల్ల మెల్లన, నెవ్వగ లన్నియును దోఁచి నెమ్మది యెడల
న్నివ్వటిలం గేలుగవ, ల్దవ్వులనె మొగుడ్చుకొనుచుఁ దారసిలి మొగిన్. 35

సీ. చెలువంపుఁజిలువరాసెజ్జఁ బండినవాని నక్కున సిరి సిడి చొక్కువాని
సుడివాలు చిందంబు కడరఁ బూసినవాని జిలుఁగుపసిండిదువ్వలువవానిఁ
దొలుమబ్బుచెలువంబు దొరయు నెమ్మెయివాని జగమెల్ల వలచుపొయగమువాని
మొసలివాపోఁగు లింపెసఁగఁ దాల్చినవానిఁ దొగవిందుసగుముద్దుమొగమువాని

తే. మేలివెలిదమ్మిరేకుల నేలఁజాలు, కన్నుగవవాని వలఁజేనిఁ గన్నవాని
యన్నియల కెల్ల మిన్న మై యున్నవానిఁ, గాంచి యి ట్లని యగ్గింపఁ గడఁగి రపుడు.

సీ. జడదారితలమిన్నచాలుపునెమ్మోము విరిదామరలపూపవేడి వెలుఁగ
కూళతోఁ ల్వేల్పుకూటువగాటంపుటడవులవేటి పయ్యరయనుంగ
కలుములనవలాచొకాటంబుకలుకపిసాళికన్గలువలచందమామ
బలితంపుచేడ్పాటుతొలుకరియదనుక్రొక్కారుకన్నీరుదాలుపుగములయాద

తే. పడలు పడసికడిందిదొసఁగఁగయాకి, బోరప్రాఁతదుకొలములపులుఁగుఱేఁడ
కెక్కుసప్పుప్పట్టువు తెవుళ్లకజ్జురాయ, తెకముగా నిన్నుఁ గొండాడఁ బరమె మాకు

క. జగములయేకిమీఁద నిదుం, బొగడఁగఁ బడినాల్గినోళ్లప్రోడయుఁ బలుకుం
దొగకంటియుఁ జాలనిచోఁ, బగునే పెఱవార లెన్నఁ దగువా రనఁగన్. 38

క. పెనుమినుకుకొనలు తెలిపిం, గనుఁగొనుబల్లిదున కైనఁ గనరానినినుం
గనుఁగొంటిమి మే మిప్పుడు, పెనుగొక్కుపుఁగుప్పఁ గన్న పేదలపగిదిన్. 39

క. విను దేవర మున్నెన్నఁడుఁ, గనని విననియట్టి ఱంపుఁగడగం డ్లొదవన్
మునుకొని నీయడుగుంగవఁ, గనుఁగొన వచ్చితిమి పెద్ద కడలుకొనంగన్. 40

క. చదువులమునుకఁడు మొదలౌ, దొదలించినబలిమివలనఁ బోటరి యగుచుం
బదితలలరక్కసులఱేఁ, డొదుగక యిమ్ముద్దగంబు నొక్కట గెలిచెన్. 41

సీ. కొఱ యయ్యె నిదురయుఁ గూడు వేల్పులఱేని కగ్గి యాఁకట చెడ్డియైన మెసవు
గుడియఁ జేకొని తద్దఁ గుంటిపాఱు జముండు గుదిరె రక్కసుఁడు సోఁకుడుతనమున
వలగొని నీళ్లక్రేవల నుండు నీళ్లఱేఁ డరయ బయల్వట్టి తిరుగు గాడ్పు
జక్కులకొలములోఁ జిక్కె రొక్కపుదొర బికిరము ల్గోను మిసుసికవలంతి
తే. మఱియుఁ దక్కినవేల్పు లందఱును వమకు, నెందు దెస లేక చనిరి కడిందిచేవ
నెసఁగునబ్బంతితలలరక్కసునికతన, నేమి చెల్పుదు మయ్య నీయెదుర నింక. 42

తే. వేలుపులవేల్పు మామొఱ యాలకించి, కనికరపుఁజూడ్కిఁ గనుఁగొని గాట మనుచు
నెదలఁ బొదలెడునలు కల్లఁ బ్రిదిలవఱిచి, సాఁకవే కోర్కి తీఁర్కఁ గొనసాఁగఁ జేసి.

క. అని మొఱ లిడుజేజేలం, గనుఁగొని యగ్గదుసుగుదుసుక్రైదువజో ది
ట్లనియె న్నీ కేక వగవం, జన దేమియు వేల్పులార చనుఁ డిక్కలకున్. 44

క. అక్కాకరక్కసులదొరఁ, జక్కాడెద నెదిరి పెక్కుచందమ్ముల న
మ్ముక్కంటి వచ్చి కాచినఁ, జిక్కంగా నీక మానిసితనం బెసఁగన్. 45

క. ఇమ్ముగఁ బది తేరులదొర, కొమ్ముల నే నడ్డెఱఁగలఁ గూర్మిఁ బొదమెదం
గ్రమ్ముకొని మీరు చెట్టుం, గ్రిమ్మరులై పుట్టుఁ డరిదిలేజు లెలర్పన్. 46

తే. అనుచు ననిచినప్రేముడి వాడ నచటు, గదలి వచలనిపేద్కలఁ బొదలి వార
లరిగి రిమ్ముల కిమ్ముల నంత నంతి, తేర్లదొర ప్రేల్మి నెఱిఁ గడతేర్చ యున్న. 47

క. నతనాల్కలజేజే యపు, డతనికిఁ బొడకట్టి పసిఁడిహరివాణముతో
డుతఁ దెచ్చి పాలయోగిం, బలిపలు ముప్పరకుఁ జెట్టు మని యిడి చనుడున్. 48

క. తదయక తేఁ దది గొని తన, పడఁతుకలకుఁ బంచి యిడిన బా గొప్ప బసా
పడి యమ్మెఱుఁగుంబోఁడులు, కడుపులతో నుండి రెలమి గడలుకొనంగన్. 49

క. చిట్టుములు నోకలింతలు, దట్టంబుగఁ బొడమెఁ జవులు దప్పెం గోర్కుల్
బిట్టొదవెఁ బిఱుఁదులుం జను, కట్టులుఁ గడు బలసె నపుడు క్రాల్గంటులకున్. 50

తే. వేలుపులలేవడులు కడువేగఁ దొలఁగెఁ, బడఁతుకలనెన్నడుముల లేవడులు దొలఁగె
నెఱిపిరాబొర్లక్రుక్కు లన్నియును దీఱెఁ, గలికిమిన్నలతమలక్రుక్కులును దీఱె.

క. తొలివేల్పులమొగములు తెల, తెల వాఱఁగఁ జల్లఁబాఱెఁ దెఱవలమోముల్
తులువలనడకలు దడఁబడఁ, దరిరాకుంబోండ్లనడలు దడఁబడఁదొడఁగెన్. 52

క. పుడమినఁబోఁడి వారల, కడుపులలో వెన్నునకుఁ దగం దనలాగే
ర్పడఁ జెల్వ జేఁగెనో యనఁ, బడఁతుకలకు మట్టిచారవ బలిసం బయ్యెన్. 53

తే. బొజ్జలలో ముజ్జగంబులు పూనుమేటి, పేర్మితోఁ దమబొజ్జలలోఁ బెరుఁగుచున్న
కలనఁ దద్దయు ప్రేఁగులై కనఁగ నయ్యె, మేనుదీవియ లారాచ మెలఁతుకలకు. 54

తే. మందసప్రబొంగరములపైఁ గందు మీఱి, వెలుఁగునిద్దంపు వేల్పువామలును లనఁగఁ
దమ్మిమొగ్గలపైఁ బొల్చుతుమ్మెద లన, నలరెఁ జెలువలచనుమొన ల్నలుపుమీఱి. 55

క. తెఱవల కడుపులలో నే, డ్తెఱ బెఱగెడు ప్రోడ రేయుద్రిమ్మరిదొరపైఁ
గొఱకొఱ నూర్పులు నిగుడుచు, తెఱఁగున గాటంపుటూర్పు తెమ్మెర లడరెన్. 56

క. లలిఁ జూలింతిరసంబులఁ, దలకొనుసమ్మద్దు నేలదాలుపునవఁగా
వలమానికముల కటుల, న్నెల లేర్పడఁ దొమ్మిదియును నిండారఁటయున్. 57

సీ. తొలినెల తెలిపెక్కు తొమ్మిదియవనాఁట నాలుగొండవతిక్కు నలరువాలు
గవలగనంబున నన్ని గాములును మేఁబ్రాచుక్కలఁ దనరార వేడ్కఁ బొదలి
మొదలివెలంది రాముని గాంచె రెండవ పడఁతుకరత్నంబు భరతుఁ గాంచె
మూఁడవచికురాకఁబోఁడి లక్ష్మణుని శత్రుఘ్నునిఁ గాంచెఁ గోర్కులు దలిర్ప

తే. నవ్వు డెకిమీఁదు తటిచెన్నువ్వ లమరఁ దీర్చి, పేదలకు నేలవేలుపుఁ బెద్దలకును
బొసఁగ రొక్కంబుఁ దొడవులుఁ బుట్టములును, దొడుకులునొసంగిపది రేలుగడపియంత.

తే. పదునొకండవ ప్రొద్దునఁ బట్టునల్వు,రకును పేరులు వెట్టి యారాచపెద్ద
విందులకుఁ బేదలకు నేలవేలుపులకు, నామెతలు వెట్టి దీవన లంది మఱియు. 59

ఆ. ముద్దుకొమరు లెలమిఁ బ్రొద్దుప్రొద్దున కొక్క,వన్నె యలరఁ బెరుఁగుచున్న వడుగు
లగను మెఱయఁ జేసి చదువు సాములు మొద. ల్గలుగ విద్దె లెల్లఁ గఱపి యంత. 60

సీ. చిన్నిక్రొన్నెల నెన్ను నెన్నొసళ్ల నొయారి యలఁతికస్తురిరేక లనువు మీఱఁ
గేలుఁదామరల మేల్జాళువాముదుగలు కెంపు లుంగరములు సొంపు నెఱప
మొలల హొంబట్టుక్రొందలుకుదట్టీలపై రతనంపుమొలత్రాళ్లు రంగు లీన
నెదల నున్నలిగోళ్ల పొదలినపతకము త్రెలిముత్తియంపుఁ బేరులు నెలంగఁ

తే. జెవులఁ గఱిమానికపుఁబోఁగులవలు మెఱయ, మొలకనగవులు ముదిపంపుజిలుఁగునడలు
ముద్దుఁబలుకులు గులుకంగ మ్రోల నాడు కొమరులను జూచి మది నుబ్బుకొనుచునుండె.

క. ఈచందంబునఁ దద్దయు, నేచినవేడుకల నుండునెడ నొకనాఁ డా
రాచూలికడకు వచ్చెం, బూచులదొరఁ బోలుతపసిపులి యొకఁ డెలమిన్. 62

క. వచ్చినయక్కౌశికునకు, మెచ్చుగఁ బూజ లిడి బత్తి మీఱఁగ మగఱాల్
గ్రుచ్చినసింగపుఁబీఁట, న్నిచ్చలముగ నిల్పి పల్కె నేర్పు దలిర్పన్. 63

ఆ. రాచజోగికిక్కరాయఁడ నీవు మానఁగరు సేయ టెల్ల మిగుల మేలు
సేయుటయుఁ గాదె చెప్పెడి దే మిఁక, నహహ దొంటిపున్నియంపు పెంపు. 64

తే. ఇంచుకేనియు మిముఁ బ్రోచి కొలువ, నేర నేమియు నాయెడ నేర మిడక
చెలిమి మెఱయంగ మెల్లనఁ జెలువు మిటులు, దొరకొనని నోజనదాశిరాయ.

క. వారువము లందలంబులు, చేపలు పల్లియలు పసిఁడి తెలె లేఁగుల్
జీరలు తొడవులు నూఁడు, స్త్రీ రొసఁగినయవియ కానె నిక్కం బరయన్. 66

క. కావున మాయెడ మీకుం, గావలసినకర్జ మెద్ది గల దది మాతో
వేవేగఁ జెల్పఁ డిమ్ముగఁ, గావించెదఁ గొంకు లేక కనికరపుగనీ. 67

తే. అనినఁ దద్దయుఁ బొంగి యయ్యడవిమన్కి, పట్టుబడ్డిట్ట యమ్మేటిపచ్చవారు
వపువజీయకొలంపుకల్వలయమంగుఁ, గాంచి నునుదియ్యఁబల్కులు గదురఁ బలికె. 68

క. ఒరయఁడ యే నొకజన్నముఁ, గడు వేడుకతో నొనర్పఁ గడఁగిన నెపుడున్
గడుఁగిరక్కసు లియ్యరు, దొడర వడిం జెఱుపుచుందు రదుర చల మొదవన్. 69

క. అవ్వైరసుపాలసురిందుల, నుబ్బణఁపఁగఁ జాలఁ డెన్న నొక్కంచుకయుఁ
గుబ్బెరవి గ్గలజోమను, గొబ్బున నిఁక నీదుపెద్దకొమరుని నిమ్మా. 70

క. కదకదయొడయనిముంగై, కడియపుమన్నెత్తఁ బంపు గామిడి మన్నం
బునతుకకై యిమ్మానిసి, యొడ లూనినవాఁడు నుమ్మె యుక్కు దలిర్పన్. 71

క. ఈనని బొసటగాఁ గొని యాతులపల నడఁచి జన్న మలర నొనర్తున్
నీతలఁపున నిపు దేమియు, బీ తునుపక యసుపు మనిన జెగ్గలి యతఁడున్. 72

తే. అయ్యయో గుండియ ఝల్లురనెమనట్టి, పెట్టవపుమాట మీనోటఁ బుట్టెఁ దగునె
యెట్టిపనియైన నొనరింతు నేనె సెలవు, పెట్టుమను గాక మీ కేల పెఱతెఱంగు. 73

క. ఏపని సెప్పిన నొనరుప నోపని వేమైనఁ గలదె యోపెనుపమీ
పూపనిగారపుముద్దుల, పాపని నెడఁబాసు నీకుఁ బాడియె చెపుమా. 74

క. అకటా పసినిసువులఁ గొం, కక కాఱడవులకుఁ బనుపఁగా వలె నని కో
రికతోఁ బలికెద వెవ నిం, చుకయుం గనికరము నీకుఁ జొప్పడదు గదా. 75

క. మానక పూని కదంకన్, వేనోములు నోచి గీముపేల్పుల కెన్నో
కానుకలు నించి కాంచిన, కూనలఁ గానలకుఁ బనుపుకొన నేరుదునే. 76

క. కటకట మును జనవా ల్లె, వ్వటికిం గనికరపుమనికిప ట్టనయు నేఁ
డిటువలె మీ రొడక పల్కుట లరయఁగ మిగుల వెఱఁగు గొలిపె న్మదికిన్. 77

ఉ. బల్లిమ లై జగంబు మనుపం జెఱుపం గలయట్టిమీర లి
ట్లుల్లమునందు పోఁకుముల నొండొకకొందఁగఁ జూచి చెల్లఁబో
యి ల్లొగపటునం గదచి యేఁగఁగ నేరనిచుంచుమల్లులన్
మొల్లపుఁగాఱుకొనలను మున్నరికం గొనిపోవ జూతురే. 78

చ. అన విని నల్కి యబ్బలియుఁ డాతని క్కను ముస్సు మీరు కో
రినటి యెద్ది యైన నొసగించెద నంచుఁ గదంక నాడి చ
య్యన నిపు డూరకే కడపి యంపఁ దలంచెదు మేలు మే ల్భళా
కనుఁగొన నయ్యె నీచెనుకఁ గాండ్రు లెల్ల నియ్యెడన్. 79

సీ. పలుమఱుఁ జలువతావులఁ జేరి పొరలుచు నంకరసదలచే వఱలి యిరిది
తేజునఁ బడగ లెత్తియు నిరుఁబట్టుఫు దొరలఁ గన్గొని మూలఁ దూఱుకొనుచుఁ
బొర యూని మేతాలుపులఁ జెట్టు మని పెఱ కొలుపుచు రెండుకాల్కులు దనర్పఁ
బుడమిపై నెయ్యెడ నడుగిడ నేరక బిట్టూరకయు బుస కొట్టుకొనుచు

తే. సన్నగాండ్రను బోఁదోలి సరగ వారి, నెలవు లెన్లను గైకొని చెలఁగుచుండు
తులువవిసదారిరాకాటువలకు నెందుఁ, దలఁప నొక్కించుకయుమంచితనము గలదె.

క. కల్లల కెల్లను బుట్టిన, యిల్లనఁ జెల్లనఁ జెలంగునెకిమీఁదుల కే
బ్బిదులుం గొఱ యగుమరె, తెల్లంబుగ నొకటి నీకుఁ జెప్పెద వినుమా. 81

తే. రక్కసు లనెంక పలుమాఱు ప్రక్కి కన్న, ప్రన్నియం జెల్లఁ జెడు నని యెన్ని కాక
కీసిసి తెట్టినఁ బఱియ లై చనక యున్నె, పసిఁడిపెన్బొజ్జరాప్రస్థుపఁటిగములు. 82

ఆ. ఆసిన వెఱచి యొడయఁ దయ్య మీయొద నింత, కినుక యేల తోడుకొని చనుండు
కూర్మి నంచుఁ బెద్దకొడుఁకను గడపటి, గాలిపెద్దకొడుకు నప్పగించె. 83

క. లివిరి యిటు డపసి జన్నపు నెపమున నమ్ముప్రరాచసిసువుల నెకిమీఁ
డు వనుప దోడ్కొని యటు వెడలి వడిం బఱతెంచె నవ లలిం జనుకడఁకన్. 84

తే. అత్తెఱంగున వేవేగ నరుగుచుండఁ, ద్రోవ నొకచెంత నబ్రంబు దోఁపఁ బెద్ద
కొండవలె వచ్చులొలివేల్పుఁగొమ్మఁ జూపి, బాసవాల్మిన్న యూరాచపట్టి కనియె.

క. అల్లదె తాటక యనియెడు, కల్లరిరాకాసి పొగరు గదురఁగ వచ్చెన్
వి న్లెక్కుడి యొక చిల్కునఁ బ్రెక్కొంప్రము పొలఁతి యనుచుఁ జెగడక దానిన్.

క. చల మే లగ్గలముగ న, చ్చలమే పెంచుకొని తులువజాడ నడచున
ప్పొలమేఁచరిచెలి ద్రిమ్మరుపాల మేతఱి నైన వేలుపులు సొరరు సుమీ. 87

క. అని పెక్కుదొడ్డతూపులు, నెన రొందవఁగ నిడిన వేడ్క నివ్వటిలం గై
కొని రాచపట్టి సింగిణి, గొనయం బెక్కించి ముల్కిఁ గూరిచి కడిమిన్. 88

క. తెగ నిండఁ దీసి రక్కసి, చిగురాకుంబోఁడిమీఁదఁ జిమ్మిన జెడివం
బుగ మింట మంట లెగయఁగ, నొగిఁ జని యమ్మసికి దానియుసురులు గొనియెన్.

క. అపుడు జడదారిఱేఁ డు, ల్లపుఁదామర నలరి వారలం దోడ్కొని వై
కపునదకలలోఁ దనజన్నపుటి గ్గలయలముఁదోఁపునకుఁ బఱతెంచెన్. 90

సీ. గజ్జులేమంరి మ్రాఁకుల నంటఁ బ్రాఁకిన వనవంపువలిరానుపందిరులును
వలపుచెంగల్వబావులక్రేవ జాల్గొన్న చలువగొజ్జఁగినీటిజక్కరలును

బ్రోదికప్రపుటంటిబోదియజాల్స్రోలి జడ గొన్నమరుగున్నసంపఁగులును
బలితంపునెత్తమ్మిగొలఁకులకెలఁకులఁ బొదలుమొల్లపుమొల్లపూఁబొదలును

తే. కలిగి మఱిసోఁపు బండ్లు గాయఁగం జిగుళ్లొత్తియింజియంబు పూలు ముత్తియలం దనర్చు
నెల్లచెట్టులు నలర నచ్చున్నపంపఁ గానిరాబారి సెలమొక్కఁ గోన మెఱయు. 91

క. అనయంబు నచటి వెలిని, య్యనిపడులు మెక్కి చొక్కి యక్కజపుఁజిగి
న్నెరుమినుకులు నక్కొనలం, గొనకొని మొలుఁగించు మరుసిగల్లఁబుఁదుటుముల్. 92

తే. తగిలి సెగడెదుప్రేమిపొఁగలు మొగల, తొఁగనియు మిక్కుటుఁవుంబు తివిరి మెఱయు
నుఱుము లనియెడు మబ్బిరివిచ్చి యెఱుబ్బియాడు,గప్పమెడ ప్రల్లుగములాముగవిసీయందు.

ఉ. వెన్నెలరాచతాచలువవిప్పుటరుంగులఁ జేరి జాళువా
కిన్నర లూని జాను దిలకింపఁగఁ బాటలు వాడుబొసవా
ల్కన్నియమిన్నగాణలకు గాటముగా సుతు లిచ్చు నచ్చటన్
గ్రొన్ననకమ్మతేనియలు గ్రోలుచుఁ దుమ్మెదబోటికూటువల్. 94

తే. తమ్మిగొలఁకుల నోలాడి కమ్మపూవుఁ, గొమ్మలు గదల్చి కపురంపుదిమ్మ లెక్క
నెమ్మిగ్రొమ్మావినీడల నిలిచి పొలిచి మెలఁగు పలినాలిచిఱుగాడ్పు లెలమి నందు. 95

సీ. పసిదిండిమెకపులేబాలెంత లాకొన్నజింకకూనలకుఁ బా లేపి యొసఁగఁ
బదగ లడ్డుగఁ బట్టి పాఁపచేడియపింఛు లెలుకబోదల కెండ దోలఁగఁ జేయ
సింగంపుఁజెలులు మచ్చిక మీఱ నెక్కుడు మెకముపిల్లల దువ్వి మేఁత లిడఁగ
చిత్తరంపుజవాదిపిల్లి వెలందుక ల్చిలుకముద్దియలతోఁ జెలిమి నెఱపఁ

తే. గాదమతోఁ డేటిజోటిచా ల్గాండగాఱియ కన్నియలఁ జేరి తద్దయు గారవింప
నబ్రముల కెల్ల నాటప ట్టనఁగఁ జూచి, వెలుఁగునమ్మేటితపసిరేవెలుఁగునెలవు. 96

తే. అట్టితనయున్కిపట్టున కత్తెఱఁగున, బుజముపట్టుపుమట్టిబెబ్బులులఁ దెచ్చి
తనియఁ బూజ లొసంగి యత్తపసిరాయఁ,డంతఁ దా జన్న మొనరించునదమనందు.

క. తులువతొలివేల్పు లిరువురుఁ, బలితపుటా మెసఁగఁ జవల బలుమూఁకలతో
నిలిచి చలమార నల్లయుఁ బొలసును గురియించుచున్నఁ బొడఁ గాంచి వెసన్. 98

క. రాకొమరుఁ డపుడు వింటం, జోకగ రెండమ్ము లూని చుఱు కలరఁగ న
య్యాకసమునఁ ద్రిమ్మరుబ, ల్రాకాసుల నేల నిర్వ్వరం బడ నేసెన్. 99

ఉ. అత్తఱి జోగివేల్పులొడయుం డెప నాతని మెచ్చి కూర్మితో
నెత్తి కవుంగిలించుకొని హెచ్చుగ వేలుపు లెల్ల సొంపు ద
ళ్కొత్తఁగఁ జేరి ప్రేలుముల నోఁకపుఁబాప్పు కొనంగ గిత్తరా
తొత్తడిఱేఁ డెవం డనియఁ దప్పక జన్న మొనర్చి యంతటన్. 100

క. ఇరుచక్కమేను లూాన్ బలు, దొరకొలపుంబాలవాఁగుతొగలయమున్నై
పరఁగెడునప్పుడి తేరుల,దొరపట్టికిఁ బొలమున్కిదొర యిట్లనియెన్. 101

క. విను రాచపట్టి జనకుం, డనునాఁ డొకఁడు మిథిల యనియెడువీటన్
బని మీఱు సీత యనియెడు, తనబిడ్డను బెంపొంది సేయఁ దలఁచి కడంకన్. 102

తే. నలువు మెఱయంగఁ బెద్దలనాఁటనుండి, మున్ను దమయింట డాఁకొని యున్నవిన్ను
మూలదేవరవిల్లెత్తఁజాలు మేటి, కిత్తుఁ దనకన్నె నంచు నొట్టిడుక యతఁడు. 103

ఆ. పుడమిలోనఁ గల్గుపుడమిఱేఁడుల కెల్లఁ, జేటపడఁగఁ గడలఁ జాటఁ బనిచె
నయ్యె ముజ్జగముల నలరాచకన్నియ యుద్దిఁ బోల కట్టిముద్దియలును. 104

క. మీలుం దామరపూలును, మేలగునమ్ముద్దరాలిమినుకుఁగనుఁగవన్
బోలక నీట మునింగెన్, మూలకు దొర గాక యిర్లు మూలకుఁ జేరెన్. 105

క. ఒడలుం దొడలు న్నడలు, న్నడుముం జడయుం దనర్చు మెలఁతకు మేల్పొ
త్తడి నంట్ల నచబోదల, నడకెడు చింపములఁ దోట్ల నల్లన నగుచున్. 106

క. తొవలా కన్నులు వలిజక్కవలా పాలిండ్లు తేఁటిగములా కురు లా
నవలాతో నెనఁ బోలుప, నవలా నిక నొకపోలంతి యబ్బదు సుమ్మీ. 107

సీ. తుమ్మెద ల్సోలవిండ్లు తొగలు సంపఁగిమొగ్గ మగఁతాలు తేనియ ల్మంకెనవిరి
యద్దము ల్తామ్మిదు లలఁతివెన్నెల సంకు తూండ్లు కెందామర ల్చెండ్లు చిలువ
తరఁగలు సుడి మొగిల్దారి యరుఁగులు మఱి యనంటులు దొవ ల్మఱ్ఱిపండ్లు
తలిరులు రిక్కలు తాఁబేళ్లు రాయంచనొడములు గపురంబు కుందనంబు

తే. ననలు చిల్కుకయు నొనగూర్చి నల్మొగముల, ప్రోడ తన ప్రోడతన మెల్లఁ బుడమియందు
నెఱపఁగాఁ గోరి యమ్ముద్దుచెలఁత నట్లు,పొలుపు మెఱయంగ నొనరింపఁ బోలుఁజుమ్మి.

క. రేదొర మొగమున కెన చివు, రే దొర పల్వరుసతోడ నిఱిగుబ్బ లయా
రే దొరయుం జక్కవకవ, బైదలినలు వెన్న నలువపడఁతికిఁ దరమే. 109

సీ. తలిరులేమావి క్రొత్తజవాదిబలు క్రోవి పలపులదీవి చెంగలువబావి
ముగుదలమేల్బంతి సొగసులదొంతి క్రొంబొగడపూబంతి యబ్బురపుటింతి
మానికమ్ములమూట మరుని గెల్పులకోట పండువెన్నెలతేట పసిఁడిపేట
కపురంపుదిమ్మ చొక్కపుఁదస్కకీల్బొమ్మ మొల్లంపుదాసిమ్మ ముద్దుగుమ్మ

తే. తేజులకొటారు వలువముత్తియపుఁ బేసు, కడిఁదిజగరంగు తొలుకరి కాత్తె యుంగు
నునుపికిలిచెందు పరువంపుపనసపండు, నాఁగఁ దగు నన్న సన్న యన్నాతిమిన్న.

క. తలతల మనునపరంజిం, దలదళమనఁ జెలువమ్లిపపుడాల్పులువిం
దలఁ దలరాచముద్దియల, తలతలమానికము నాఁ దరమే చూడన్. 111

క. నగు నగు వెన్నెలనిగనిగ, జిగి మిగిలినకెంపుసొంపుఁ జెఱుచుఁ బెదవి యొ
ప్పుఁగ నగు నమ్ముగుదసొగసు, దగతిగతీపొందుతూపుదొరకీవి సుమీ. 112

మ. తెఱచు ల్వేయు నిఁ కేల యా తెఱవ యూదానిమ్మపూరెమ్మ యా
నెఱిగ ప్రంపుటనంటి క్రొమ్మెయిలక యానిద్దంపులేమావి యా

మెఱుఁగుంబోఁడియతీవ యాననజిరామేల్జోదువాలాయమున్
గఱుకుంగైదువ యాకడిందివలొకన్నాడు నీకే తగున్. 113

తే. మోవిచిగురును వలిగుబ్బపూవుగుత్తు, లక్కజపుఁబల్కుతేనియ లరిదికీలు
గంటుతుమ్మెదదిమ్మును గలిగి యొప్పు, పుడమి కానుపులేఁగొమ్మఁ బొగడఁ దరమె. 114

క. అని తెల్పుచు వారలఁ దోఁ, డ్కొని యప్పుడె కదలి తపసి గొలఁకులు నేఱు
ల్వెనుగోనలుఁ బల్లియలుం, బొసరారఁగఁ గడచి వైశమునఁ జనునెడలన్. 115

క. కడు నరుదుగఁ దెరవున నొక, పడు కానాడెంపురాచపాఁపనియడుగుం
గడ యొక్కించుక సోఁకిన, నడరెడుతలిరాకుఁబోఁడి యై తగ నిలిచెన్. 116

తే. నిలుచుటయు నబ్బురం బెద నివ్వటిలఁగ, జెప్ప రేయక యన్నెలజేఁడు దాని
సోయగం బెల్లఁ గాంచి పెక్కాయి ముద్దు, తెఱవయై నిల్చుటిది యేమి తెలుఁగు నేఁడు.

ఉ. వీచులకంటితొయ్యలియొ వేల్పువెలందియొ జిక్కమోరతే
జానయొ పక్కిరాచెలియొ జక్కులవంగడపుంబడంతియో
కాని జగంబునం దరయఁగాఁ జెలికొమ్మల కిమ్మిటారపుం
జా నొకయింతయుం గలుగఁజాలునె యంచుఁ దలంచుచుండఁగన్. 118

క. రాకొమరుఁ జూచి యచ్చెరు, వాసుంబోఁడియు వలంతియై యిట్లను నో
సోఁకుడులసూడ వినుమా, నీకుం దన మొదలితెఱఁగు నెఱి నెఱిఁగింతున్. 119

సీ. మును గౌతముఁడు నాఁగ నొనరుపంటవలంతి జేజేనిరా బారిసింగమునకు
గారాబుటిల్లాలఁ జే రహల్య యటంచు రొకనాఁడు వేలుపుటొడయఁ డెమ్మె
నముఁ గోరి పుంజుగూపునఁ జేరి నడురేయితఱి నింటివెడఁ బొంచి యఱచుటయును
దెల్లవాటె నటంచుఁ దివిరి యజ్జన్నిగ ట్టేటిపాంతకుఁ గ్రుంకు లిడఁగఁ జన్న
తే. నపుడె జన్నపుఁదిండిరాయుండు సెలఁగి, పెక్కుదెఱఁగుల రాచిల్కజక్కజోదు
పనులకై వేఁడుకొన నియ్యకొని యతండు, నేను నెన లేనినెమ్మది నెనయునెడల.

క. వేకుట గన రాముండిన, పేగ మరలి వచ్చి తపసివెన్నెలజేఁ ద
ట్లాగడమున మెలఁగెడుమము, బాగుగఁ బొడఁగాంచి యెదను బాయనికినుకన్. 121

క. పేండ్రముగఁ దిట్టుటయు జవరాం, డ్రెవ్వరు ము న్నెఱుఁగనియాఁగద యొదవన్
గుండ్రాతిరూపు గైకొని, తండ్రీ పెక్కేఁడు లిందుఁ దరలక యుంటిన్. 122

క. కను నరుదుగ నీయెద నీ, యడుగుంగొన యంత సోకినంతనె చెడుగుం
గొడిమెలు విడి చని క్రమ్మఱ, మడఁతితనం బొదవె నన్ను మానిసిమిన్నా. 123

క. ఓవలఁతి యిజ్జగంబు, ల్లావిరి నేలుకొనఁగా వలసి నీ వెపుడుం
గావింపుచుండుకర్జము, లేవారితరం బెఱింగి యెన్నిక సేయన్. 124

క. అద నొదవ మీను మేనం, బొదలుచు మున్నీరు సొచ్చి పూనికతోడన్
జదువుల తెక్కలికానిం, జిదిమి నలువకలఁక దీఱిచితి వీవె కదా. 125

తే. తివిరి జేజేలు మానిసిదిండికాండ్ర, వంతులను గూడి పాలేఱు ద్రచ్చుతఱిని
మేటితామేటిమే యెత్తి మెట్టుక్రింద, నిలిచి యుండిన ప్రోడవు నీవె కావె. 126

తే. జాళువాకంటితొలివేల్పు నేల యెల్లఁ, గొంచు విసదారిబెంకి కేతెంచుచున్నఁ
బూని తొల్పంది గున్న వై వాని జీఱి, కోఱకొన మన్ను దాల్పవే కోరి నీవు. 127

ఉ. వెన్నునిఁ జూపు మంచుఁ బదివేలవితంబులఁ గన్నబిడ్డని
న్నిన్నక స్రుక్కఁ జేయుమిడిమేలపునంజుడు దిండిరాచబ
ల్మన్నియఁ జెండవే బిరుసుమానిసిసింగపుమేను పూని యో
యన్న పసిండిబొజ్జదొర కైన నినుం గొనియాడఁ బోలునే. 128

క. గుజ్జువడుగ వయి మును దన, యొజ్జపలుకు వినక చాగ మొసఁగెడుచో మూఁ
డజ్జల నుజ్జగములు గొని, యజ్జేజేగొంగఁ గ్రింది కనిచితివిగదా. 129

క. ముయ్యేడుమాఱు లెక్కటి, కయ్యంబుల నేలదాల్పుకన్నాకుల బ
ల్వ్రయ్యలుగ గండ్రగొడ్డట, నొయ్యనఁ జక్కాడి కడల నునుపవె యసముల్. 130

క. ఈరైదుమత్తుకలపోల, మోఱెపుమన్నీనిదాడి కోర్వక జేజే
బారులు మొఱ పెట్టినఁ బని, తేమలదొర కిపుడు గల్గితివి గద జియ్యా. 131

క. కొనరిక్క పేరిపాలఁతుక, పెనిమిటి వై నాఁగలియును బెనుదాటిసిడం
బును బూని తవశికాండ్రం, దునిమి పుడమిపడఁతి వ్రేఁగు ద్రోయుదువు గదా. 132

తే. పాలపు మేఁకరిక్రొన్ననఁబోఁడి లెగల, యీలువులు మొక్కవటిచియు మేలికత్త
లానిపై నెక్కి మొనసి పాలసుల నెల్లఁ, జిదుమఁ గలబల్లిదుఁడ వీవె గదవె తండ్రి

సీ. చదలుకానుపుదిండిచలువపాన్పునఁ బండి జోగంపునిదురలఁ జొక్కుటేఁద
మాటలతొగగంటిమగనిగ్రుడ్డుపవంటిపోవ్రులు బొజ్జగాఁ బూనుమేటి
జగడంపుటోరెంపుజడదారినాడెంపుఁబాటల కెవ నుబ్బుబల్లిదుండ
తనకులీనకడానివలిపెమువ్పటి మేని కవవు మీఱఁగఁ గప్పుకొనునోయారి

తే. కడిఁదివిలుకాఁడ పలుపరక్కసులసూడ, నుసువఁ దగుబంట తపసులనోముపంట
యందమలగీమ నెఱరాచచందమామ, తెలిసి యగ్గింప మాబోంట్లకలమె నిన్ను.

క. అని యిటు లెపనెత్తినబ, త్తిని వేమఱుఁ బొగడి పొలము తెఁకిముగుదక్రొ
న్ననఁబోఁడి సనిన వారుం, జని రొయ్యన మిక్కిలి కపుడు సాళస మెసఁగన్. 135

క. అత్తఱి నబ్బలువీటికి, మొత్తము లై వేలపెండ్రు మునిపము లొందవ
న్నిత్తరిఁ గైకొనియొద మన, తత్తరమునఁ జేరి కలిమి దలు కొత్తంగన్. 136

క. ఎక్కుడు మెకములఁ జేరులు, జిక్కుపసువు లంచలములఁ జాలుపులకుఁ జుఁ
గ్రిక్కిఱిసి లెక్కలకుఁ గడు, మిక్కుట మై యెల్లకడల మెఱసెం బ్రోలన్. 137

సీ. కొమ్ముటేఁడుగుమబ్బుకూటువ చ్ఛెల్కు మత్వపుటాముసీరొబ్బట్లు వాన గాఁగఁ
బలువెఱంగుల బోరుకలుగువాయిదపులు గడిపంపుటుఱుముచప్పుడులు గాఁగ

రవళిఁ బొఱల లాడుపువ్వుఁబోండ్లమేచుదీవియలు మెఱుంగునీవియలు గాఁగ
ముత్తైదువలు దటముగఁ జల్లుబలుపోయగపుముత్తెములు వడగండ్లు గాఁగ
తే. మేలుటెక్కెపుఁ రతనంపుమిక్కుగములు, వేల్పుపాలెంపుటెకిమీనివిండ్లు గాఁగఁ
జాలిగొడుగు లెల్ల మరువ్వులతెరలు గాఁగ, వఱలె వీ డప్డు తొలుకరితఱిని బోలి. 138
తే. పుడమి యీనిపవుంపున నెడ యొసంగ, లేక మూఁకలచేతఁ బ్రో ల్వొలుఁగుచుండె
నిట్లు గూడినయెకిమీండ్ర కెల్లఁ జెలిమి, మెఱయ విడిపట్టు లొసఁగె నమ్మిథిలఱేఁడు.
సీ. పొడవుఁగంబము లన్ని పన్నుగ నిడ్డ తెరముత్తియంపుఁబందిరులవలనఁ
దళుకుపసిండిగోడలఁ గీలుకొల్పిన పలువన్నియల వ్రాఁతపనులవలనఁ
పలిరులు దొగలు చెంగలువలు గూర్చి యందముగ నించినతోరణములవలన
వెల లేనితగటుదువ్వలువలు చుట్టి యగ్గలికఁ గట్టినమేలుకట్లవలన
తే. దట్టముగ మ్రోయుసెఱవాయిదములవలన, బుగులుకొనియెడుకపురంపుఁబొగలవలన
మేత్తెఱం గెల్లఁ గనఁబడి మెఱయుచున్న, తనయగరిలోని కెలమి సమయఱచు దెచ్చె.
తే. ఓలిఁ దగుచోట్ల వారిఁ గూర్చుండఁ బెట్టి, తమ్ములమ్ములు మంచిగందములు జింక
పొక్కిలియుఁ గప్పురము గందవొడి మొదలగు, మంచిసరకులచే నామతించి యంప.
క. వలపుగ నతఁ డొంతేనియు, బలిమురఁ జెక్కుండ్ర నేర్చి పనిఁ బూనిచి గు
బ్బలియుఁబలెఁ దనయింట, న్దలకెడుసింగాణిఁ గ్రన్ననం గాపించెన్. 142
క. తెప్పించి వారిముందఱ, నొప్పారఁగ మనిచి మిగుల నుల్లముఁ దమ్మిన్
ముప్పిరి గొనియెడువేడ్కల నప్పుంటవలంతిరాయఁ డమ్మిలి వనియెన్. 143
క. రాకొమరులార గుబ్బలి,రాకన్నియమగనియుబ్బురపువి ల్లిది ముం
దాకటిమెడదొర దీనిం, డాకొని బలుటక్కరుల నడంచెం గడిమిన్. 144
క. పెద్దలతరమునఁ దుడియుఁ, దద్దయు నిది యలరుచుండుఁ దమనెలవున వే
సుద్దు లిఁ కేటికి వినుఁ డా, సద్దేమియుఁ జల్పఁ బోక జతనం బొదవన్. 145
ఉ. మూఁగినరాచసింగములమూఁక గనుంగొని మేలుమే లన
న్వీఁగక నిల్చి యెక్కిడిఁదిక్కిల్లరివోసిన ప్రోడ కేను మే
ల్గాఁగ నొసంగుదు న్వలపుఁగప్రపుఁగుప్ప యనం దనర్చుని
న్నాఁగటిచాలుపేరియెలనాగలమిన్న నటంచుఁ బల్కినన్. 146
తే. విని పుడమిఱేఁడు లెంకయు వెఱఁగుపడుచు, నద్ది కాకొండ తుద్దియె కొద్ది గాక
యున్న విలు దెచ్చి యొంవఱ బన్న మొందఁ, జేసెఁ బో వీఁడు దబ్బర చేసి నేఁడు.
తే. అనుచు నెమ్మొగముల విన్నఁదనము దోఁప, జరిగి యూరక సన్నక సన్నఁ గొంద
ఱొక్కకొందఱు దొరలు వి ల్లెక్కిడంగఁ, బూని కదలింప నోడియు మ్రానుపడిరి.
తే. మున్నఱికతోడఁ గొందఱు మన్నెతోడ్లు, గోరి సింగాణి గొనయంబు గూర్పఁ బూని
పొదవి చేతులఁ బొరలించి పుడమిపైని, నెగయ నెత్తఁగ నింతయు నేరరైరి. 149

చ. అటువలె రాచవేల్పుదొర లందఱు నుక్కఱి స్రుక్కి వీఁగి యే
గుటఁ గని ప్రొద్దువంగడపుఁగ్రొన్నెలరా జడదారివంపువం
దటుకున విల్లు పుచ్చుకొని తప్పక యెక్కిడి నారి లాగుచోఁ
బెటపెటలాడుచు న్విఱిగెఁ బెల్లుగఁ జప్పుడు వింట నంటఁగన్. 150

ఆ. ఏపుతోడ నాఁడు టేమఁగుచున్న లేఁ, జెఱకుఁగోల విఱుచు తెఱఁగు దోఁపఁ
దోలుదాల్పువిల్లు దునిమినయజ్జాణఁ, జూచి యబ్బపేరిరాచగిబ్బ. 151

క. నానయము వెలుఁగును పెద్దయు, లో నెరయఁగ నతని మెచ్చి లోఁజించుకయుం
బూననినెయ్యంబున న, క్కానవిడారంపుసామిఁ గన్గొని పలికెన్. 152

ఆ. జోగిబొబ్బ మెకమ యీగళగపుఁగట్టి, లెవ్వ రెందునుండి యేఁగుదెంచి
రిట్టిబలిమికాండ్రు రెవ్వరికొమరులు, తేటపడఁగ మాకుఁ దెలుపవయ్య. 153

క. మిముఁ బోనిబల్లిదులు మే, ల్నమకూర్పుటకొఱకుఁ గాదె చనుదెంతురు ని
క్కముగ నిపు డెల్లకోర్కులు, నమరెం గద మిమ్ముఁ జూచినంతనె మాకున్. 154

చ. అనవుడు నాఁడ డిట్టు లను నయ్యెకిమీనిమొగంబుఁ జూచి యో
గొనములయిక్క యిక్కమఁగల్లలు ప్రొద్దుకొలంపుఁబెద్ద యై
తనరుచు నుండుచాల్పుటరదంబులఁజేసియనుంగుబోద లే
పన నిట వచ్చి రీ విడినబుంచులరాయనివిల్లు గన్గొనన్. 155

సీ. మన్ను గ్రొన్ననబోఁడి మున్ను టక్కరిరక్కసుల మ్రోవ నోపక తలఁకుచున్నఁ
జదువులదేవర మొద లగువేల్పులు జిడ్డునీర్వామికిఁ జెవి యండఁ
బెనుబాఁపనునుబాపుఁడఁ దమ్మియింటితొయ్యలి యజ్జ లొత్తఁగ నత్తమింటి
వన్నునకప్పని వన్నెయించిన నగం దఱిముట్టి వారియక్కఱలు దీర్ప
తే. గోరి ముల్వేలుపులయిక్కకాలమునందు, జమిలిచోఁపంచ తెల్లరాచలి వెలుఁగున
కేపులోఁ బుట్టె నెదరులు వాపి పజలఁ, బ్రోవ ననుదుగ నిరుదుగరూపు లూని. 156

ఉ. అమ్మగఁ బూనికంబు దిట మారఁగ నొక్కలకోరి పెద్దరే
డ్రిమ్మరికొమ్మ నుక్కడంచి లేటఁగ జన్నము గాచి చట్టుచం
దమ్మున నున్నపెంపవసిలామునికంటిని బ్రోచి యిందు వ
చ్చె న్మొగి నీదుజన్న మఱి సేయక చూచుకదంక మీఱఁగన్. 157

తే. అరయఁ దీపంచవార్వంపుటగ్గి పట్ల, నడుమ నద రొండునాడెంపుఁబుడమిఱేఁడు
లెల్లఁ గదలింప లేనియివ్విల్లు గనిమె, నిప్పు డీతనిపుగఁ దనం జెన్నఁ దరమె. 158

క. చక్కలరాయఁడు మఱుఁడుం, బక్కలయెకిమీనివాడుపు నొక విల్లనియా
చక్కనిపాపఁడు నీకుం, దక్కం బో యల్లుఁ డై దిటం బొనరారన్. 159

తే. అనిన నువ్వారి రాచూలి యయ్య యింక, బాగు గావింప నేల యిచ్చటి కయోధ్య
యేలునొడయని జెండిలి కేపుతు పిలువఁ, బనుపవలె నని నెయ్య మేర్పడఁగఁ బలికె.



తే. పలుతిబంటుల నిరువురఁ బిలిచి మేలి,కమ్మ యొసఁగిన వా రొకయమ్మడిఁ జని
యోలగంబున నెమ్మదిఁ గ్రాలుచున్న, బంతితేరులరాచమేల్బంతిఁ గాంచి. 161

క. కేలెత్తి మ్రొక్కి వెసఁ దము, నేలినవాఁ డిడినకమ్మ యిచ్చుటయు నాతం
డోలి నది చదువుకొని కడు, వాలెంకల నీగివలన నలరించి తగన్. 162

క. వేడుకయు వెఱఁగుఁ గడఁకయు, నైదెందము చిక్కరు లెత్త నపుడె ప్రగడలన్
నాడెపుఁబాఱుల విందులఁ, దోడిదొరలఁ గూర్చి సొంపుతోఁ బయనం బై. 163

సీ. ఎడ లేక నడచుపత్తడులు సేనుంగులు తేరులు తరఁగలతెరలు గాఁగ
జడ తెల్ల నద్రువ విచ్చలవిడి మెఱయు వాయిదములు బెడిదంపునొదలు గాఁగ
సొంపారుతెలిముత్తియంపుజంపపుటెల్లి తోలు సిరంపుమురుగులు గాఁగ
బలితంపుహొయలు చెన్నలరురాకొమరులు కొమరొందునెఱమానికములు గాఁగ

తే. హరువు మెఱయంగఁ జాలగ లాడుగడన, వెలఁదుకలు పవడంపుఁదీవియలు గాఁగ
నుబ్బి పొదలెడుమున్నీటియుద్దివోలెఁ, దద్ద వేడ్కల మిథిలకుఁ దలరి చనియె. 164

క. చనుటయు నబ్బలియు నెదుర్కొని జనకుడు తోడుకొని చని పూజల్
పొనరించి మిథిలపేఁ డా,తని నొకవిడిపట్టునందుఁ దనరఁగ నునిచెన్. 165

ఆ. అంతఁ బెద్దబాపనయ్యలయానతి, వరుల యొక్కమంచిగడియదోయి
యందు రాగవునకుఁ బొందుగాఁ దనపట్టిఁ, బెండ్లి సేసె మఱియుఁ బేర్మితోడ. 166

క. తనతమ్మునిబిడ్డల నా తనితమ్ములు ముగ్గురకును దద్దయు వేడ్కన్
బెనుమిన్నుకుత్రోవఁ బెండ్లిం, డ్లొనరించి కరంబు గూర్మి యుప్పతిలంగన్. 167

తే. తగటుచీరలు రతనంపుఁదళుకుఁదొడవు, లందలంబులుఁ జదువా ల్గుందనంపు
టెల్లిగములును దూఁగుటుయ్యెలలు మంద,సలును నయ్యల్లువారి కొసంగి మఱియు.

క. చెయ్యిగలమొకపుబారులఁ, బయ్యరవడి గల్గుదక్కిపదువుల నిడి తా
నెయ్యంబున వియ్యాలకు, కయ్యెదఁ గడ లేనిసొమ్ము లప్పన సేసెన్. 169

ఉ. ఆఱనిలేజు గల్గి యలరారెడునయ్యెకిమీఁడు వేయినూ
టాఱులొక్కముల్ దొడవు లందలము ల్వలిపంపుఁజీరలుం
జాఱలు గాఁగ నింటఁ గలసొమ్ములు నెమ్మి నొసంగి యత్తఱిన్
బాఱుల బీదసాదులను బంధుగులం బనియించె నంతయున్. 170

ఆ. అటు లొసంగి యరుప నందఱుఁ దమతమ, నెలవుపట్ల కరిగి రెలమితోడఁ
బుడమికాన్పుమగనిఁ బొగడుచు నపుడాకు టింటిపోఁడ యొందుసేనిఁ జనియె. 171

తే. అంతఁ గొడుకులఁ గోడండ్ర నందలముల,నునిచికొని పేరకాని వీడ్కొని చెలఁగుచు
బలితేరులదొర త్రోవపట్టి యరుగు,చున్నచో నబ్బురం బొప్ప నొక్కయెడను.

క. వెఱఁగఁగఁ దనపేరిటిదొర, మఱి యొక్కఁడు గలిగె నిపుడు మంచిది మేల్మేల్
పఱిమి నెఱఁ జెఱుతు నని మది, నఱిమఱితోఁ బరశురాముఁ డడ్డము దాఁకెన్.

తే. తాఁకి యగ్గండ్రగొడ్డలిదాల్పు రేఁడు, ద్రిమ్మరులదాయ నలుకతోఁ దేఱి చూచి
యోరి ముడికాఁడ ప్రాఁతవిల్లొకటి ద్రుంచి, యుబ్బె దింకను నాదాడి కోర్వఁ గలవె.

సీ. కొఱఁత గానీక చిచ్చుఱకంటివెంగట గుఱుతుగా విలువిద్దె గఱచినాఁడఁ
దూఱి పేరిమి నైదునూఱుకేల్గ వలును గలబ్బిదునియామము మలపినాఁడఁ
జెలఁగి ముయ్యేడుమాఱులు గండ్రగొడ్డంటఁ దులువరాపౌఁజులఁ జెలవినాఁడఁ
దెఱగంటి ప్రోలి కేడ్తెఱ నేఁగు తెరవుగా గడితంపుమెట్టులు గట్టినాఁడ

తే. వెలయ నిరుదచ్చిరాచఱాబిలులలోన, మిక్కుటంబగు తేజున మెఱసినాఁడ
నట్టినాతోడ నీతరమా పెనంగ, నహహా పని దప్పె నింకేమి యనఁగఁ గలదు. 175

క. ఎట్టి మొనగాండ్రు రేనియు, గట్టిగ నాయెదుట దిటము గలఁగఁగ బఱతు
ర్నెట్టుకొని నేఁడు మిగుల, న్నొట్టెడ నీ వెట్లు నిలిచి పోరెదు చెపుమా. 176

తరల. అనుడు నబ్బలుజోదుఁ గన్గొని యూఱఁ డిట్లని పల్కె నా
దనమగంటిమి దానె యుబ్బుచుఁ దద్దయుం గొనియాడుచు
ల్వను మదిం గొఱ సేయఁ బోరు వలంతు లెల్లను నీ కిటు
ల్బునె యెన్నుకొనంగ వీఱిఁడిజాడ నీవ నిజం గదున్. 177

క. బవరమున కీవు రమ్మని, తవిలిన మావంటిపుడమివయ్యంబులతోఁ
డివిరి యెదుర్కొనఁగాఁ దగ, వవునే నెఱరాలమన్నియల కెంతైనన్. 178

చ. పలుకులు వేయు నేమిటికి బల్లిదులై తనరారుమీర లె
ట్లలిగినఁ జెల్లుఁ గాని తగవా మముబోంట్లకు మిమ్ము మార్కొనన్
వలదుగ మిమ్ము మానికపుమంగడపుం దొర లెన్న డేనిఁ బా
ఱులయెడ నల్గఁ బోదురె యెఱుంగమి నైన జెడ గుడాల్గనీ. 179

ఆ. అనిన సంతసిల్లి యచ్చిప్పవోటరి, బాపనయ్య రాచపట్టిఁ జూచి
మేలు మేలు నిన్ను మెచ్చితి నిఁకఁ జెక్కు,మాట లేల వినుము తేట మీఱ. 180

తే. తొంటిదఱుసువారుపంబులపలఁదిదివ్యుసు,విల్లు మసిమితి నని చాల విఱ్ఱవీఁగు
చున్నవాఁడవు నాచేతిగుఱుసుటువిల్లు, గొనయ మెక్కింపు మని యొసంగిన నతండు.

క. ఆవింటితోన యాతని,లావును నెఱతనము తేజు లాగుకొని కడున్
శివ దఱిర్పఁగ నెక్కిడఁ, వేవేగ లకోరిఁ బూని వ్రేయఁ దొడఁగినన్. .182

తే. తలఁకి యోయన్న యిప్పు డిమ్మలికి యేను, పెల్లుప్రోలికిఁ గట్టినచాల్పుమెట్టు
లేయు మని వేఁడుకొనిన నట్లేసి యతని, వీడుకొని యెల్లమూఁకలఁ గూడి మరలి.

తే. ఎలమిఁ దమప్రోలు సొత్తెంచి యెల్లపజలు, కోరికలు నివ్వటిల నెదుర్కొని కరంబు
బత్తి నెఱపంగ వారలఁ బద్దెఱుఁగుల, గారవించుచు నేడ్తెఱ గడలుకొనఁగ. 184

చ. పలుమఱు నాటచేడియలు పాటల లాడఁగ నేలవేలుపుం
జెలువలు గ్రొత్తముత్తియపుసేసలు చల్లుచు మెచ్చి వాఱు ల

గ్గలముగ నీగఁ బాఱు లాగిఁ గ్రమ్ముచు దీవన లీయ బట్లు వే
డ్కలఁ బొగడంగ లోనగరు క్రన్ననఁ జొచ్చి కడంక మీఱఁగన్. 185

తే. తల్లులకు మ్రొక్కి వార లెంతయు నొసంగు, దీవనలు గాంచి యొన లేసికీవి మెఱయ
నంత జన్నంపుఁగాపరి సంతసమునఁ, బుడమికానుపుచెలిఁ గూడి పొదలుచుండె. 186

క. అని పుట్టఁబుట్టువునకుం, గొనకొని వేలుపుల పెద్దకొమరుఁ డెఱింగిం
చిన నాలకించి యతఁ డా,యన నవ్వలికతయుఁ జెప్పు మని వేఁడుటయున్. 187

ఉ. వేలుపుటేఱు గప్పురము వెన్నెల లంచలు ముత్తియంబులుం
బాలును మంచు నద్దములుఁ బయ్యరమేపడుతేఁడు గల్వరా
టాలును లేవెలుంగు మగపాలును రిక్కలుఁ దమ్మిచూలియి
ల్లాలును జోడు గాఁగఁ దనరారునసంబునఁ గేసుదయ్యమా. 188

క. కలువలదాయయు నగ్గియు, నెలఘును గేస్తుండుఁ బయలు నేలయు నీరుం
జలిసట్టును రూపులుగాఁ, బొలుపొందెడువన్నెకాఁడ బూచులఱేఁడా. 189

లయవిభాతి.—

మొలను బులితోలు వెలిమలను బలుప్రోలువలెఁ
జెలుకుపలజాలు మెయిఁ గులుకజవరాలుం
జెలువ మెడినూలు పసిమలపు తోలిచాలు మొల
నలరు నుమవాలు మెక మెలయువలకేలుం
గెలుపు గొనఁ జాలుపసికొలపుగొరడాలు చలి
వెలుఁగు నెన వోలువఁగఁ బొలుచునెఱడాలుం
గలిగి కడు మేలు పజ కెలమి నిడివేలు గని
చెలఁగి జగ మేలుచును వెలుఁగునెఱవేల్పా. 190

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధర, ఘనయశోబంధుర, కౌండిన్యసగోత్రపవిత్ర, కూచిమంచి గంగనామాత్యపుత్ర, బుధజనవిధేయతిమ్మయనామధేయప్రణీతం బైన యచ్చతెలుఁగురామాయణ మను మహాకావ్యమందు బాలకాండము సర్వ మేకాశ్వాసము.



శ్రీ ర స్తు

# అచ్చతెలుఁగురామాయణము

## అ యో ధ్యా కాం డ ము

---

క. సిరిపెనిమిటియుం బలుకుల,చిఱిబోఁడిమగండుఁ గడలవేలుపుదొరలున్
దిరముగ డాకొని కొలువఁగ, సరి మీఱిన వేల్పు పూఁచ జాబిలితాల్పా. 1

తే. వినుము కరువలి మేపరి మనికిపట్టు,కాన్పు జడదారి కత్తెఱగంటికపసి
యపలికత దెల్పఁ బూని నెయ్యంబులొద, నింపు దళుకొత్త మెల్లన నిట్టు లనియె. 2

క. గొనములసుద్రమ యిత్తెఱఁ,గునఁ జాలుపు లెన్నలేఁడు గొద యొదవని పెం
పున పడ రొందుచు నొకనాఁ, డెన మీఱిన వేడ్క నుల్ల మిగురొత్తంగన్. 3

సీ. తెఱఁగంటిరాచవాతెఁగలచుంజిగివెల్గు కొమరారుమగమానికములసొట్లు
పిల్లికన్ను తనంపుబిగిమోముబిళ్లలు పులుఁగుటాపచ్చ మేల్కొప్పియలును
గొఱ మించుపగడంపుకండ్రగంబాబులు పలుదతామరకెంపుఁబలుపుగములు
కలువయచుంగుఁగల్బనిరంపుగోడలు జానొప్పుముత్యాలచందువాలు

తే. గలిగి మఱియుచు మెఱుఁగుబంగరపుహాదువు, పసులసలరొందుగొనఋటుప్పరిగయందుఁ
బురుడు గన రాసికీన్నలఁ బొదలి తద్ద, పేల్పుటెకిమీనిచాడ్పునఁ బొల్పు మీఱి. 4

తే. దొరలు ప్రగడలు మన్నీలు బిరుదు లొజ్జ, లాడిగీలును బోగముచేడియలును
బట్లు జెట్లును నెఱజన్నిగట్లు బలసి, కొలువఁ గొలు వుండి పెద్దలఁ గూర్చి పలికె. 5

ఆ. మంచివారి నెల్ల మనిచి చెనంటుల, నడఁచి మేటిప్రజ్ఞయంబు గాంచి
నేల యెల్లఁ జేర్చి నేలితిఁ బెక్కేఁడు, లింక రాచనెమ్మి యిచ్చ యుడిగె. 6

తే. ప్రదమిచెలియల్లువానిని బుడమి కప్పు, డొడయనిగఁ జేసి కొలువున నునిచి యెలమి
గనుఁగొనెదుకోర్కి తలఁపున గాట మగుచు,బొడమె నని వారియానతి పడసి యంత.

క. తగువారిఁ బిలిచి యిదిగో, లగనము దాకొనియె నెల్లిలిఁ బుడమికి జే
పిగఁ జేయపలయు రక్కసి, మగువం బొరిగొన్న వాఁడిమగనిఁ గడంకన్. 8

క. వీ డెల్ల వలరఁ జేయుఁడు, వేడుకతో మీర లనుచు వీడుకొలిపిసం
జేడియలును మగవాండ్రుడు, నీ డొడవనికోడ్క లెడల నివ్వరొత్తంగన్. 9

సీ. తిన్నియ లలికి ముత్తియపుమ్రుగ్గులు వెట్టి పసిఁడిగోడల రంగుపనులు సేసి
పగడంపుమెఱుఁగుఁగంబములఁ బాదిరు లిడి నలువారఁ దోఁగతోరనములు గట్టి
తలదువారంపుఁబొంతల నంటిబోదియలును నిండుఁగుండలు నొనర నిలిపి
యంగళ్ల మేల్కట్టు లమరించి లోపలినారులఁ గపురంపుఁబొగలు వైచి

తే. మేలిగొజ్జంగిపూనీట మెకపుటాము, గలిపి బలురాచ తెరువులఁ గ్రంతలందుఁ
జిలికి మచ్చుల మేడల నెలవు లెల్లఁ, గ్రొత్తసింగారములఁ దళుకొత్తఁ జేసి. 10

క. తారును రతనపుఁదొడవులఁ, జీరలఁ గ్రొవ్విరిసరముల సిరిగందమునన్
నేరుపు లలరారఁగ సిం,గారం బొనరించుకొని తగం జెలఁగునెడన్. 11

తే. రిక్కరాయఁడు దమి మీఱ రేవెలందిఁ, బెండ్లి యగు నని కడ యను పేరఁటాలు
పూనసి యై రేనిసీటిక్రై ముంచుపసిఁడి,కుంచ యనఁ బ్రొద్దు మున్నీటఁ గ్రుంకె సంజ.

సీ. పగలింటికడ నాఁడు లిగగంటియెకిమీసిగడితంప్రనిడువాలుజడ లనంగ
వియద్ద్రిమ్మరులు కఱివేల్పుహజ్జను బూజ సలిపిన క్రొత్తచెంగలువ లనఁగ
జెడిపెచానల నేఁచ వెడలుచు మసఁ డిమ్ము కొలిపిన హొంబట్టుగొల్లె లనఁగ
గ్రుంకు ఱెబ్బలిఁ బుట్టి కొఱలుచుఁ గడలవెంబడిఁ బ్రాఁకు నెరగలిమంట లనఁగ

తే. ద్రిమ్ముదాలుపుచెలి పైఁడిమేడమీఁద, గొండ్లి సలుపుచు నసుఁగులఁ గూడిచల్లు
లాముబగ్గుండిపొడు లన నలరి యపుడు, చదలఁ గొద లేక సంజకెంజాయ లమరె.

తే. పగలు సేయుచు వేఁడిమి మిగుల జాగము, గ్రాఁచుజమునబ్బ మున్నీటఁ గలిసెననియొ
తొగవెలందుక నగియె నమ్మగువపెంపు, గని సయింపక తమ్మి మొగంబు మొగిచె. 14

తే. చలివెలుఁగురాక గని తమసామి యైన, వేఁడివేలుపు నేల బల్వెడిని ద్రోచెఁ
గదయనుగయాళియనియొజక్క వలువెన్ను. నడుగువట్టుక మొఱసేయఁ దొడఁగె నపుడు.

తే. నెలయు రేజవరాలుఁ బెండిలికి నిమరు, నెడలఁ దఱి యనుకమ్మఱి కద యనంగఁ
గ్రాలువిరుసులు నెఱపినఁ బూలుఁ బొగయు, నెగసె నన మింట రిక్కలు నిసులఁ బర్వె.

క. పుడుఁవలకొఱ కప్పడు గదు, విడిముడి యిడుకొని కడింది వేడబములతో
వడివడి వెలవెలఁదులవెం,బడి నడ తెంచిరి పొలిఁబొరిఁ బ్రాయపుబొజుఁగుల్. 17

తే. పొసఁగ రేయింటివెన్నెలపులుఁగుగములఁ, బెనుపుటకు మేఁత నించి యుంచినవెడంప
కుంపసపుఁబళ్లెరం బనఁ గొఱలి యపుడు, కలువలయనుంగు దూర్పుగుబ్బలిని బొడమె.

తే. కన్ను దలమానికము బండికల్లు జగిలు,గాఁడు నై యొప్పి మిక్కిలికంటివేల్పు
నలరఁ జేయు వలంతి యగ్గలపుఁజల్లఁ,దనము నెఱపుచు నంతకంతకు వెలింగె. 19

సీ. వేల్పుటేనిక లయ్యెఁ బోల్ప నేనుఁగు లెల్లఁ గొండ లన్నియు వెండికొండ లయ్యెఁ
బలుకుచేడియ లైరి పొలఁతుక లందఱుఁ జెట్టు లన్నియుఁ బెట్టుచెట్టు లయ్యెఁ
బాలసంద్రము లయ్యె నోలి నే ళ్లన్నియు నలువబాబా లయ్యెఁ బులుఁగు లెల్లఁ
బురమిదాలుపు లయ్యెఁ బడగదా ర్లన్నియు మేటిసింగము లయ్యె మేకము లెల్లఁ

తే. బందు రేయెండ కన్నులపండు వగుచుఁ, బిండి చల్లిన తెఱఁగున మెండు మీఱి
యొందుకడ నైన నెడ లేక యుండి యప్పు,డండ గొనక జగం బెల్ల నిండుటయును.

సీ. అత్తఱిఁ గైక క్రచ్చఱ నీరుతిట్టబత్తళికవజీరుబల్వ్యాలు దునిమిన
వెరవరినొసల బంగరు రేకు గట్టు తెఱంగు మంగర యనఁ జాఁగపొలఁతి
వలన నెఱింగి పేరలుకతో నొడయునిఁ బిలిపించి మాకు ముం దలమితోడ
నీ వొసంగెద నన్న నెఱమెప్పు లిప్పుడు మఱచినాఁడవొ లోన నెఱుకమాలి

తే. యకట యిఁక నైన సరగ నాయనుఁగుఁగొడుకు,నొడయునిగఁ జేసి నీ పెద్దకొడుకు నడవి
కనుపు మనుటయు గుండియ లవిసి యాతఁ,డమ్మెలంతుకఁ జూచి యి ట్లనుచుఁ బలికె.

క. వెఱులెవియక నాముంగఱఁ, దెఱవా యిప్పగిది నాడఁ దగవా మేల్ మేల్
కొఱమాలినయిప్పేఱిఁడి, కఱుఁపలు నీ కెవ్వ రిపుడు గఱపిరి చెప్పమా. 22

క. పలుచెట్టుల గాసిలి నును, గలవేల్పుల నెల్లఁ గొలిచి కాంచినకొడుకున్
బలుకానలఁ జేపు మని, పలికెదు నీ వెంత మొంటపడు కాయెనొకో. 23

తే. పేరు గలయింటి నెఱరాచబిడ్డ వనుచుఁ దలఁచుచుండుదు నెవఁ జాల వలపు మీఱ
వాలుఁగంటికొ యిపు డింతచేల వగుట కయ్యయో యింక ని న్నేమి యనఁగఁగలదు.

క. అఱపిఁ బెట్టెద నని మది, నాఱనిచల మూని కఱకు లాడెద వకటా
నూఱిమములు వొదవిన నిఁక, గాఱవుల కనుపఁ జాలఁ గద యిట్టడుకున్. 24

తే. చాన నీకట్టిఁ బుద్దికి తెఱఁ గేయఁ, గోరె దాగాగవుఁడును నీకొడుకు గాఁడె
నే చ్చెఱుంగక కటకటా నేతికొఱకు వెన్నపై నగ్గి సందాడు ప్రేయఁ జనునె. 26

క. కోరుకొను మింక నీకుం, గోరినమెప్పులకు నిడుదఁ గోరుగ మేల్బం
గారును రతనపుఁదొడవులు, వారుపములు మొదలు గాఁగ వలసిన వెల్లన్. 27

చ. పొసఁగనిమాట పట్టి మదిఁ బూనినకష్టము గాక యున్నచోఁ
గసరుచుఁ బొంటిహారుములు గైకొన నొల్లక సారెసారెకున్
బొసఁగులఁ బెట్టుచుం జలముతో మగలం జెగనాడి యద్దిరా
యుసురులు గొందు రాఁగడపుటోజ గయాళులుగా వెలందుకల్. 28

ఆ. అనిన నులికి కలికి యహహా లోఁ గన రింత, చిలుక పలుకఁ జూలుకఁ బలుకఁ దగునె
నేలతేఁద తప్పు నేల యాడినమాట, నిలుపుకొనుము మదిని నిక్క మూని. 29

ఆ. ఇనముసూడుకొలపుటేలిక ల్మన్నెందుఁ, గాఱు లాడి రనినకత యెఱుంగ
మకట నీకతమున నరుమగా నిపు డేమొ, వినికననిదొడ్డవింత పుట్టె. 30

తే. ఆడి తప్పక కొమరుని వాలి నమ్మి, మాలనికి లెంక యై కొల్చి మాట నిల్పు
కొన్న మీవంగడపుఁ బెద్ద యున్నవాఁడె, యటని పే రెన్నఁటికిఁ బోవ దయ్యెఁ గాక.

క. కొఱఁతపడుఁ బొంటినోములు, దఱుగు స్మతి బ్రతుకునేండ్లు తలఁగును సిరి ద
బ్బఱకాండ్ర క ట్లగుట నె త్తటి నైన పాలిక్కి పలుకఁ దలఁపరు పోల్దరుల్. 32

క. పొలఁతుకలు దాఁగ లనుచుం, బలికెడు దబ్బఱల కెల్లఁ బట్టగు నెకిమీఁ
దుల నెద నమ్మఁగవచ్చునె, కలలోపల నైన నెఱక గలవలఁతులకున్. 33

చ. చల్లనిజల్లిమాటలపస న్మసకొల్పుచు నెల్లవారలన్
మెల్లనఁ జేరఁ దీసి తుది మీఱ రొకింతయు లేక యూరకే
కొల్లగ కొక్కి మెల్లఁ గయికొందురు నిక్కము డించి చెల్లఁబో
కల్లల కెల్ల నిల్కడలు గారె కముంగొన నేలపోఁపరుల్. 34

తే. వినుము రాయఁడ పలుకులు చేయు నేల, జాగు సేయక కోరికల్ సాఁగఁ జేయు
మట్లు గాదేని క్రన్నన నడుగు మవలఁ, జేయుపని యింక నీవె చూచెదవు గాని. 35

ఆ. అనుచు నప్పొలంతి యాగడంబున నాడ, నాలకించి యొడయఁ డలుక పూని
యిట్టు లట్టు లనుచు నేమియు మాటాడ, నోడి వ్రంత నూర కుండె నంత. 36

క. చలివెలుఁగుఁ గలియుచో రే, వెలఁదుక నెఱిగొప్పువలన వెస జాఱినచెం
గలువవిరి నాఁగఁ దగి చుక్కల తెరవున వేగుచుక్క గనుఁగొన నయ్యెన్. 37

ఉ. మాటికిమాటికిం బలము మానక జక్కవపెంట్లఁ దమ్మిలే
జోటుల నేఁపఁ దా జగముచుట్టము డాయఁగ వచ్చె నింక నీ
యాటలు డించి వే జనుగు మంచును వెన్నెలజేని కేర్పడం
జాటె ననంగఁ గూఁత లిడఁ జాగెఁ గుటీరపుటజ్జవాల్గముల్. 38

తే. ప్రొద్దునరపంబు గడపుబల్పులఁ గణేఁడు, దమ్మిపూఁబోఁడి కేలిక దరలి వచ్చు
తెఱఁగెఱింగింపఁ దనవారిఁ దివిరి పనిచె, ననఁగఁ బులుఁగులుగడలఁ గూయఁగఁ దొడంగె.

తే. చివురువిలుకానిదెయ్యాల సేద గొన్న, యన్నిమిన్నలసిబ్బెంపుఁబమ్మఁగవల
నలముకొని యున్న చెమ్మట లార్చుకొనుచుఁ, బొలిచె లలినాలిపయ్యెరవోద లప్పుడు.

ఆ. తొగలయెదురుచుక్క ముగురువేల్పులయొక్క, జగమువిందు తమ్మిముగుదపొందు
కాఁడు వేఁడివేల్పు గాములయెకిమీఁడు, దూర్పుకొండమీఁదఁ దోఁచె నంత. 41

తే. నిదురపత్రాళ్లనిబయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగముప్పొద్దుము వ్వేసములఁ జెలఁగుచు
వెలుఁగు లెల్లెడఁ గాంచుచు నలరుచున్న, పేటకాఁ డప్పు డెంతయుఁ దేట మీఱె. 42

వ. తొగసూడ దల్గినఁ దమ్మిముద్దియకుఁ జేతు ల్సాఁచి నిద్దంపుపసి
డిగి గన్పట్టుముదుంగుదువ్వలువ లిచ్చెం గూర్మి నా నంచజా
ల్టిగియె న్నిండుగొలంకు క్రేవలకు బత్తిం బొంగి యచ్చాన యా
జగవేల్పుం గొనియాడె నా మొఱసె నిచ్చం దేఁట్లు నెత్తమ్ములన్. 43

ఆ. అప్పు డదనుచెయ్వు లలరించి సత్తియ,బ్బయు సుమంత్రుఁ డనఁగఁ బరఁగుప్రెగ్గ
డయును వేల్పునికి గడంగి కూరుపఁ దగు,నరకు లెల్ల సంతసమునఁ గూర్చె. 44

క. పుడమిచెలిపట్టివల్లునిఁ, గమ వేడుకతోడఁ గ్రొత్తగా సింగారం
పడరించి యెల్లపెద్దఁ, దడయక రామించి వాయిత్రములు సెలంగన్. 45

తే. అలరఁ బుట్టువు లేనివాఁ డనెడు పేరఁ, గ్రాలునో దయానిధి నేఁడు నీచెంగటికిఁ బోయి
వేఁడ వేంచేయు మిపుడు నెఱిని జెలంగి, నీయడుగుఁ గూర్చి దొరవుఁగాఁ జేయవలయు.

క. పూరిశము వాసె నిదిగో, బారులు కట్టుకొని మేటిపని కన్గొనఁగాఁ
గోరి ప్రజ లెల్ల నున్నా, రోరాయఁడ జాగు సేయ కొప్పునె యిటులన్. 47

తే. అనిన నేమియు నన నోడి యూరకుండ, నన్నుచో నైక వారల నోలిఁ జూచి
పలికె వినుఁ డిది మీరాయఁ డెలమిఁ దొంటి, మెప్పు నగుసేలయెల్ల మాకిప్పుడొసఁగె.

క. మోమోటమిచే మీతో, నేమియు నన నోపఁ డీతఁ డిప్పుడు మీ రా
రాముని గానల కనుపుఁడు, సేమంబున నుడమిఁ జేనిఁ జేయుఁడు భరతున్. 49

చ. అనుటయు వారు దల్లడిలి యద్దిర కర్జము దప్పె నిప్పు డి
చ్చెనఁటి పాలంతి పల్కు లటు సేయక యైకొని యేఁడు జేల రై
పని చెఱుపం దలంచెఁ జెలి పట్టినపట్టు మరల్ప నింక నె
ట్లనుపగు నంచు గాసిలుచు నాపెఁ గనుంగొని పల్కి రిమ్ముగన్. 50

క. కటకట యోముద్దియ నీ, కిటువలెఁ జెఱతలఁపు పూని యొకిమానిఁ గలం
చుట దగునె గరితలకుఁ బెని,మిటిపలు కరయంగఁ బ్రాఁతమిరు కండ్రు గదా. 51

క. పున్నియపుఁ జేడియలకత, లెన్నఁడుఁ బొత్తములఁ బెద్ద లెఱిఁగింపఁగ ము
న్విన్నావా లేదా పెనిమిటి, కన్నం జెఱువలకు వేఱె కలరే వేల్పుల్. 52

క. పగవఁ బని లేదు లేమికి, మొగి నైదువ త్రాడు పవిలముగ నెపుడు మెడం
దగులుకొని యున్నఁ జాలు, న్మగఁడే కద తొడవు లెల్ల మగువల కెందున్. 53

తే. పలవ దెన్నఁడు నీళ్ల లోపల మునుఁగఁ, బలుదెఱఁగుల నుప్పిడు ల్సలుప పలదు
పున్నియపు సేలలకు నిచ్చఁ బోవ పలవ, దెపుడు పెనిమిటిపై బత్తి యొనఁగు చెలికి. 54

క. కావున నోడయని కంగద, గావింపక తలఁచుకొన్న కర్జం బెల్లన్
డీవిం గొనసాఁగింపుము, పూవుంబోఁడిరో చలంబు పూనక యెలమిన్. 55

క. ఆపాలమేపరిసూఁ డిపు, డీపుడమికి రాయఁ డగుచు నెసఁగిన యెడల
న్నీపట్టియు దొర గాఁడే, చూపోపక కీడు దలఁపఁ జొప్పడునె మదిన్. 56

ఆ. అనిన నలికి కలికి యహహా మేలీ మాట, లింటె లగుచుఁ జెవుల నాటుకొనియె
నింకఁ గానికఱప లేమియుఁ జెల్లక, చనుఁ డటన్న బిగువు సడలి వారు. 57

తే. వెల్ల నై యున్న సత్తెఱం గెల్ల నెఱిఁగి, రాచచిన్నెలు సడలించి రఘువుకొలపు
సామి వెలినారచీరలు ఒడలఁ దాల్చి, తపసిరూ పూని యచటికిఁ దరలి వచ్చి. 58

క. పినతల్లిం బొడగని క, మ్మనిపలుకుల నిట్టు లనియె మము నేడఁగ నో
పినతల్లీ నీడెందం, బున నిటువలె లాఁతితనము పూనఁగఁ జనునే. 59

క, ఓయమ్మ యిట్టు లఱమఱ, సేయంగా నేల నీవు సెప్పినచెయ్వు
ల్డాయంగా నేర్తుమె యిఁక, నీయానతిఁ గడవఁ బోము నీయాన సుమీ. 60

తే. ఒనరఁ దలిదండ్రు లెలమితోఁ బనుప్రదురఁట
తోడఁబుట్టువు పుడమికి దొర యగునఁట
పుణ్ణియపుసేల లోఁగిఁ గాంచఁ బోవుటయఁట
మెలఁత మఱి యింతకంటెను మేలు గలదె. 61

క. తలఁపఁగ జగమునఁ గలవే, ల్లువలు సంగడికాండ్రుఁ జుట్టములు మఱి సెప్పం
గలవార లెందఱేనియుఁ, దలిదండ్రుల కెన యొనర్పఁ దగుదుర యెందున్. 62

తే. అట్లు గావున నిపుడు మీయాన బత్తిఁ, దవిలి యొనరింతు నని యటఁ దరలి తనదు
తల్లికడ కేఁగి యత్తెఱం గెల్లఁ జెప్పి, యడుగులకు మ్రొక్కుటయు నాతి యతనిఁ జూచి.

క. కటకట బిడ్డఁడ కోరిక, లటమట లై చనియె నిప్పు డద్దిర తా నొ
క్కటివలఁచిన దయ్యం బొ, క్కటి దలఁచు నటన్న మాట కదు బెడఁ గగుచున్.

క. పుడమిఁ దనకన్న కొడుకున, కడుగుకొనియెఁ గాక కైక యహహ నిజం గా
అడవులకుఁ బనుపు మనుచున్, పుడువఁగ నెప్పగిదిఁ దనకు నో రాడెనొకో. 65

తే. సవతి తన మ్రాని యిట్టు లయ్యెవిధ వలుక, నటులె తానును డెందంబు దిటముపఱుచు
కొని యయో నిన్నుఁ గానల కనుపుకొనఁగఁ, దండ్రియేచందమున నలసలఁచెఁ జెపుమ

క. అజ్జోటియుఁ నొడయఁడు నీ, పజ్జ గనికరము మాలి పని గొల్పినచో
నిజ్జాడ మీకుఁ దగ దని, యొజ్జయుఁ బ్రగ్గడలు నాడ కుండిరె వారిన్. 67

క. గడియయ యేఁ దగు మును నిను, బొడగానక యుండు నెడలఁ బొలుపరి నీ వి
ల్లెడ వాసి దవ్వు చనుచోఁ, గొడుకా యిఁక నెట్లు తాళుకొనఁ గలఁ జెపుమా. 68

తే. అనుచు నడలెడుతల్లి నూరార్చి యంప, దొనలు విల్లును గయికొని చనఁ దలంచు
నెడల నడ్డంబుగా వచ్చి పుడమికూన్తు, వలపు గులుకంగ మెల్లనఁ బలికె నపుడు. 69

ఆ. ఎమ్మెకాఁడ యగ్గి యెల గాఁగఁ బెండిలి, యైనచెలిని డించి యకట యొంటి
నేఁగఁ దగునె మీర లెఱుఁగనివడవడు, లింకఁ బుడమిఁ గలవె యేర్పఱింప. 70

తే. మేలు గలనాఁడు మురియుచు మెసవ నేర్చి, గొడవ లొదవెడు కఱిఁ బోవవిడువఁ దగునె
తలఁప నుసురులయొడయఁడై తనరుమగని, వెర వెఱింగిన నాడెందపు వెలఁదుకలకు.

చ. ఉడుగక బుత్తిముత్తు లిడ నోసి యెడ ల్లఱ లేక యుండఁగాఁ
గడు నెపమెంచి దలంచుకొని గాటపుమక్కువఁ బ్రోది సేయున
య్యొడయని వాసి యాగడపుటోజలఁ ద్రిమ్మరునట్టి కట్టువా
పడఁతుక యెయ్యెడం దలఁకఁ బాసినవెండ్రుక గాదె యెన్నఁగన్. 72

ఆ. మగనితోడ నెలమిఁ దగిలి ముత్తయిదువ, పోఁడిమిని గరంబు రాణఁ బొసఁగు
చున్ననాఁడె కాక యన్నుల కటమీఁద, నెన్నఁడైన నెమ్మి యింత గలదె. 73

ఆ. అట్టు లగుటఁ జేసి యరగడియయుఁ దాళఁ, జాల నిన్నుఁ బాసి నేలఱేఁడ
మాఱుమాట లుడిగి కాఱియఁ బెట్టక, తోడుకొని కడంకతోడఁ జనుము. 47

క. అనవుఁడు నబ్బల్లిదుఁ డా, ననఁబోఁడులమిన్నఁ జూచి నగి యి ట్లనియెన్
పెనుగానలఁ బడి చెలులకుఁ, జనఁ జనునే వెరపు మాలి చక్కెరబొమ్మా. 75

క. నగువారి నెల్లఁ దలఁపక, మగువా మగవారివెంట మచ్చికతో రాఁ
దగవా పోవాఁడనె నిను, దిగనాడి చనంగ లాఁతితెఱఁ గెన్నుదురే. 76

సీ. చెలిమితో నాడంగ జింకకూనలు గావు గద్దఱికొదమసింగములు గాని
కులుకుచుఁ బలికింపఁ జిలుకబారులు గావు దుగమొగంబులపుల్గుతెగలు గాని
వలపుతోఁ జెనుప జవాదిపిల్లులు గావు బలితంపుఁబోగరుబెబ్బులులు గాని
కయిసేయఁ బువ్వుఁదీవియపందిరులు గావు పొదలుజొంపపుకాఱుపొదలు గాని
తే. గొండ్లి సలుపంగ నముఁగుఁబూఁబోండ్లు గారు, తులువపోలయోగిరపుఁబోలంతుకలుగాని
గోల లెచ్చట గాటంపుఁగోన లెచట, వలవ దుడుగుము పయనంబు తలిరుఁబోఁడి.

క. పల నొదవనిపని యగుటం, బలికితి రా వలవ దనుచుఁ బలికింపఁగ నో
మెలఁదీ వెఁబోఁడి నిన్నుం, గలఁగోపల నైనఁ బాయఁ గలనే చెపుమా. 78

క. అని యిట్లు లెన్ని సెప్పిన, విన నొల్లక కలువకంటి వెగ టొదవఁగఁ బ
ల్కినఁ దలఁకుచు వెంటందోడ్కొని చనుటకు నాతఁ డియ్యకొనియుండుటయున్.

తే. అత్తలకు మ్రొక్కి వారలయానతిఁ గొని, జా నొదవఁ జెల్మి బోటులఁ జాలఁ గూర్మి
తోడఁ గవుఁగిటఁ జెనచి యాతోడవుతోడవు,నెమ్మిఁ జెనిమిటిపఱిఁజేరి నిలుచునెడను.

క. లక్ష్మణుఁడు సింగాణియు, నక్కజపుఁదూణలు పూని యరుదెంచి కడున్
మ్రొక్కి లిడి యున్న నాతని,మక్కువ కెదలోన నలరి మఱి యప్పిదపన్. 81

తే. తమ్ముఁడును గేస్తురాలును దాను నగరు, వెడలి యష్మేటి దమవీటినడిమి త్రోవఁ
జనుచు నుండెడుచోఁ గనుంగొనుచు నుండి, యెల్లవారలుఁ దమలోన నిట్టు లనిరి.

క. ఇట్టినిగారపుగొనముల, లిట్టులఁ గసికరము మాని తెం పొడవంగాఁ
గట్టడవులకుం బనుపఁగఁ, గట్టా యమ్ముదుకఁ డెంతకట్టిఁడి చెపుమా. 83

క. తడ వేడు లయ్యెఁ దనకుం, గొడుకులు లే రనుచు ముందు గుందుచు నెన్నో
పడ రానిపాట్లు పడి యివ్వ, డడవులకుం ద్రోచుకొనుట యరు దై తోఁచున్. 84

క. తప్పక యాఁడుది గోరిన, మెప్పులకై పెదఁగుఁదనము మీఱఁగ నిటు లీ
యొప్పులకుప్పల విడుచుట, ముప్పొదవఱి నితని కేమొ ముది మది దప్పెన్. 85

ఆ. ఆలిమాటకొఱకు బేల యై కొడలిఁ, గొడుకుఁ బోవఁ ద్రోచుకొనియె నితని
కేటిమగతనం బిసీ కడుఁ గొద లేని, అట్టు పొంచె నింక అంతు లేల. 86

తే. అనుచుఁ గలఁగుచు నెల్లరు నాడుకొనఁగఁ
బ్రో ల్వెడలి వార లాయ్యనఁ బోవు చుండి
రత్తఱిం గెల్ల నాలించి యపుడు చాల్వ
టరదములదొర దద్దయు నడలుకొనుచు. 87

శా. ఏఁడీ సాబలుమానికంబులకొటా రేఁడీ జగాపన్నకాఁ
డేఁడీ రక్కసినీరుదాలుపులగా డ్వేఁడీ జగం బేలుఱేఁ
డేఁడీ పేదలపాలివేలుపులచె ట్టేఁడీ నిరాబార్గమే
లేఁడీ వేఁడివెలుంగువంగడపురేవె ల్గాము బిట్టేడ్పుచున్. 88

ఉ. రా యనుఁగా యనుం దొగలరాయనిఁ గేరునిగారపుంగుడా
రా యను మేటినాడెపుదొరా యనుఁ గిన్క యొనర్చ దేమి మే
రా యను నింత నీకుఁ గనరా యను దయ్యము పాడి దప్పె నా
రా యనుఁ గన్నవాడు నగరా యను నిప్పని మానరా యనున్ 89

ఉ. కా యను మేటితప్పు కొడుకా యను నిద్దపుఁబూఁతమావి మో
కా యనుఁ బొజరంపుఁజిలుకా యను నబ్రపుసోయగంపుఁబో
కా యనుఁ బల్కవేమి యలుకా యనుఁ బాతము దీజెనోటు కై
కా యను నేర యిట్లు దుడుకా యనుఁ బాయఁగఁ గోరికా యనున్. 90

క. అప్పా విప్పారెదునగ, వొప్పారఁగఁ జూచి పలుక వున్నాఁడ వదే
చొప్పా తప్పా బంగరు,కుప్పా యిప్పాట నింత కొఱకొఱ మెప్పా. 91

క. ఉడుకా విడ కున్నది మది, పడుకా మిడుకంగ నుఱక పఱవం జనునే
కొడుకా నడుకానల కిటు, దుడుకా నాపాలిపునుసుదొడుకా నీకున్. 92

నిరోష్ఠ్యసీసము.—
చలిమిక్కిలిండియంబెలకేనిజిగిచేగసింగాణిఁ జెఱిచినచేఁత కాఁడ
జనదారి నెలదండఁ జని కచ్చుఱ గయాళిరాకాసిఁ జెండినరాచకంద
తలఁగనికడగండ్లఁ దగిలి చట్టయి యున్నచాన నేచిన సెఱజాణరాయ
నీటార నెదిరిన నేలశేజేవంట తే జెల్ల నడఁచిన దిట్టఱేక

తే. తండ్రి నైనట్టినాయాన దాఁట లేక, కడిఁదికానకుఁ జిరాసిరి యెడలఁ జేసి
చాలఁ గానల కరిగినయందగాఁడ, తలర నిన్నాంచ కేఁ దాళఁ గలనె యింక. 93

క. కైకా నీపూనినపని, కై కా కై కందినట్టియనుఁగుంగొడు కి
ట్లై కానల కేఁగెను నిఁక, నేకడ నీవంటికులువ లేరీ పుడమిన్. 94

క. నెయ్యపుఁగొడుకుల నిటు లెడ, సెయ్యంగా మిగులఁ జలముఁ జేకొనియెదు నేఁ
డయ్యయొ యాకట్టిఁడిబ, ల్దయ్యంబున కేమి యెగ్గు దలఁచితినో చుమీ. 95

తే. అంగడల కొచ్చి సిరులపై నాస వదలి, గరితతన మెల్లజగములఁ గనఁబడంగ
మగనివెనువెంట నడవికిఁ దగిలి చనితె, తోడరి మముఁ జూడ రోసి యోపుడమికాన్న.

తే. కోడలా యింక బంగరుగోడ లేల, మేడ లేటికి రతనంపువాడ లేల
మాడ లేటికి బలురాచజాడ లేల, వాడలో నీవు క్రిమ్మర నోడి చనిన. 97

తే. మక్కువలయిమ్మ వలపేనిమానికమ్మ, పసిఁడికీల్బొమ్మ జగములకట్టుఁగొమ్మ
పొగడపూరెమ్మ వలపుఁగప్పురపుదిమ్మ, కాన వేలమ్మ దోనేలకాన్పుఁగొమ్మ. 98

తే. అనుచుఁ గడ లేనిమక్కువ నఱచి యఱచి, సైఁపఁ జాలక యూరాచచలివెలుంగు
నేలఁ బడి సొమ్మ వోయి జేజేల ప్రోలి, కేఁగె నట రాముఁడును బ్రోవ నేఁగి యేఁగి.

క. సుడివాలుదాల్పునడుగునఁ, బొడమిన పెన్వాల్లి దరిసి పాలు పొందఁగ న
క్కడ గుహుఁ డనియెడుచెంచుల,యొడయనిఁ బొడ గాంచి వానియొద్దికవలనన్.

ఆ. ఓడ యెక్కి వైళ మొప్పార నయ్యేటి, ఱేవు దాఁటి చెంచుఱేని నచట
మిక్కుటంపుసెనరు నెక్కొన వీడ్కొని, మువురుఁ గడఁకతోడ నవలఁ జనుచు.

క. పని మీఱ భరద్వాజుం, డనుతపసులమిన్న యున్నయాడకుఁ జని యా
యన యొసఁగెడుపూజలు గైకొని చయ్యనఁ జనిరి చిత్రకూటంబునకున్. 102

తే. మలలకలకట్టు తపసులమనికిపట్టు, నాడెములగట్టు బలురవనములకొట్టు
రమణఁ గన్పట్టునయ్యబ్బురంపుగట్టు, జెట్టిలమిఁ జూర్చె నారాచపుట్టువులకు. 103

సీ. బలితంపుగండురాచిలుక పల్కులఁ బిల్చి కడిఁదిజక్కరనీళ్లఁ గాళ్లు గడిగి
నిద్దంపుసెత్తంపుగద్దియ ల్సవరించి వలినాలి గాడ్పువీవనలు వైచి
కపురంపు వెలిబూదిగందవొడు ల్సన్ని కొమరుపూఁబొదచప్పరములు నునిచి
వలి మానిపండ్ల పానకముల దగ మాన్చి నాడెంపుదుంపబోనములు వెట్టి

తే. క్రొత్తతలిరాకుజొంపపుమెత్త లొసఁగి, మఱియుఁ జెక్కడెఱంగుల నెఱి నొసంగి
తెరవుబడలిక లన్నియుఁ దీర్చి వారిఁ, దనిపె నెస నెన్న నమ్మున్నతాల్పుమిన్న. 104

తే. అట్టు లమ్మెట్టుపై విడిపట్టు సేసి, యుండి రంతకమున్నె యయోధ్యలోనఁ
దనరు ప్రగ్గద లందఱుఁ దాతయొంట, నున్న భరతుని రప్పించి యొప్ప మీఱ. 105

క. మొదలితెఱఁ గెల్లఁ దెలిపిన, సదరిపడి యతండు మిగుల నడ లొందుచు బ
ల్లిదుఁ డగుతనతండ్రికిఁ జెం, పొదవఁగఁ జెఱజగముచెయ్వు లొనరించి వెసన్. 106

ఆ. మూఁక లెల్లఁ దన్ను డాకొని కొలువంగ, నన్న యున్నతిప్ప కరిగి యతని
యడుగుఁదామరలకుఁ గడువడి సెరఁగి యుం, పెసఁగ నవ్వలంతి యిట్టు లనియె. 107

తే. ఱేండ్లరాయఁడ మిగులఁ గాఱియలఁ గుంది, తండ్రి వేలుపుప్రోలికిఁ దరలి చనియె
మీర లిటు కైకమాటకై యూరు వదలి, సొరిది నడవుల కిపుడు వచ్చుటను జేసి.

ఆ. ముసలివానిమాట ముద్దియమాటయుఁ, నేటు చేసి యేలునేల వదలి
కటకటా కడిందికార్తికంబులు గల, పొలము సొరఁగఁ దగునె పొలఁతిఁ గూడి. 109

క. అన్నాతియు నొడయఁడు నటు, లన్నా రని నీవు గోన కరుదెంచినచో
నన్నా యన్నాడిక య, న్న న్నా యూఁగుకొనఁ జాలునట్టిదె చెపుమా. 110

క. ఏ నినుఁ గొలుచుచు నుండెదఁ, గాని యిఁకం బుడమి యేలఁగా నొల్లను నీ
యాన యని మ్రొక్కుటయు న, మ్మానిసిఱేఁ డపుడు దండ్రి మడియుట కెదలోన్.

ఆ. కలఁక మీఱ మిగులఁ గన్నీరు నించుచుఁ, గొంతదడవు నొగిలి యంతఁ జతన
మొనర నుక్కలు నీళ్ల నోరెంపుఁగళ్లను, మొదలు గలుగుచెయ్వు లదనఁ జేసి.

క. అక్కైకకొడుకుఁ గనుఁగొని, మక్కువతోఁ బలికె నీవు మగుడ న్నూఁక
లిక్కిక్కటిసి రాఁగఁ బ్రోలికి, గ్రక్కునఁ జని నేల యేలు కనికర మెసఁగన్. 113

తే. తండ్రియానతి యింతయు దాఁటఁ బోల, దడవిఁ బదునాలుగేఁడులు గడపి వత్తుఁ
బదిలముగ నుండు మని తనపావ లొసఁగి, సెలవుఁ బెట్టిన నతఁ డెవ నలరి యపుడు.

ఆ. దండుతోడఁ గూడి తరలి గొబ్బునఁ దమ, నేల కరిగి మొదలిప్రోలు సొరక
మిత్తిపేట కానితక్తడియూర నిం, పెసఁగ నిలిచి పజల నేలుచుండె. 115

క. అని సెన రొదవఁగ నిటు ల,య్యనియొరెపుఁదిండిదాసరయ్య ఱజెలిపినఁ
విని బొటియచాలి యెదలోఁ, దనివి సనక యవలికతయుఁ దమి నడుగుటయున్.

చ. కదలనితేరు తేఱుగడ కానక పూనెదునాఱి నారిపైఁ
బొదలెడుతూపు తూపు నెఱిఁ బ్రోచినమావులు మావులిట్టకుం
గుదు రగుతేరుపూన్పరియు గోమునఁ గ్రాలఁగ గట్టిదీటుచే
నెదిరిచి మూఁడుప్రోళ్లఁ జెగ నేసినగ్రద్దఱివేల్పురాయఁడా. 117

క. తలమేఱుఁ జిలువపేరును, బొలుపారుకడిందిసొరు బూచులబారు
న్నల యూరుఁ బుడమి తేరును, గలిగిననెఱవేల్ప మొనలకైదువతాల్పా. 118

మణిగణనికరము.—

కలువలదొర కొఱ గలకలవిరిగా, వలిమల లలి నిలువఁ గడఁగుఁబసగాఁ
గలుములచెలువమగఁడు గడుఁజెలిగా, మలయుచు జగముల మనుచునొడయఁడా.

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధరఘనయశోబంధురకాండిన్యసగోత్రపవిత్రకూచిమంచి గంగనామాత్యపుత్త్రబుధజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైన యచ్చతెనుఁగు రామాయణ మహాకావ్యమం దయోధ్యాకాండము సర్వ మేకాశ్వాసము.

—

శ్రీ ర స్తు

# అచ్చతెలుఁగురామాయణము

## ఆ ర ణ్య కాం డ ము

---

క. సిరులచెలిమగనియడుగున, గర మరుదుగఁ బొదమి ముజ్జగంబులయందున్
గరగరిక నెఱపుజక్కర, విరిబోఁడిబొజుంగ ప్రాఁతవేల్పులగొంగా. 1

తే. వినుము కత వేల్పుజడదారి విన్నచాలి, మేపములనట్టుపుట్టువు మేటితపసిఁ
గాంచి యిట్లను నంత నగ్గట్టుమీఁదఁ, దరలి రాగవు లవలికి దాఁటి చనుచు. 2

తే. దారిలో నత్త్రి యనుజడదారిఁ జేని, నెలవునకుఁ బోయి యాము నబ్బలియుఁ డొసఁగు
పూజ లెల్లను గైకొని పోఁగ నచటు, వెడలి దండక యనియెడునడవి దరిసి. 3

సీ. పులులు దోఁడేళ్లు దుప్పులును సివ్వంగులు నెలుఁగులుఁ బందులు నేనుఁగులును
గురుపోతు లేదులుఁ గోఁతులు మనుఁబోతు లెనుబోతులును రేఁచు లిర్లు దచ్చి
కార్లమెకంబులుఁ గదఁతులు దుప్పులుఁ గుందేళ్లు నక్కలుఁ గొండముచ్చు
లెక్కుడుమెకపుసూ ళ్ళిరుదల గ్రుడ్డుకామపులుఁ బిల్లులు నడివపుమెకములు

తే. మొదలుగాఁ గలకాఱ్ఱెకంబులకు నెల్లఁ, దానకం బగునబ్బలుకానలోనఁ
జొచ్చి విచ్చలవిడిఁ జనుచో విరాధుఁ, డనెడురక్కసుఁ డొకఁడు పెంపడరఁ జేరి. 4

క. అప్పుడమికాన్పు నెత్తుక, ఱిప్పునఁ జదలునకు నెగసి రేసినకడఁకన్
గుప్పునఁ జనుతఱి నొడయఁడు, తప్పక యొకకోల హానికలఁ దగ నేసెన్. 5

ఆ. ఏసి తలఁకుచున్న యెలనాఁగ వెఱ పెల్లఁ, దీర్చి బుజ్జగించి తెఱవు పట్టి
చనుచు నెలమి నెదుర శరభంగుఁ డనుజడ, దారి యొసఁగుపూజఁ దనరఁ గాంచి. 6

ఆ. మఱువకందుజోగి తెఱవాయిమెక మున్న, చెంత కరిగి యతనిచేత విండ్లు
కత్తులములు దూపుగములును దద్దయుఁ, గొంచు నంతఁ జనిరి పంచవటికి. 7

తే. చని వెరపుమీఱ నొకయాకుఁజవికె నచట, నిలుపుకొని పండ్లు దుంపలు నెలమిఁ దినుచు
నున్నచో నబ్బురం బొప్ప నొక్కనాఁడు సుప్పనక యనురక్కసజోటియొకతె.

క. నీ టొదవఁగ నయ్యోధయని, చోటికిఁ బఱతెంచి వలపుసొం పెసలారన్
జోటిపనుల్ గోరిన నజ్జోటిం గని పొలసుదిండిసూడి ట్లనియెన్. 9

క. మగువా మగువం దగిలిన, మగవానిం గోరుకొనుట మంచిదె నీకున్
దగువాఁడు లక్ష్మణుం డా, జగజెట్టిం గోరికొనుము సరగ న టన్నన్. 10

ఆ. సంతసించి యతనిచెంత కట్టులు వోవఁ, జేటగోళ్ళబోటిబూటకంబు
దెలిసి యవ్వలంతి దిట మొప్పఁగా దాని, ముక్కు సెవులు నొకటఁ జెక్కివైచె. 11

సీ. వైచినఁ గ్రొత్తగాఁ బూచినమోదుగుకరణి నత్తెఱవ నెత్తురులఁ దోఁగి
నానయు నలుకయు లోనఁ బెనఁగొన ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుఁడు ననఁగఁ
బరఁగు రేద్రిమ్మరిదొరలపాలికిఁ బోయి యత్తెఱం గెఱిఁగించి యలమటింప
గాలంబునకుఁ బదునాలుగువేలక్కసులతో వాండ్రు రాగవునిమీఁదఁ

తే. దరలి వచ్చిన నవ్విలుదాల్పు గడిమి, నెదురుకొని పెక్కునెఱదూపు లేసి యెల్ల
నల్లద్రావుడుమూఁకలఁ ద్రెళ్ళఁ జేసి, యగ్గరాసులపైని బిట్టార్చుకొనుచు. 12

క. బలునారసములు పఱపినఁ, దలఁకక యబ్బలియు రుక్కు దళుకొత్తఁగ ని
ప్పులు గ్రక్కెడుబెడిదపుములుకులఁ దఱుచుగ నతనిమీఁదఁ గురిసిరి మరలన్.

క. అక్కరణిఁ బోరుటక్కరి, రక్కసిగమికాండ్ర ముప్వుర న్మానిసిఱేఁ
డొక్కొక్కకఱకుటమ్మునఁ, జిక్కంగానీక దలలు చిదిమెం గినుకన్. 14

ఆ. అట్లు వాండ్రు ముప్వు రడఁగిన నడలుచు, సుప్పనాతి మిగుల స్రుక్కి లంక
కరిగి తోఁడఁబుట్టు వగురావణునిఁ గాంచి, తనతెఱంగుఁ దెలియ వినుచుటయును.

క. కలఁకయు నలుకయు నెసలో, మొలవఁగ నమ్మేటిపోటుమూఁకలఱేఁ డో
చెలియల నిన్నిటు చేసిన, పలువలతెఱఁ గెల్ల నేఱుపఱుపు మ టన్నన్. 16

ఆ. అన్నె లంత వలికె నన్న నిన్నెఱుఁగక, చేటుకోఱు నిట్లు చేసినట్టి
మాళనేలతాల్పుకొమరులతెఱఁ గేమి, దెలుపవలయు నొక్కపలుకు వినుము. 17

క. ఆరాయని నెడఁబాయక, గారామున మెలఁగుచున్నకన్నియ నెఱయొ
య్యారం బెన్నిక సేయఁగ, నేరాకన్నియలయందు నెఱుఁగము సుమ్మీ. 13

క. రక్కసిమగువలయందును, జక్కులచెలులందు వేల్పుచానలయందుం
బక్కిదొరకొలపునవలా, గొక్కముసం బైన నట్టిరూపసి గలదే. 19

చ. నిలుకడ గన్నకార్మెఱుఁగు నిద్దపుఁబల్కులు నేర్చుకొన్న క్రొం
దళుకుపసిండిబొమ్మ మెయి దాల్చి మెలంగెడుగుజ్జుమావి పే
ర్వలపలఁ బడ్డమానికము వాడఁగ నేరనిపూవుబంతి నాఁ
జిలుకలకొల్కి యబ్బురపుఁజెల్వమునం దనరారు సారెకున్. 20

సీ. తమ్మికెంపులకు నెత్తావి గూర్పనితప్పు చిగురులు గార్కొనఁ జేయుఱవ్వ
కలికిమించులకు నిల్కడ యీనియారడి కదలివెన్నకు మచ్చ యిడినయెగ్గు
జక్కవపులుఁగులజత విప్పుకొద పుట్ట పెద్దల మలకలఁ బెట్టుఱట్టు
మబ్బులయవయుట ల్మానుపనియాడిక తొలఁగలడా ల్పగ తెల్లఁ ద్రోచువాదు

తే. మలపుఁగోనఁబోలునలువయత్తలిరుఁబోఁడి, మోవియును గేలు నొడలును ముద్దుమోము
కులుకుగుబ్బలు నూఁగారు క్రొమ్ముడియును, దళుకుమునుసోఁగవెడఁదకన్నులు నొనర్చి.

సీ. తాఁబేలు కడుపులోఁ దల గ్రుక్కుకొనియెఁ బో తెలివమీఁగాళ్లతో దినుసు గాక
బలురాజనంపుఁబొట్టలు పీఁకెవాపెఁ బో ముద్దియపిక్కల కుద్ది గాక
చెలువంపుటిసుకతిట్టలు మెత్తవడియెఁ బో జోటిపిఱుందులదీటు గాక
పడగతాలుపు మోము ముడుచుక యుండెఁ బో బోటినూఁగారుతో సాటి గాక

తే. తరఁగచాల్పులు విచ్చెఁ బో తరతరంబ, చేడియలమిన్నతరులతో నీడు గాక
చిందములు వెల్ల నయ్యెఁ బో చిగురుటాకుఁబోఁడినాడెంపుకత్తుకపురుడు గాక.

ఆ. కలికికురులనిడుపు కన్నులపెడలుపు, గుబ్బదోయి హెచ్చు గొనబుఁగౌను
కొంచెదనము పిఱుఁదుగొబరును బొక్కిలి, లోఁతు నెన్న నెన గలుగుట యరిది. 23

తే. బిత్తరపుగుబ్బ లేపునఁ బెరుఁగు నంచు, నెంచి మును నల్వ మొనలను నినుపమొలలు
నించ నవియుఁత నిలువక నెరయఁ బెరుఁగఁ, బొలఁతి నెఱిఁగంచెల బిగించఁ బోలుఁజుమ్మి.

క. కన్నియలమిన్నపిఱుఁదుల, కన్నరొ యిసుమంతలేసి యగు నిద్దంపుం
దిన్నియలు సాటి యగు నని, యెన్నంగా రామ చుమ్మె యెచ్చో నైనన్. 25

గీ. పాలతో నునుమగతాలతో నలువతేఁటిలతో జేడిసమీలతోడ
విండ్లతోఁ గ్రొన్ననచెండ్లతో బసదారిపిండ్లతోఁ దమ్మిలేఁదూండ్లతోడ
తేళ్లతో మావియిపళ్లతోఁ గొదమతాఁబేళ్లతోఁ గాఱుమొగిళ్లతోడ,
జవ్వులతోఁ జెందొవపువ్వులతో ననలుఁపుట్టువులతోఁ జిలుకకూటువలతోడఁ

తే. దొడరుఁ జెలినవ్వు పలుచాల్పు నడలుఁ గన్ను
లును బొమలు గుబ్బచన్ను లారును బుజములు
చూపుఁ బెదవియు మీఁగాళ్లు సొబగుతుఱుము
గోరు లడుగులు మొగముఁ బల్కులుఁ జెలంగి. 26

ఉ. కన్నులచెన్ను పెన్నెఱులకప్పు వెడందపిఱుంద ముద్దులేఁ
జన్నులనీటు ముత్తరులసౌరు మిటారపుటారుతీరు గౌఁ
దన్నము మోముగోము మెయిడాలును బూని మెలంగుచున్నయ
య్యన్నులమిన్న నెన్నఁ దరమా పెఱమాటలు వేయు నేటికిన్. 27

తే. ముజ్జగంబులయందునమ్ముద్దుగుమ్మ, కరయ నెన లేరు చెలులు నీ యడుగులాన
యహహ యోయన్న దానిసోయగము గన్న, సోలి జడదారు లైన విరాలి గొనరె.

క. అడవుల నిడుమలు గుడుచుచుఁ, గడు బడలియుఁ గడిఁదిసోయగము పూనెడున
పుడఁతుక నగరుల నుండెను, నెడఁ బొడగనువారిచూడ్కి కెట్లుండునొకో. 29

తే. అడవిఁ గూరలు దుంపలు గుడుచుచుండు, కూళమానిసి కమ్ముద్దరాలి నోలిఁ
దగుఁబఁ గట్టిక కేకిడి తమ్మవాలి, చెయ్యలు జుద్ది మరక గుఱి సేయవచ్చు. 30

క. వినఁ బోల్ప రానిసొగసుల, గని యగునమ్మెఱుఁగుబోఁడికౌఁగిట నెపుడుం
బెనఁగొన నొనఁగూడనిమగ,తన మేటికి నింక రాచతన మేమిటికిన్. 31

క. పొంగుచు మూఁడుజగంబులు, రం గెసఁగఁగ నేలుచుండి వ్రాలనిబలుదీ
విం గేరెడునీ కిపు డా, బంగరుచిటిపాపచెలిమి పాటిలవలదే. 32

తే. అనుచుఁ దెలిపిన డెందమునందు వలపు, పెనఁగొనఁగ రక్కసులఱేఁడు పని దలంచి
సరగ మారీచునింటికిఁ జనిన నతఁడు, బత్తి నెఱపుచు నిట్లని పలికె నపుడు. 33

క. రాయఁడ మీ రిచటికి వేం, చేయఁగఁ బని యేమి గల్గెఁ జెప్పెర నెఱుఁగం
జేయుము మఱి మీయానతి, ద్రోయక యొనరింతు వెరవుతోడుత ననినన్. 34

ఆ. వానిఁ జూచి చెలిమి వఱల నత్తొలివేల్పు,ఱేఁడు పలికె వినుము వాఁడిమగఁడ
పంచవటికి రాచబంటు లిర్వురు నొక్క, యుగ్మలియును జేరి యున్నవారు. 35

క. అబ్బిత్తరి చెలు వెంతయు, నబ్బురముగ నిపుడు చెవ్వుల నాలించుటచే
నిబ్బరపువలపు మదిలోఁ, బ్రబ్బికొని యొకింత సైఁప రాదయ్యెఁ జెలీ. 36

ఉ. కావున నీవు బంగరుమెకంబు తెఱంగున వేగ నేఁగి య
త్తీవియఁబోఁడిక్రేవలను ద్రిమ్మరుచుండిన నవ్వలందిక్కై
వావిరి నిన్నుఁ బట్టుకొన వచ్చినరాయని గొంచు దవ్వుగాఁ
బోవుము నేను దానిఁ గొని పొల్పుగ లంకకు వత్తు నర్మిలిన్. 37

క. అనిన నగి వాఁడు పలికెన్, వినుమా నీ కిట్టికానివెరవిఁడికతఱవల్
ననునే పెఱతెఱవలఁ గైకొనఁ గోరెడువానిబ్రతుకు కొంచెము గాదే. 38

క. ము న్నొక్కతపసిరాయని, జన్నము చెఱుపంగఁ బూని చనుదెంచినచో
నన్నేలఱేఁడు నను గదు, బన్నము వొందించె మరలఁ బఱపం జను నే. 39

ఆ. అనిన నులికి యతఁడు గనుఁగొనలను నిప్పు, లొలుక నలుకఁ జూచుచున్నచో నె
ఱింగి కినుక యేల రేపె దొసంగులఁ, జెందఁగల వటంచు నెలవుఁ గాంచి. 40

క. బంగారుజింక యై పసఁ, బొంగారుచు నేఁగి పుడమిపుట్టువుమ్రోలన్
సింగారము నెఱపిన దానిం గొని తెమ్మనుచు రాముని జెలి వనిచెన్. 41

క. పనిచిన నయ్యెలతికి దమ్ముని గావలి యునిచి విల్లు ములుకులు గొని మె
ల్లన నమ్మెకముం బట్టెద, నని మానిసిఱేఁడు దఱియ నరుదెంచుటయున్. 42

సీ. దట్టించి ఛంగున దాఁటి పేఱెము వెట్టు నీడల నంతంత నిలిచి చూచుఁ
జేతి కిచ్చినయట్ల చేరువ నలయించుఁ గడిసి పట్టఁగఁ బోవ బెదరి యుఱుకుఁ
బొద లడ్డ మైనచోఁ బొదకట్టక యడంగు గడితంపుటడవులనడుమఁ దూఱు
నొకచోట డాఁగి వేఱొకచోటఁ గనఁబడుఁ దననీడ దానె కన్గొని కలంగు

తే. బడలి యొకిమీఁదు తనుఁ గూడఁబడఁగ నోడి,తడయు నెడలను మగుడ ముందఱికివచ్చు
మచ్చికలు చేసి డాయుచో వెచ్చి పాఱుఁ, జెలఁగి యగ్గారవమ్ముఁబసిండిజింక. 43

తే. అట్లు త్రిప్పులఁ బెట్టుచుఁ జెట్లు గట్లు, పొదలు గడ్డలు వడి దాఁటి పోవుచున్నఁ
బట్ట నొదవక కినిసి యబ్బల్లిదుండు, దివిరి యొకకోల నయ్యిఱ్ఱిఁ ద్రెళ్ళ నేసె. 44

ఆ. ఏయ నేలఁ గూలు నెడల నోలక్ష్మణుఁ,డా యటంచు మెకము గూయుటయును
విని కలంగి పుడమివిరిఁబోఁడి కూరిమి,కాపు ముద్దుమఱఁదిఁ గాంచి పలికె. 45

క. ఓలక్ష్మణుఁడా యనుఱొద, యాలింపంబడియె నిప్పు డడవిం జనుచో
నేలాటిచేటు వొందెనొ, వేగమ మాయన్న నరయ వెడలు మటన్నన్. 46

క. నగి యతఁడు వదినె కనియెన్, మగువా బెగడంగ నేల మాయన్నకుఁ జే
టగపడియెనేని జేజేల్, ముగురును గడ లేనిఘోరములపాల్గారే. 47

చ. జగములు గ్రుంకవే నెలయుఁ జాయమగండును దేట దప్పరే
పగులదె నేల వేతలలపాము దలంకదె తిప్ప లుర్వవే
పగ లిరు లెల్లెడం గవియఁ బర్వవె సంద్రము లింకఁ బాఱవే
రగులదె నల్వ గ్రుద్దుగమి రామున కించుక కీడు గల్గినన్. 48

ఆ. గోల యిట్టికాఱుగోనలో ని న్నొంటి, డించి చనఁగఁ జనునె యించుకైన
నిడుమ కలుగ నేర దిపుడు మాయన్నకు, వింతకఱవ లెల్ల విడువు మింక. 49

తే. అనినఁ గనలుచు నయ్యింతి వినఁగ రాని, మాట లాడిన నతఁడు వేమఱుఁ గలంగి
దయ్య మింక నేమి గావింపఁ దలఁచుకొనెనొ, కానిపని పూనె నీపెట్టికలికి యనుచు.

క. ఉల్లమున నఱుఁజూఁ జూపని, తల్లడమున నడుగుదోయి తడఁబడ విల్లున్
బల్లెపుఁగోలలు గైకొని, యల్లనఁ బఱతెంచె నన్న యరిగిన త్రోవన్. 51

క. అంతట నెదఁ గొద యొదవని, సంతసమునఁ బొంగి తలఁపు సాగె నటంచున్
బంతిమొగంబులరక్కసుఁ, డెంతయు వైళంబ తపసి యేఱుపడంగన్. 52

తే. పులికళాసము కకపాల బూదిపూఁత, జడలఁ బొత్తంబు దుదురక్కసరులు కావి
పుట్టములు లాతమును జోగిపట్టియయ్యును, దనర నయ్యింతిఁ జేరి దీవన లిడుటయు.

క. ఎలతీవఁబోఁడి దద్దయు, నెలమిం జెయిదోయి మోడ్చి యెదలనిబత్తిం
దలరుచు నున్నన్ గని య, త్తొలివేలుపుపెద్ద యాపెతో నిట్లనియెన్. 54

క. పువ్వారుఁబోఁడి నీ పే, రెవ్వరు నీతల్లిదండ్రు, లెవ్వాఁడు మగం
డెవ్వాఁడు మీ ప్రో లెయ్యది, యివ్వడువున నొంటి దిరుగ నేటికిఁ జెపుమా. 55

తే. అనినఁ దొయ్యలి తనతెఱఁ గతనితోడ, నంతయును జెప్పి పిదప నోయయ్య మీర
లెవ్వ రెందుండి వచ్చితి రెఱుఁగఁ బలుకుఁ, డనినఁ జిఱునవ్వు నిగుడ నచ్చెనఁటి పలికె.

తే. ఇంతి మున్నీటినడుదీవి యేలుఱేఁడ, నరయ రావణుఁ డనుపేరఁ బరఁగువాఁడఁ
దుద యెఱుంగనికలుములఁ బొదలుప్రోడఁ, జెలఁగి జగములు మూఁడును గెలిచినాఁడ.

సీ. గిబ్బబాబాజోదుగుబ్బలి పెకలించి బంతికై వడిఁ గేలఁ బట్టినాఁడఁ
గదమేటికల కొల్ల గడిమి మీఱఁగఁ బట్టి యే నూడిగములు సేయించినాఁడ

మేలుపన్నియపొట్ట వేలుపుమిన్న చేఁ గద లేని మెప్పులు గాంచినాఁడ
వేల్పురాయనిప్రోల వెలయఁగా డెపుటచ్చరల నెల్లఁ దమి గొల్పి కలసినాఁడఁ

తే. ఋలుఁగురాముద్దుగుమ్మలఁ జిలువచెలులఁ, జదలుద్రిమ్మరుకొమ్మల జక్కిమోము
మెఱుఁగుఁబోఁడుల నెల్లను జెఱలు దెచ్చి, మనికిపట్టున ననయంబు నునిచినాఁడ. 58

సీ. వేల్పురాయఁడు బత్తి వెలయఁ బుత్తెంచిన పుడుకుమ్రాన్వలితావిపూవుటెత్తు
లీఁద మేపరిసామి యిమ్ముగాఁ బంచిన మవ్వంపుబలుదమ్మిమానికములు
త్రాడుదాలుపు మెత్తఁదనమున నొసఁగిన క్రొత్తనున్గట్టాణిముత్తియంబు
లెద్దుతత్తడిజోదు కుద్దికాఁ డిడినహొరంబట్టునాడెపుజిల్గుపట్టములును

తే. మఱియుఁ దక్కినకడలఱేం డ్లుఱక మంచి
సేయుటకుఁ బంచునపరంజియూయెలలును
గద్దియలు మేలిసెజ్జలు పెద్దతొడవు
లెపుడు నాయింటఁ గొద లేక యెనసి యుండు. 59

క. త్రుంపులగని పగు నీవీ, సొం పెడలినపేదమానుసులవెంటఁ గటా
దుంపులఁ గూరలు నమలుచుఁ, గంపలఁ బడి తిరుగ నేల కైకొను మమ్మున్. 60

తే. అనుచుఁ దనతొంటిరూపు చూపిన వడంకి, యన్నులమిన్న జెబ్బులిఁ గన్న లేడి
జోటియుంబోలె నేలపై సొమ్మసిలినఁ, జూచి యచ్చెరజపురక్కసుండు వేగ. 61

క. పొంగుచు నరదముపైఁ బో ల, తిం గూరిమి నునిచి వేల్పుతెరవునఁ బఱచెం
బంగరుపిచ్చిక గొంచుఁగా, నింగికి సాళువపుఁబులుఁగు నెగయు తెఱఁగునన్. 62

తే. అత్తెఱంగునఁ గొనిపోవునపుడు కన్ను, విచ్చి కడ లెల్లఁ జూచి యమ్మచ్చెకంటి
యుఱక పలవింపఁదొడఁగె నయ్యో మఱంది, నేల పొమ్మంటిఁ గొదలేనియెగ్గులాడి.

క. కటకట యిపు డద్దోసమె, ఘటుకునఁ దగులుకొనఁ బోలుఁ దప్పక యిఁక నె
చ్చటఁ గలరు వీనిఁ దెరలిచి, దిటముగ ననుఁ గాచుకొనఁగ దివిరెడువారల్. 64

ఆ. కడలఱేఁడులార ఒడదారులార మె, కంబులార గ్రుడ్డుకొమ్మలార
చెట్టులార తోడఁబుట్టువులార పెన్గట్టులార నన్నుఁ గావరయ్య. 65

క. కల్లరితొలివేలుపుఱేఁ, డల్లనఁ జెఱ వట్టుకొనుచు నరుగుచునున్నాఁ
డెల్లదెఱంగుల నిపుడో, తల్లీ విడిపింప రాఁగదవె పంటచెలీ. 66

తే. జనకుఁ డనుఱేనిపట్టిని జాల్పు పేర్మి, జేనికొడల రామునిచాన నిట్లు
రక్కసునిచేత ననద నై చిక్కువడితి, వేల్పుదొరలార కావరే వేఁగ జేసి. 67

తే. అనుచుఁ బెక్కుదెఱంగుల నమ్మెలంత, మొఱ నొసంగిన నాలించి నెఱి జటాయు
వనెడిపులుఁగులదొర యొక్కఁ డడ్డు దాఁకి, సోఁకుమూఁకలయొకిమినిఁ జూచి పలికె.

ఆ. ఓరి దోసకారి యుడుగని క్రొవ్వునఁ, జెల్లుమాటి జగముతల్లి యైన
ప్రొద్దుకొలపుసామిముద్దియ నిటు లేల, కొంచుఁ బోయె దిపుడు గొంకు లేక. 69

క. తాటకు మనుమఁడ వై పొల, మేఁకవి తెఁగలందు వాసి మాఱి తనరుసీ
కీతెఱఁగునఁ గొదుగక పెఱ, నాలిం దమి నిగుడఁ దాఁగొనం దగ వగునే. 70

క. వలదు ముడికాఁడ రాముని, కలికిం దిగనాడి చనుము కాకుంటిన న
బ్బలుమగనితూపుటగ్గిం, దొలివేలుపువంగడంబు ద్రుంగెడుఁ జుమ్మీ. 71

క. అని యదలించుచు వడిఁ బై, కొని యప్పొలసునితలలఁ గొనబొఁడుకుం
దనపుంబొమిడికములు పవి, యును దటుకున నేలఁ గూల నురువడిఁ దన్నెన్. 72

ఉ. తన్నిన నాతఁ డగ్గి బెడిదమ్ముగ ముమ్మొనవాలు వానిపైఁ
గ్రన్నన నేయ నప్పలుఁగురాయఁడు ముక్కునఁ జక్కు సేసి యా
మన్నియ తేరియక్కజపుమావులఁ గూల్చి కదంబుచున్నచోఁ
గన్నెఱఁజేసి చాలుపుమొగంబులరక్కసుఁ డుక్కు మీఱఁగన్. 73

క. పదివాఁడితూపు లాపుల్గుదొరం గుఱి సేసి యేయ గొబ్బున నవి పైఁ
బొదువంగనీక రెక్కలఁ, జదియంగా మోఁదె బలిమి సడలక యతఁడున్. 74

తే. అట్టు లెడ లేనికడిమిఁ గయ్యం బొనర్చ, జడబ్రతుకుగూఁడుపట్టుపుసామిమీఁదఁ
గినిసి కైదువ కేల నంకించి రక్కసుండు గాలుసు రెక్కలు చెండివైచె. 75

ఆ. వైచి నెమ్మితోడ వడిఁ జగచున్నచోఁ, బుడమికాన్పు చీరకడచెఱంగు
పించి తోడవు లెల్లఁ గొంచక ముడిచి యా, పజ్జ నున్నకొండపైని వైచె. 76

తే. వేల్పుగొంగయుఁ గడ లేనివేడ్కతోడ, నపుడె తనటీవి కేఁగి నెయ్యమున నింటి
చెంతపూఁదోఁటలోన నచ్చెలువ నునిచి, కఱకురాకాసికొమ్మలఁ గాపు పెట్టె. 77

తే. అంత నచ్చట నడవిలో నమ్మెకంబు, నొఱలఁ బఱిచులు చేసి లి త్రోలిచితెచ్చు
నెదలఁ దోఁబుట్టు పెదురైన నదలి రాముఁ, డరసిఁ గనుఁగొని కినుక నిట్లనుచుఁ బలికె.

క. అక్కట బలితపుటడవిన్, మెక్కులమగ గోల ననిచి మోమోడక నీ
విక్కడకు రాఁగ నెవలో, నక్కటికం బేల పొడమ దయ్యొం జెపుమా. 79

క. తోఁడంబుట్టువ వనుచు, న్నాడెంబుగ నెదను జాల నమ్మిక మీఱం
దో డిడి వచ్చిన నయ్యో, చేడియ నిటు డించి రాఁగఁ జెల్లునె నీకున్. 80

ఆ. అనినఁ దల్లడిల్లి యతఁ డిట్టులను నింత, కినుక యేల యన్న విను మెకంబు
గూలుచున్నయెడల నోలక్ష్మణఁడ యంచు, నఱచుటయు వెలంది యాలకించి. 81

తే. కళవళించుచు నెన్నిలాగులఁ దెలిపిన, మాన నొల్లక కొఱ గానిమాట లాడి
పనిచె నటు సేయకున్నచోఁ బడఁతి యలుగుఁ, జేయుటకు మీ రలుగ నేమి సేయువాఁడ.

క. అని నుడివినఁ దమ్మునిపైఁ, గినుక యొకించుకయు మదిని గీల్కొల్పక గొ
బ్బున తేఁ డాపుంజవికత్తుఁ, జని చెలి గనఁబడక యున్న పదలినకడఁకన్. 83

క. పొదల గొందులఁ బదుకుల, క్రిందుల నయ్యాకుటింటిక్రేవల నెల్లన్
గుంపడి గొని వెదకుచుఁ జెలి, గందుం దొరగానరాక యొంటియు వంటన్. 84

సీ. కటకట సైదోడ క్రాల్గంటి కార్తికంబులచేతఁ బొలిసెనో యలుకఁ జేసి
కానల డాఁగెనో కఱకురక్కసులచేఁ జిక్కెనో లోయలఁ జేరుకొనెనో
పెనుజక్కరలయందు మునిఁగెనో చిఱుతగుబ్బలు లెక్కి మరల నోపక యడఁగెనో
పొదలలో నీఁగెనో కొదుకక చెంచుతొయ్యలులతోఁ జేరిక నాడఁ జనెనో
తే. కాని కనఁబడ దయ్యె నక్కలికిచంద, మరసికొందము ర మ్మంచుఁ దెరవు పట్టి
గుట్టు వీడంగ నెదఁ గ్రాలు బెట్టిదంపు, వెతలఁ గుందుచు నందంద వెతకికొనుచు. 85

సీ. చానలతలమిన్నఁ గానరుగద గొరవంకలార తుటారిజింకలార
పోయగంబుల ప్రోకఁ జూడరుగద నెమ్మి దాఁటులార పిసాళి తేఁటులార
రతనంపుగని యిందు రాదుగదా చెంచుకల్కులార యొయారిచిల్కలార
పసిఁడికీల్బొమ్మ మీపజ్జ నేఁగదుగదా కొంచలార కొలంకుపటుచలార
తే. వన్నియలదొంతి మీచెంత నున్నదేమొ, కన్ను లలరారఁ జూపరే పొన్నలార
మిన్ను ముట్టినమేనికగున్నలార, తిన్నలార నిరాబారికన్నెలార. 86

క. తావలార కొదమజక్కవ,కవలార కడిందిసోయగపుఁదు మ్మెదకూ
టువలార మీ రిపుడు మా, నవలారతనంబుఁ జూచినారే చెపుఁడా. 87

సీ. మీకెంజివురుఁబోలుమెఱుఁగువాతెర `´ల ముగుదఁ గానరె మావిమోకలార
మీ క్రొన్ననలఁబోలుమేలిపొక్కిలి గల కొమ్మఁ గానరె పొన్నగున్నలార
మీపండ్లచెలువూను మేటిగుబ్బలు గలచేడియఁ గానరే యాడిలార
మీకంబములఁ గేరుమేలితొడల్గల నాతిఁ గానరె లేయనంటులార
తే. మీయలరురేకుగమిపోల్కి మిగుల నలఁపు, చికిలికొనగోళ్లు గలముద్దుచిగురుఁబోఁడి
తాఁగఁతనమున నెచ్చోటఁ దాఁగెనో క,నుంగొనరె మీరు కమ్మగేదంగులార. 88

తే. మొల్లపొదలార మీతొలిమొగ్గచాల్పు, కరణి సొంపునఁ బొదలుపల్వరుసఁ గలిగి
చెలఁగునాడెంపురాచకెంజిగురుటాకుఁ,బోఁడి నెందైనఁ బరికించి చూడరు గద. 89

క. నదలం దొడలం గుబ్బల, నదరఁగ ని న్నోటువఱిచె నని డెందమునన్
గడు నలుగక యేనుంగురొ, పడఁతుకతెఱఁ గిప్పు డెఱుకపఱుపుము నాకున్. 90

క. రంగున నెన్నడుమున ని,న్నుం గేరె నటంచుఁ గినుక నూల్కొన గరిత
న్సింగిలివో నిక్కంబుగ, సింగమ కలచంద మెల్లఁ జెపుమా సరగన్. 91

క. ఇదె మాటికిఁ బెనగొనియెదుఁ, గొద మాలినవలపుతేఁటికొదమా చెలిపై
నెద మాననియల పూనుచుఁ, బొదమా పరికింత మలరుఁబొదమాటునకున్. 92

క. పలుకులతియ్యఁదనంబున, నలువుగ నీతోడ నీ డనం జాలినలేఁ
జిలుకలకొలికిని జూచితె, చిలుకా మాతోడ ముద్దు చిలుకం జెపుమా. 93

తే. అనుచుఁ దద్దయుఁ బలవించుకొనుచు ముందు, వచ్చి నిలిచినచోటికి వచ్చికొనుచుఁ
దొడరి యడిగినదానికే యడిగికొనుచు,నంతకంతకు వెక్కసం బైనవెతల. 94

సీ. పురి విచ్చి నట్టువపుల్గు లాడెడుచోటఁ బడఁతివేనలి యంచుఁ బరువు వెట్టుఁ
గవగూడి కొదమజక్కవ లేఁగుచో నింతిపాలిండు లని కేలఁ బట్టఁ దివురు
గుంపు గట్టుక గండుఁగోయిల ల్గూయుచో నతివయెలుం గని యాలకించుఁ
కెలరేఁగి రాయంచ చేరువ న్మెలఁగుచోఁ గలికి నెన్నడ లని కలువరించుఁ
తే. జిలుకబోదలు గిరిగొని పలుకుచోటఁ, జెలువనునుబల్కు లని తమిఁ జేరఁబోవుఁ
దేఁటిదాఁటులు మెఱయుచో బోటియెలుగు, పాట లని చొక్కు వలవంత ప్రబ్బికొనఁగ.

ఉ. మాయనుగుంజెలిక్ వెతకుమా యనవొప్పఁ దుటారిచిల్కలే
మా యనుఁ గందుఁదేఁటికొదమా యను నిద్దపుముద్దుఁజందమా
మా యనుఁ జుట్టుపుల్గుతుటుమా యను గ్రద్దఱికానుచింకకూ
మా యను నింక నోర్వఁ దరమా యను నక్కట దయ్యమా యనున్. 96

ఉ. పాయను నేర మేమి బలుపాయపునాడెపుఁ బ్రోదరాచపా
పా యనుఁ గుందనంపుమెఱుపా యనుఁ బూవిలుకానివాలుఁదూ
పా యనుఁ బల్కవేమి వినుపా యనుఁ బంటవలంతిముద్దుఁగా
వ్వా యను నిట్టు లింత మఱపా యను నీ కిది నేరుపా యనున్. 97

క. ఆస కేల లేదు మదిలో, బలుకానలనడుమ దాఁగి పలుకవు మరుపూ
ములికీ కలికీ చిలుకల,కొలికీ చెలి కిట్టిములుక గూడునె యెందున్. 98

క. వంతలఁ బొంతలఁ బడి పలు, వంతల గాసిలఁగఁ దగునె వలిగొజ్జఁగిపూ
బంతీ యింతీ సొగసుల దొంతీ మము నింత గలఁప దోసము గాదే. 99

క. వల దని యెన్ని తెఱంగుల, మలపిన వినఁ నొల్లఁ బోక మక్కువలోఁ గా
నలకు వ్వానితో వచ్చితి, వెలనాగరొ నిన్నుఁ బాసి యిఁక నెటు లోర్తున్. 100

తే. మెలఁత నిద్దంపుఁబానుపుమీఁద నలరు, రేకు సోఁకినఁ గందబాఱెడునలంతి
మేనుదీవియ యిబ్బలుకానలోన, నోలిఁ ద్రిమ్మరుచో నెట్టు లోర్చెఁ గెపురు. 101

సీ. అకటిక్కలు వాడె మైనమాదువు లయ్యె మంటిదుంపలు పిండివంట లయ్యె
నారచీరలు జిల్గునలువుఁ బట్టము లయ్యెఁ బదుకుసెజ్జలు పూవుఁబాన్పు లయ్యె
వాఁకనీరులు దియ్యవలిపానకము లయ్యె బిగువుసేలలు పైఁడిజగిలు లయ్యెఁ
బొలముడొంకలు మేలిచలువపందిరు లయ్యెఁ బూదిపూఁతలు దావిపూఁత లయ్యెఁ
తే. దిప్పవెల్లను గప్పంపుఁదిప్ప లయ్యెఁ, గార్శ్మకంబులుఁ దలఁగనికాపు లయ్యె
నిన్నుఁ దగఁ గూడియడవుల నున్నయపుడు, చానయెడబాసియిఁక నెట్టు సైఁచువాఁడ.

తే. అనుచుఁ బెక్కుతెఱఁగుల నడలుచున్న
యన్నఁ గన్గొని లక్ష్మణుం డనియె నహహ
తెఱవకై యిట్టు చెల్లఁబో దిటము దప్పి
యొఱలఁ దగునయ్య నీవంటియుఱియదొరకు. 103

క. మగంటిమి విడనాడి యయో, నగువారల నెల్లఁ దలఁపునం బెట్టక ప
ల్వగలం బొగలం దగవా, జగ మెల్లం బ్రోదిసేయఁ జాలెదుసీకున్. 104

ఉ. ఉల్లమునందు నీకు వెఱ పూనఁగ నేటికిఁ దమ్మిచూలిబల్
త్రుళ్ళుదఁగింతుఁ బాతమున దుంతహూమాయివజీయఁ బట్టి యే
వెల్ల నడంతు వేలుపుల నేఁచి కలంతు జగంబు లన్నియుం
దల్లడ మందఁ జేతుఁ గద తామరకంటినిఁ జూప కుండినన్. 105

ఉ. ఇంతకొఱంత యేల విను మేచి జగంబులు తాఱుమాఱు గా
వింతునొ ప్రొద్దువేఁడి యుడిగింతునొ సంద్రము లొక్కమాటె యిం
కింతునొ నల్వగుఱ్ఱు లుడికింతునొ వేల్పులఁ బట్టి బిట్టు దూ
లింతునొ కొండ లెల్లఁ బెకలింతునొ నిక్క మెఱుంగఁ జేయవే. 106

క. ఓఱేఁడ నీకు మది వేమాఱును గుందంగ నేల మానసికెనుకం
దేఱి కనుంగొనుచో మఱి, మాఱువడం గలరె యెట్టిమన్నీ లైనన్. 107

తే. అనినఁ దమ్మునిపలుకుల కలరి కొంత, డిటము గైకొని వేగ నచ్చటను దరలి
దక్కినపునేల కెదురుగా దారి పట్టి, యొత్తి వెలయంగఁ బని చని యొక్కచోట.

క. ప్రక్కి తునింగినకాళ్లును, ఱెక్కలు నై పడ్డపక్కిఱేనిం గని యే
రక్కసిబూటకమొ యిది, చక్కాడెద నంచుఁ దరియఁ జనుచున్నతఱిన్ 109

తే. పుడమిఱేనిఁ గనుంగొని పుల్గురాయఁ, డనియె నోతండ్రి మీతండ్రి కనుఁగ నరుణుఁ
డనఁగఁ బగఁగినగ్రుడ్డుకాన్పునకుఁ గూర్మి, బిడ్డఁడ జటాయు వనియెడిపేరివాఁడ.

క. విను మోదేవర రావణుఁ, డనురక్కసఱేఁడు చెనఁటి యై సీతాలఁతిం
గొనిపోవఁగ వానిం బై,కొని యని యొనరింప నిట్టిగొడవలు సెందెన్. 111

తే. పున్నెములప్రోవ నాతొంటిపున్నియంబు, వలన వలనుగఁ గదుఁ దొలిపలుకుఁగొనలు
గాంచి మించినజడదారిగముల కైనఁ, గనఁబడఁగ రాక యుండుని న్గంటి నేఁడు.

క. తలఁగెం గడికపుదోసము, లలరెం డెందంబు పున్నియంబుల కెల్లన్
నెల వయ్యెఁ బుట్టు వింకను, గలపని మఱి యేమి గలదు కవికరపుగనీ. 113

సర్వలఘుసీసము. తొలిపలుకుఁగొనలుఁ దెలియుతపసిచలి వెలుఁగులకుదొరకుచెలువుల గని
తెలికదలిని గరువలికుదుపఁదొర పఱుపయి నిదురఁ గొఱలునుఱియ
దలవిలుతుఁడు నలుదలలయొడయఁ డనుఁ బనియు రొగిఁ బొగడ నలరువలఁతి
పలుజెఱఁగులు గలపొలనుదిసెదుగమిఁ గడిమిమయి నడఁచుకడిఁదిబిరుద

తే. వలమురి సుడికయిదువయుఁ బులుఁగుసిడము, పసిఁడిమువలువ కలిమిపడఁతుకయును
గలుగుమగఁ డగుదిను మదిఁ దలఁచినపుడె, విడిచి చనుఁగదె బలుకొలలిదుముగములు

క. అని పొగడుచు నతఁ డాసామిని డెందమునందు బత్తి మీఱఁగ నిడి చ -
య్యన నొదలు విడిచి నింగిమునఁ జెన్నెఁదుఁ జెలికయ యుంచుప్రోలికి జనియెన్.

తే. అపుడు రాచూలి దద్దయు నడలుకొనుచు, నప్పలుఁగువంకదపుదారఁ గగ్గిపనులు
తొలిమినుకుజాడ నొనరిచి యలర నచట, వెడలి యరుగుచు నొక్కచో వెఱఁగుమీఱ

క. తల లేక నిడుపు లగుచేతులు గ్రాలఁగ నడవిలోన దొంకినమేతా
ల్పుల నెల్లఁ బట్టి మ్రింగెడు, పొలమేపరి నొకనిఁ జూచి పొదవినకినుకన్. 117

క. రెండుమొనవాఁడికోలల, రెండుబుజంబులను వానిరెం గూల్చి కడుం
గొండవలె నున్నయబ్బలు, మొండెపురక్కసుని మేను ముఱియలు చేసెన్. 118

క. చేసినఁ నాతఁడు తొల్లిటి, దోసంబులఁ బాసి మొగిలుత్రోవను జేజే
వేసంబున నరుగుచు రా, కాసులదొర యున్నదారి క్రన్ననఁ దెలిపెన్. 119

క. తెలిపినఁ జనుచో ముందఱ, వలనుగ నొకచెంచుతెఱవ వారలఁ దనయి
ష్టులకుం దోడ్కొని చని దుం, పలుఁ బండులు చాల నొసఁగి బలితపుటెలమిన్. 120

క. ఒరిమికయు బత్తియు న్మదిఁ, గర మలరఁగఁ బూజ జేసెఁ గన్నియ యపు డా
గరువంపుటెఱచిదిండుల, నిరుసతపదినూఱ్ల దొరల నేసినదొరలన్. 121

ఆ. అట్లు పూజ చేసి యాలేమ రామునిఁ, గాంచి పలికె వినుము కడిఁదిమగఁడ
పంప యనెడువాఁకపజ్జల బుశ్యమూ, కం బనంగ నొక్కగట్టు గలదు. 122

తే. అందు సుగ్రీవుఁ డను పేర నలఁతినొక్క, చెట్టుద్రిమ్మరియొకిమీఁదు సెలఁగుచుండు
వానితోఁ జెల్మి యొనరించెదేని నీదు, కర్జ మెల్లను సమకూఱఁగలదు సువ్వె. 123

క. అని తెల్పి యప్పలంతుక, పనిఁ బూనిచి పాపఁ బాపపజ్జకు వారల్
చని యచటిచెట్లనీడల, నొనరారఁగ మెలఁగుచుండి రోరిమి వెలయన్. 124

తే. అనుచు జేజేనిరాజారి యనువు మెఱయ, నెఱుఁగఁ జెప్పినకత విని యెడుదవలంతి
యవలికతయును దెలుపవే యనుచు నతనిఁ, గడఁక దైవార మెల్లన నడుగుటయును.

చ. తొలికడరాయఁ డగ్గియును దుంతసిడంబునగండు సోఁకుమూఁ
కలయెడయందు నీళ్లదొర గాదుపు జక్కులఱేడుఁ జిల్వసా
ములయెకిమీఁదు నాల్గుబుజము ల్గలవేలుపుఁ దమ్మిమాలియుం
గొలువఁగ వెండికొండపయిఁ గూర్మి జెలంగుకడిందిదయ్యమా. 126

క. కోఱలపాఁగయుం గడితపు, చాఱలదుప్పటియు సాఁరెసాఁరెపుఁ జలువ
ల్మీపెదు క్రొంబువ్వను మి, న్నేఱును నెఱఁ బూని వెలుఁగునెక్కటివేల్పా. 127

తోటకము. పొలుపారుమగంటిమిఁ బూని జగం, బుల వేమఱు నేఁచుచుఁ బొంగెడుబ
ల్పొలమేపరిబంటుల ప్రోక్కకయె, మ్మెలతూపునఁ గూల్చిన మేల్పిరుదా. 128

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురం
ధరఘనయశోబంధురకౌండిన్యసగోత్రపవిత్రకూచిమంచిగంగనామాత్యపుత్త్ర బుధజన
విధేయతిమ్మయనామధేయప్రణీతం బైన యచ్చతెలుఁగురామాయణమహాకావ్యమం
దారణ్యకాండము సర్వ మేకాశ్వాసము.

శ్రీరస్తు

# అచ్చతెలుఁగురామాయణము

## కిష్కింధాకాండము



క. సిరుల నిడుమనికిపట్టా, గరువపురక్కసుల ప్రోవు గాల్చినదిట్టా
వారువుఁగొనమ్ములతిట్టా, పురు డెన్నఁగ రానివేలుపులతలకట్టా. 1

తే. వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పుతపసి, వల్కె రాచందమామ లప్పుగిదిఁ బంప
కడ మెలంగఁగ నద్దరి గట్టుమీఁద, నుండి కన్గొని ప్రొద్దుకుఱ్ఱఁడు దలఁకి. 2

క. వీరలు రాకొమరులొ జడ, దారులొ తూపులును విండ్లు దాలిచి యున్నా
రారయ వాలికతంబున, నీరూపున వచ్చిరేమొ యిపు డిచ్చటికిన్. 3

చ. వీరలచంద మెల్ల నరవిం బరికింపక కాని యింక లో
నోరిమి గల్గ దంచు నసు కొప్పఁగ నాడిన నాలకించి వి
న్గూరిమిమన్నఁ డాసొబగుకుత్తుకకోఁతులఱేనిఁ జూచి యే
నారసి వత్తు వారితెఱఁ గంతయు వింత దలంప నేటికిన్. 4

తే. పున్నియప్రమానుసులు గాని యెన్న దోస, కారితీఱులు వీరిలోఁ గానఁబడవు
వంత యొంతయుఁ బూనఁగా వలవ దిచట, నెలమితో నుండు మీ వని పలుకుటయును.

క. సుతసిలి యాతఁ డాహను,మంతున కానతి యొసంగి మదిలో మిగులన్
వంత యెలర్పఁగ నపుడే, మంతులతోఁ గూడి చనియె మలయంబునకున్. 6

ఆ. అంత నీఁదచూలి యమ్మన్నతేఁడుల,చెంత కరిగి బత్తిఁ జేయిదోయి
మొగిచి పలికె నరిదిమొనగాండ్రు రార మీ, రెవ్వ రిందు మెలఁగ నేటి కిటుల. 7

క. అనిన విని రాముతమ్ముఁడు, సెన రొదవఁగ నతనిఁ జూచి నేర్పునఁ బలికెన్
విను కొమ్మమెకపుబలియుఁడ, గొనకొని మాచంద మెల్ల గుఱు తెఱిఁగింతున్. 8

సీ. పుడమి నయోధ్య యన్ ప్రోలి కేలిక యైన బంతితేరులఱేనికట్ల మేము
తండ్రిపంపున బల్దిదపుఁగానలకు వచ్చి మెలఁగుచో నీఱేనిమెలఁత నొక్క
చెనఁటిరక్కసుఁ డెత్తుకొని పోవ నావెన్కై వలగొని వెదకుచు వచ్చివచ్చి
చెంచుముద్దియ నోర్తుఁ గాంచి యత్తెఱఁ గెల్ల వినిపింప నయ్యింతి వెరవు మీఱ

తే. మంచిమెడకోనత్రిమ్మరిమన్నెగాని
కత యెఱింగింప నాతని గనుఁగొనంగఁ
వలఁచి వచ్చితి మిచటికిఁ దొలుపు మెఱయ
-నతఁడు రాముఁడు లక్ష్మణుఁ డంద్రు నన్ను. 9

తే. ఒనర నిద్దొరచేఁ గాసిపని యొకింత, లేదు జగమున నిలనికి లెంక యైనఁ
బ్రొద్దుకొమరునిపని యెల్లఁ బొసఁగఁ జేయు,నింక నీ వెవ్వఁడవు నాకు నెఱుఁగఁ బలుకు.

తే. అనిన వాతఁడు వల్కెనో యయ్య చిన్క, దాతిదారియనఁగుఁగూనఁ గోతి కూర్తి
దనరఁ గేసరి యనుకోనమునికిపట్టు, కలికి యంజన యనునది గన్నవాఁడ. 11

క. హనుమంతుం డను పేరం, దనరారెదువాఁడఁ బచ్చతత్తదులవతీ
రునికొమరుని కెంతయు న, మ్మినబంటఁ గడింది లేజు మీఱినవాఁడన్. 12

క. అకొకనత్రిమ్మరులదొర, యక్కజపుం జెలిమి తోడ ననిచిన నిపుడీ
చక్కికి మీ తెఱఁ గరయఁగ, నక్కఱఁ బఱతెంచినాఁడ నయ్య వలంతీ. 13

తే. లెక్క కెక్కువ యగుమ్రానుటిక్కదొరలు, గలరు బలుజోదు లాతనిఁ గొలుచువార
లట్టిబలియుఁడు మీకు బం టయ్యెనేని, యరయ నీరేనుజగముల నడ్డు గలదె. 14

తే. అట్లు గావున మీ కిపు డతనితోడఁ, జెలిమి గావింపఁ జెల్లు వేంచేయుఁ డనుచు
వారిఁ దోడ్కొని యక్కరుపలియనుంగుఁ, గొమరుఁ డెలమిని ఋశ్యమూకమున కరిగె.

తే. అచట వారి నునిచి యపుడె కోఁతులఱేని, నరస కేఁగి తాను జన్న తెఱఁగు
విన్నకం బొనర్చి వ్రేల్మిడి నతని న,ద్దొరలకడకు వేడ్కఁ దోడితెచ్చె. 16

క. తెచ్చిన నతఁ డాఱేఁడుల, కొచ్చెము గనరానిబత్తి యొదవఁగ మ్రొక్కెన్
చెచ్చెర నిడి రామునితో, మచ్చిక వెలయంగఁ దియ్యమాటలు వలికెన్. 17

ఆ. రావ వేల్పుఱేఁడ మీచొక్కటపుమజ్జ, దోయి గంటి నెఱఁగు దోఁప నిపుడు
వోలఁగొఁ నెల్ల చెడుగుఁదొసఁగులు గడలేని, పున్నియంబు లెల్లఁ బొదలె మాకు. 18

ఆ. కడిఁదిబిరుద నీవె కాక మావ్రేఁ గికఁ, బొసఁగ నరుఁ డొకండు పూనఁ గలఁడె
పుడమిపడఁతి వ్రేఁగు పడగదాలుపురాయఁ, దూముఁ గాక లాఁతి యూనఁ గలఁడె.

తే. నలువు మీఱంగ నన్ను మీనలువురమును, దోడఁబుట్టువునుగఁ జెల్మి తోడఁ జూచి
కరము పెనుపొందు నీకనికరము నెఱపి, యిడుము లెడఁబాపి కోరిక లిడుము మాకు.

క. అని మును రక్కసుఁ డెత్తుర, చనునప్పుడు పుడమికాన్పు జతనంబుగఁ గొం
గున ముడిచి గట్టు పై వై, చినతొడవులు దెచ్చి ఱేని చేతి కొసంగెన్. 21

క. ఒసఁగిన నవి గైకొని వె, క్కస మగుకన్నీరు దొరుగఁ గళవళమున లో
నసురుసు రనుచుం గడిఁదపు, డెసలం బడి కొంతవడికిఁ దెలివి దలిర్చన్. 22

క. ముచ్చోకపురూపులు పూ, న్వెచ్చని కేజేయుమంగునిసుగుం గని లో
లో చ్చోకయింతయు నోదవని, మచ్చిక నవ్వాసిరాచమానిసి పలికెన్. 23

క. మలద్రిమ్మరిరాయఁడ దిట, మలరఁగ నీపగతుఁ బీచ మడఁచి పుడమి కి
మ్ముల నొడయనిఁ జేసెద నినుఁ, దలఁపున మామాట నమ్ము దలఁకకు మింకన్. 24

క. ఆకొండసూడుపట్టికి, నీకును బగ యెట్టు లొదవె నిక్కువ మొనరన్
మా కెఱిఁగింపుము దిగ్గన, నీకర్జం బెల్లఁ బొడివి నెగడఁగఁ జేతున్. 25

సీ. అనిన నాతఁడు పల్కె నయ్య మున్నాయీవి యనెడురక్కసుఁ డొక్క డాముమీఱఁ
జేరి పో రొనరింపఁ జీఁకటి నెన్నిక గనుతోఁకగలకోనమసికపట్టు
నను దోడు పిల్చక మొనసి యచ్చెనఁటిపై నరుగ నిద్దఱఁ జూచి కరము వెఱచి
పఱచి వాఁ డొక్కగుబ్బలి పెనుబొఱియలోఁ దూఱిన నతఁడును దోన తూఱె

తే. పెక్కులాగులఁ బైకొని పెనఁగుచున్న, తఱిని నెత్తురు వఱపలై పఱచుటయును
బొలసుమేపరిబొబ్బలు సెలఁగుటయును, జూచి యవ్వాలి మడిసె నంచుం దలంచి.

క. కదువడిఁ గలుఁగు మొగంబునఁ, బను కొక్కటి ద్రోచి మెనకపను లాతని కే
ర్పడఁ జేసి వీడు సేరినఁ, గడఁకం బజ లెల్ల నన్నుఁ గనుఁగొని యెలమిన్. 27

తే. త్రిప్పుద్రిమ్మరినా డెల్లఁ దివిరి పోరిపు, మనుచు నొడయనిఁ గావించి యునుచునంత
రక్కసుని ద్రుంచి మిక్కిలి యుక్కు మెఱయ, వచ్చినఁ జూచి కినిసి యవ్వాలి పలికె.

ఆ. ఓరి దోసకారి కూరిమిసైదోడ, వనుచు నిన్ను నమ్మి యకట పగతు
తోడఁ బో రొనర్పఁ దొడఁగినచోఁ గికు, రించి రాఁగఁ జనునె కొంచు లేక. 29

తే. అనుచు నాకూర్మి గేస్తురా లైనరుమను, గొని పుడమి యెల్లఁ గొని తఱిమినఁ గరంబు
దలఁకి యిక్కొండపైఁ జేరి మెలఁగుచుండి, ఇచటి కాతఁడు రాలేమి యెద నెఱింగి.

చ. అనవుడు నేలపేఁడు వెఱఁ గందుచుఁ గోఁతులపేఁద మేటి తే
జును జగ మెంతయుం గెలువఁ జొప్పడులావును గల్గువాలి కి
వ్వెనుమల కెక్కరామి వినిపింపుము నిక్కముగా నటన్న న
మ్మినుకులయిక్కకట్టఁ డెకిమీనిఁ గనుంగొని పల్కె వెండియున్. 31

క. విను దేవర మును దుందుభి, యనురక్కసుఁ డొకఁడు దుంకమై వేల్పులరా
యనికొమరునిఁ దనతో దుర, మునకుం బిలిచినఁ గడిందిమునితో నతఁడున్. 32

ఉత్సాహ. అలుక మీఱ నప్పిసాళియాముదుంకరక్కసుం
దలఁ గొకింత లేక కూడఁ దఱిమి రెండుకొమ్ములుం
గలయఁ బట్టి యబ్బురంబు గాఁగఁ గ్రిందఁ ద్రోచి రే
వెలుఁగుజోదుబిడ్డఁ డేలుపీటి కంచె వ్రేల్మిడిన్. 33

ఆ. అనిచి బలిమి నొక్కయామడ నర వాని,యొడలు దన్ని వైవ నురలి నల్ల
బొట్టు లివ్వెడందగట్టుపైఁ బడిన మ, తంగుఁ డనెడుదొడ్డతపసి కినిసి. 34

క. ఇక్కొండ వాలి కెన్నఁడు, నెక్కఁగ రాకుండ మేర యిడె నటు లాబల్
రక్కసునిమేను సిమ్మెదు, నక్కతనికె కాక పుడమి నొరులకుఁ గలదే. 35

తే. అనిన రతనాలబొజ్జ ప్రోయాలిముద్దు, పాపపెనిమిటి తొగదాయపట్టి నపుడె
కలువరేనుపోతుపాలదిండి వడ్డచోటి,కెలమితోఁ దోడికొని చని బలిమి మెఱయ.

క. కొదుకక యారక్కసుమెయి, వొదలుచుఁ దననునుపుట్టజ బొటమనవ్రేలన్
బదియామడ సనఁ జిమ్మిన, నెద నలరుచుఁ గొమ్మమెకపుటేలిక యనియెన్. 37

తే. అయ్య మును వాలి వంకర లైన తాటి, చెట్టు లొకయేడు గొఁగిటఁ బట్టి యాకు
లెల్లఁ గోయఁను నీ పవి యిప్పు డొక్క,యమ్మున నడంచు మనుటయు నట్ల యేసి.

సీ. అదవిద్రిమ్మరిఱేఁడ తద వేల కిష్కింధ కరిగి మాయన్నతో దుర మొనర్ప
చుండుము మేము నీయందనే పఱతెంచి యకూ్కళఁ బోనీక యుక్కడంచి
నిను దొరఁ జేయుదు మని ఱేఁడు పనిచిన నతఁ డట్ల చని వాలి ననికిఁ బిలువఁ
గొఱకొఱలోద గ్రక్కున వాఁడు వెడలిన నిరువురు గదిసి వారిఁ బెనంగు

తే. నెదలఁ దోడన చని వాని నేఱుపఱుప, రాక యుండినఁ గొంకుచు రాముఁ డొక్క
యుక్క నూరక యున్న నయ్యుపముసూడు,పట్టి వ్రేటులఁ బడి వేగఁ బాఱుతెంచి.

క. ఒదయనియడుగులఁ బడి కదు, నదలిన నూరార్చి మరల నరుగు మటంచున్
మెడ నొకపూలసరం బిడి, వడి ననిచిన నేఁగి పెనఁకువకుఁ బిల్చుటయున్. 40

తే. పొసఁగఁ దోఁబుట్టు వనుకూర్మి వోవ విడిచి బ్రదుకఁ జాలక మిక్కిలి బాటువోలెఁ
దిరుగ నరుదెంచుటకు వీనిఁ దేర్తు ననుచు,నొడలిచూపుల యొదయనికొడుకు వెడలి.

క. ఉడి వోపనికొఱకొఱతోఁ, గడువడిఁ బైఁ గదిసి కడిమి గదలుకొనఁగ బల్
పిడుగున కెన యనఁ దగుతన,పిడికిట నప్పా ద్దుకొడుకు పేరెనఁ బొడిచెన్. 42

క. పొడిచిన నిలువక పుడమిం, బడి నెత్తురు గ్రక్కి లేచి పాయక యతఁ డ
గ్గదుసరిపై బలితపుఱా, పదరఁగ నొకమద్ది పెఱికి యార్చుచు వైచెన్. 43

తే. వైచుటయుఁ వాలి ముష్టినవాలు పూని, చీఁకటులగొంగకొడుకుపైఁ జెలఁగి యేయ
నతఁడు దాని నడంగించి యతనిమీఁదఁ, దొడరి క్రమ్మఱ నొక పెద్దపడుకు వైచె.

సీ. అటువలె వారు పేరలుక లిబ్బడిగాఁగఁ దొడరియక్కజమొప్పఁ దొడయుఁదొడయుఁ
బెనచుక పెనఁగుచుఁ బిడికిళ్ల నడఁచుచుఁ దాఁచుచుఁ జఱుచుచుఁ దఱిమి బొబ్బ
లిడుచుఁ బెన్నారికులఁ బడుకుల రువ్వుచుఁ దోఁకల మోదుచుఁ దొలఁగఁ జనుచు
గోళ్ల వ్రచ్చుచుఁ బండ్ల గురుకొనికఱచుచు మెడలు నొక్కుచుఁ దూలి పుడమిఁబడుచు

తే. బిట్టు పూచినబూరుగుచెట్టులట్ల, నెత్తురులఁ దోఁగి పోరుచో నేలఱేఁడు
వేఁడివేలుపుబిడ్డనివాఁడి చెడుట, తెలిసి సింగిణి నొకజొడ్డచిలుకు గూర్చి.

తే. వేయుఁగన్నులుగలబలువేల్పుకొడుకు,ఱొమ్ము గుఱి సేసి యేయ మెఱుంగు లెల్ల
కదల నింపుచు నది సని కాఁడుటయును,బుడమిపైఁ ద్రెళ్లి నీల్గె గొబ్బున నతండు.

ఆ. అపుడు కోఁతిఱేని కమ్మానుసులఱేఁడు రిక్కపేరిచెలిని దక్క నొసఁగి
కొమ్మమెకపుఁబ్రోలి కిమ్ముగా నేలికఁ, జేసి యనుప బత్తిచే నతండు. 47

క. తొడవులు మానికములు విడి,ముడియు న్నాఁడెంపుఁబుట్టములుఁ బ్రోవులుగా
నుడుగఱలు దెచ్చి యిడి య,య్యొడయనియడుగుల కెఱఁగి యొప్పుగఁ బలికెన్.

ఆ. రాచఱేవెలుంగ నీచేత నిపు డెల్ల, గొడవలును దొలంగి చెడనిమేలు
కలిగె మాకు నిన్నుఁ గొలిచినవారల, కొకట ముత్తిబుత్తు లొదవుఁ గదవె. 49

క. వేలుపుల కైనఁ జిక్కని, వాలిం బొరిగొంటి వొక్కవాల్తూపున నీ
మ్రోల నిఁక నిలిచి మగఁటిమి, నాలము గావింప నొరుల కలవియె పుడమిన్. 50

క. పదిమోములరక్కసు నిఁక, సదమద మొనరించి కొఱలుసంతసమున న
మ్మిదిలదొరబోఁటఁ జేకొని, యెద వెడలోదిటము విడకు మింతయుఁ దంత్రీ. 51

క. వానతఱి వచ్చె నిదిగో, మానుగ నీనాల్గునెలలు మక్కువ మీఱన్
మానెలవున నుండి తుదిం, జానతెఱఁగ గరసి దండు సాగింపఁ దగున్. 52

క. కావున నావిన్నప మో, దేవర నీయెద్దను నిలిపి తేఁకువ మీఱం
గా వేంచేయుండు గొబ్బున, నావుడు రారిక్కఱేఁడు నగుచుం బలికెన్. 53

తే. కోఁతిరాయఁడ మాపయిఁ గూర్మి నిలిపి, వానకఱి యెల్ల నగఁబులలోన నుండఁ
దపసిరూపులఁ బ్రోల్తకుఁ దవిలి రాఁగ, మాకుఁ బొసఁగదు పొమ్ము మతాక రమ్ము. 54

క. అని యతనికి సెల విడి తలఁ,పునఁ బాటనెలంతకామపు ప్పిలిపి వెతం
గనలుచుఁ దమ్మునితో నొ,య్యన కూడుక మాల్యవంత మున్నల కరిగెన్. 55

తే. అంతఁ దనపట్టి యగువాలి నడఁగఁ జేసె, నీకొమరుఁ డంచు వేల్పుమన్నీఁడు ప్రొద్దు
నలమి ముట్టడి వేయించె ననఁగ మబ్బు, తెగలు పడిఁ బర్వెఁ జుక్కలతెరవునందు.

క. తొలివేల్పుచేసిసిరు లిఁక, నిలుపక చను నిట్టు లంచు నెఱి జగములకుం
దెలుపు తెఱంగున నఱిముఱి, మెలఁగెం దఱిగంటి త్రోవ మించుంబటుముల్. 57

క. పంటచెలియల్లునకుఁ దఱి, గంటిదొర ల్పగతు గట్టిగా గెల్చుటకై
యొం టెఱిఁగి యునుచువిం డ్లన, వింటన్ వేలుపులరాచవిండ్లు దనర్చెన్. 58

ఆ. జగము లేఁచుచాల్పుమొగములరక్కసుఁ, జిదిమివైచి నెయ్య మొదవ మమ్ముఁ
బ్రోవు మనుచు వేలుపులు రామునిగుఱించి, మొఱలు పెట్టి రనఁగ నుఱుము లమరె.

ఉ. పొలకవణంపుఁజేని నిఁకఁ బూనఁగఁ జాల నటంచు నేలతొ
య్యలి గఱివేల్పుహజ్జఁ బడి యంగదతోఁ దనచంద మంతయున్
బొలుపుగ విన్నవించుకొనఁ బోయెనొకో యన మబ్బుత్రోవకుం
బలుపుగఁ గ్రమ్మి దు మ్మెగసి పాఱె వడిన్ సురగాడ్పు పెంపునన్. 60

క. మొఱకుఁ దవంబునఁ జెఱచెలిఁ జెఱఁ గొని నీమనుమఁ డుఱకఁ జెడఁ బొల్పడె రూ
కఱి యని నలువకుఁ దెలుపఁగఁ, బఱచె నన న్మింట నంచబారులు సనియెన్. 61

తే. తనయనుఁగుఁగూన చెఱ నంట దలఁచి వెతలఁ,దూలునేలపొలంతుకదూప యడఁప
మొగిలుకడవల జేజేలు ముంచి నించు, వలిచదలువాఁక నీ రన వాన లెసఁగె. 62

తే. రక్కసునిఁ దోఁకఁ గట్టి సంద్రముల నెల్ల,ముంచువాలినిఁ ద్రుంచి తా నంచు వేల్పు
తెఱవ లారాముమీఁద ముత్తియపుఁబ్రాలు, గడఁకతోఁ జల్లి రన పడగండ్లు రాలె.

చ. కలువలదాయవంగడపుగామిడిచామను దెచ్చినట్టిమొ
క్కలపుఁబిసాళిరక్కసుని గట్టిగ లోఁ నిముకొంటి వింక రా
ఘవకడిమిం గలంచుఁ గన ని న్ననుచుం దమదేని కేర్పడం
దెలుపఁగ నేఁగె నాఁ బఱచె దెల్లగ నేయిలు నీటివామికిన్. 64

తే. ఎఱచి మేపరిసెత్తురుటేఱు లిట్లు, పఱచు నని తెల్పువడువున పఱవ లెసఁగె
వానినంజుడుమఱియ లివ్వరుసఁ బుడమిఁ, బొరలు నం చన జేవురుపురువు లడరె. 65

సీ. గాటంపువలినాలిగామ్పు లూర్పులు గాఁగ నిండాపువఱప కన్నీరు గాఁగఁ
గొమరొందు తెలిమబ్బు లుమికయుల్లెలు గాఁగ నెఱయఁప ల్బీరాడు నెఱులు గాఁగ
మొగలిపూఁబొదలు మోమునఁ జేప్పు చీరగాఁ బూరిమోసులు గగుర్పొడుపు గాఁగఁ
జిమ్మటపొదలు గాసిలి యుస్సు రనుటగాఁ నలరునెమిలికూఁత లార్పులుగను

తే. గడిఁదివేలుపురాచదాపుడుపురువులు, రాలురవణంపుఁదనుఁగెంపుఁదాలు గాఁగ
నేలప్రోయాలు దనముద్దుమూఁటఁ దలఁచి, తెఱపి గన రానివంతలఁ గొఱలి యొఱలె.

సీ. చిలువదిండులకుఁ జెచ్చెర నాటకమి మీఱె వానకోయిలలనీర్వట్టు దీఱెఁ
దెరవరిగములపై మరుఁడు నైదువ నూఱెఁ బొరిఁ బొరి నేఱులు పొరలి పాఱె
నడవులలో నెల్ల గడితంపుఁజి చ్చారె మీఁదటిడిగ్గియ ల్మిగుల నూరె
గొదకొని రాయంచపదువు నింగికిఁ జాఱె మొల్లంపుటెండలపెల్లు దీఱెఁ

తే. గాఱుదుంతలవంతలు కడకుఁ బాఱె, గ్రుడ్లఁ జెట్టుక పులుఁగులు గూర్లు దూఱెఁ
జేదగేస్తుల్కొంపలు బిట్టు గాఱెఁ, బజలపెట్టులు వడి నింకఁ బాఱె నపుడు. 67

తే. అంత నవ్వానకరువాఱియదను దోఁపఁ, బాటపూఁబోఁడి తనముద్దుపట్టికొఱకుఁ
బలువగలఁ గుంద మే నెల్లఁ బచ్చవాఱె, ననఁగఁ బసవంపుఁబైరులు గొనబు మీఱె.

సీ. కప్పుకుత్తుకపుల్గుగములపెల్లు దొలంగె, దెలిమొగు ల్పదల నేద్దెఱఁ జెలంగెఁ
గొలఁకులఁ దామర ల్గలువలు నలరారె గిబ్బపోతులు దద్ద యుబ్బి పాఱె
నలువబాబాపిండునులివు లెంతయు హెచ్చెఁ బొలముపొంతల జెల్లు పూయఁజొచ్చెఁ
బొద లెల్లఁ గార్కొని పొరిఁ బొరిఁ బసరించెఁ బ్రాసంగువరిచేలఁ బసలు మించె

తే. రొంపు లెడవాసె నేఱులపెంపు దీసె, జగము లుప్పొంగె రే లెల్ల మిగులఁ దేట
వెన్నెలలు గాసెఁ గన్నులవిల్తునయ్య, నిదుర మేల్కాంచెఁ గడలి నయ్యెదనునందు.

తే. ముగుద నెడఁబాసి వంతలఁ బొగులుచున్న, రాగవునిమీఁద దండెత్తి సాగె ననుచుఁ
జిలుకతుటుములఁ దోలఁ జొచ్చిరి చెలంగి, పొలముకాపరికాఁపులేఁదలిరుఁబోండ్లు.

తే. అపుడు కోఁతులఱేఁడు వాయునికడంక, నాఁకులచేత వడిఁ గమ్మ లనిచి యెల్ల
కోనత్రిమ్మరి మూఁకలఁ గూడఁబెట్టి, కీవి పెఱయంగ బూర పట్టించి తరలి. 71

క. అలిమిలి నప్పొల్లెము దను, గిలిగొని కొలువంగ నరిగి కెరలెడుబత్తిన్
మొలిచియుంచు నడుగుల కెరఁగిన, నరకడఁ జెట్టుకొని రాముఁ డాతని కనియెన్. 72

ఆ. జగమువిందుకంద జా గేమిటికిఁ గ్రొమ్మె, యుంగఁబోఁడి నిక రోయుగోలను
దంట లైనపోటుబంటులఁ గొండలి, నేర్చి పనిచి జాడ యెఱుఁగవలయు. 73

తే. తెలివ యున్నట్టితెఱఁ గెల్లఁ దెలిసి పిదప దురము గావింపఁ బగరపై నరుగవలయు
ననిన వల్లె యనుచు నాతఁ డక్కడింది,మగనిఁ గనుఁగొని యింపొంద మరల ననియె.

క. ఱేఁడులరాయఁడ విను మి, వ్వాఁడిమగ ల్గయ్యమునకు వచ్చినచో న
వ్వాఁడిమికన్నార నైనన్, బోఁడిమితో గెలుచుటకును బోలుదురు సుమీ. 75

తే. పుడమి వీరికిఁ జొర రానియెడలు లేవు, మీఱి నిక్కపుజగమైనఁ దూఱి వాలు
గంటిచందంబు దెలిసి రాఁగలరు మీరు, నెల వొసంగిన నంచుఁ జెచ్చెర నతండు. 76

సీ. కరువలికొమరుఁ డంగదుఁడు గవాక్షుండు నలుఁడు నీలుఁడు శతబలి గజుండు
గవయుండు మైందుండు గంధమాదనుఁడు ధూమ్రుండును బావకాక్షుండు వాల
పాశుండు తారుండు పనసుండు వేగదర్శియు వినతుఁడుఁ గేసరియు సుషేణుఁ
డెలుఁగులయెకిమీఁడు వృషభుండు గిరిభేదనుఁడు కుముదుఁడు శరభుఁడును మొదలు

తే. గలుగునాడెపుమొనగాండ్రఁ గదియఁ బిలిచి,కడఁకతో మీర లేఁగి యిప్పుడమి నెల్ల
కడల గుట్టలఁ బ్రోళ్ల గాఱడవులందు దీవులందునుఁ జెలిజాడ దెలిసి రండు. 77

క. మీమీలావులు నెఱపుచు, వేమఱుఁ జొర రానిచోట్ల వెదకి కడంకన్
జామ తెఱఁ గరసి గొబ్బున నేమంబున రం డటంచు నెల వొసరించెన్. 78

తే. అపుడు రాచూలి జింకవార్వపువజీరు,గారవపుఁబట్టి నొయ్యనఁ జేరఁ బిలిచి
వ్రేలియుంగర మొసఁగి కూరిమి దలిర్ప,నవ్వలంతిని జూచి యిట్లనుచుఁ బలికె. 79

క. కోఁతితొగవింద మాకుం, బ్రాఁతిగ దొరకినయనుంగుబంట వగుట నీ
లోఁ తెఱఁగి యుంగరం బా, గోతికి నిమ్మనుచుఁ గోరుకొంటిమి నిన్నున్. 80

క. ఓడక లంకకుఁ జని య, వ్వీ డెల్లను వెదకి యందు వెలఁదుకఁ గని యి
న్నాడెంపురవణ మిడి యా, చేడియతలమానికంబుఁ జేకొని రమ్మా. 81

చ. అనవుడు నాతఁ డుక్కు దనరారఁగ నిట్లను నేలతాల్పు యి
ప్పనిఁ దలఁబూని రక్కసునిబాలెము వాలెముఁ జొచ్చి చేడియం
గనుఁగొని యుంగరం బొసఁగి క్రన్నన నొదల మానికంబు నై
కొని పఱతెంతు వెండియును గోఁతిదొర ల్గని సంతసిల్లఁగన్. 82

చ. తెలివను జూప కున్నఁ దొలిదేవరప్రేవులు పోవులై పడన్
బెఱికెద నావల ల్దలఁగఁ బెట్టెద జుట్టులు పట్టి నేల పై
జిఱ జిఱఁ ద్రిప్పి కొట్టి మెయిఁ జిప్పిలి నెత్తురు లుబ్బి పాఱఁగా
జఱ జఱ నీడ్చి వైచెద నెసంగ దొసంగుల నెల్ల ముంచెదన్. 83

చ. తొవలయనుం బ్రొద్దు నొకతూకుల మ్రింగుదు వేల్పుమూఁకలం
దవిలి కలంతు నబ్జముని దామరచూలిని గ్రొవ్వడంతుఁ దేఁ
కువ మెఱయంగ రక్కసుసిగుండియ లెల్లను జింతు నేలయుం
దివియును ప్రక్కలింతుఁ గద దేవరయానతి యింత గల్గినన్. 84

క. రాకలువఱేఁడ గట్టిగ, మీకడకు జగంబు లెల్ల మే లని పొగడన్
రాకాసులదొరఁ దెచ్చెదఁ, గా కుండిన లంక వెఱికి కడిమిం దెత్తున్. 75

ఆ. అనిన సంకసిల్లి యద్దొర యొంతయు, గారవించి యనుప గట్లసూడు
కొడుకుకొడుకుఁ బుట్టకూడు మేపరిఱేఁడుఁ, దోడు గాఁగ నెలమితోడఁ జనియె. 86

క. మిగిలినచెట్టుం ద్రిమ్మరి, జగబంటులు నందునందుఁ జని రటువలె న
మ్మొగిలుపగవానికూనయు, నొగిఁ గొందఱఁ గూడి యరుగుచుండెను నెదలన్. 87

తే. అలర సంపాతి యనియెడుపులుఁగురాయఁ, డొకఁడు బలువేల్పురామెట్టునొద్ద వారిఁ
గాంచి యీరైదుమెదలరక్కసునిదీవి, కేరుపడఁ ద్రోవ యెఱిఁగించి యేఁగుటయును.

క. అక్కొక్కమ్మమెకపుజోదులు, విక్కులు నక్కొండ యెక్కి విరిదేనియలం
జొక్కటపుఁదియ్యపండుల, జక్కరతెలినీళ్ల నలువు సడలించి తగన్. 89

తే. మ్రుచ్చుఁదనమున రాకొమ్మఁ దెచ్చినట్టి
యుఁటియరక్కసుఁ డిదె డాఁగి యున్నవాఁడు
రం దనుచుఁ దమ్ము నెలమిఁ జేరంగఁ బిలుచు
కరణిఁ గదు మ్రోయునీర్వామిఁ గాంచి యెదుట. 90

ఆ. కాంచి యబ్బురంబు గదుర నీమున్నీరు, దాఁటి చనఁగ నేరితర మటంచుఁ
గొంకు మీఱ గాడ్పుకొమరుని గన్గొని, వలఁతితనము వెలయఁ బలికి రపుడు. 91

క. విను మనుమఁడ మానుదువులు, విను మనువు దలిర్ప నీవు వేల్పొందుకలం
పున నుండిన నీరతనపు, గవి యిం దిఁక నొరుఁడు దాఁటఁగలఁడే చెపుమా. 92

క. పిల్లారి జియ్యతేజునఁ, జెల్లంబుగ జింకమావుదేవరకతనన్
జెల్లదరారుఁగఁ బుట్టిన, బల్లిదుఁడవు నీకు గడ్డుపనులుం గలవే. 93

ఆ. పిన్ననాఁడె జగము లెన్న నబ్రమ్ము మీ, ఱెను కడంకతోడ రేఁగుఁబంటి-
పగిది నిరులగొంగఁ బట్టుక మ్రింగిన, ప్రోఁడ వింక నిన్నుఁ బొగడ నేల. 94

క. ముందటిబంట వటంచున్, డెందంబునఁ గూర్మి నివ్వటిల్లఁగ నపుడే
కుందనపుటుంగరము ఱేఁ, డిందఱిలో నిన్నె పిలిచి యిచ్చెనొ లేదో. 95

క. కావున నేలికకర్జము, గావింపఁగఁ బూని కొంకఁగాఁ దగ దింకన్
లా వడరఁ గడలి దాఁటుము, వేవేగం జెరవఁ జూచి వెండియు రమ్మా. 96

ఆ. అనుడు వారిఁ జూచి యతఁ డిట్టు లనియె నో, కొలముసాములార కొఱఁత లేదు
మేపులోరఁ గెలఁగి యిపుడ మీయానతి, దాఁటఁ బోక కడలి దాఁటువాఁడ. 97

ఆ. దాఁటి లంకఁ జొచ్చి బోటి యున్నతెఱంగు, గాంచి మగిడి వత్తుఁ గాక యన్నఁ
జెడుగుపోలసువిండియొడయని నిచటికిఁ, గడిమి మీఱ నంటఁగట్టి తెత్తు. 98

క. తెచ్చునెడల నడ్డంబై, వచ్చిన రాయంచవారువపుదొర సైనం
గ్రచ్చఱ నిడుమలఁ బెట్టెద, నిచ్చలు నిప్పుడమిలోన నించెద నసముల్. 99

ఆ. అనుచు జగము లెల్ల నదరఁ గడంగెడు, జమునికరణిఁ బొంగి చదలుచూలిఁ
దలఁచి రామునజ్జదామర నెదలోన, నిలుపుకొని దిటంబు నివ్వటిల్లఁగ. 100

ఆ. అడుగు లూనఁ ద్రొక్కి మెడయుఁ జేతులు సాచి, తోఁకయూఁది మేను వీఁకఁ బెంచి
చెవులు నిక్కఁజేసి చిఘ్ఘనఁ జొక్కుల, దారి కేఁగసి కడలి దాఁటె వేగ. 101

క. దాఁటుటయుఁ గొండగొపురులు, బీటలు వాఱెం గడిందిబీతున జేజే
దాఁటు వడంకం బాఱెను, గాటపుఁబయ్యెరల మొగిలు గదలకుఁ బాఱెన్. 102

ఆ. అపుడు మింట వేల్పు లాశసిదిట మెల్ల, నరయుకోఱకు సురస యనెడు వేల్పు
పడఁతిఁ బనుప నదియుఁ గడు నబ్బురపురూపు,దాల్చి యెదుట నడ్డుదాఁకుటయును.

క. నరజూమెయి పూని యీద, బ్బరపోలఁతుకలోనఁ దూఱి వరువడి వెలికిన్
బఱచి తటాలున దానిం, బఱియలు గావించి యెలమి పరఁగం జనియెన్, 104

క. చని యామ్రోల సువేలం, బనుగుబ్బలి యెక్కి నప్పు డాశనికర్షం
బునకుం దో దగుపందం,బున వేఁడివెలుంగు గ్రుంకఁ బోయి న్గదలిన్. 105

క. అని నారదుఁ డెఱిఁగించిన, విని యవ్వాల్మీకి మిగుల వేడుకతోడన్
దనరుచు నవ్వలికతయున్, వినుపింపు మటంచు నతని వేఁడుకొనుటయున్. 106

చ. పొడలవెడందదుప్పటియుఁ బుక్కులపేరులుఁ గాడ్పుదిండిబ
ల్తొడవులు మిన్కుటందియలుఁ దోరపుఁగ్రొన్నెలపువ్వు విన్నుఁగ్రొ
మ్ముడియును జింకపిల్లయును మున్మొనవాలును బూదిపూఁతయు
న్నెడనలు పెద్దవారువము మిక్కిలికన్నును గల్గుదేవరా. 107

క. మిత్తియుఁ బితరులతేఁడు, న్మత్తిలి తెపుగంగఁ జూచి నలిఁ బొగ రడఁగ
న్మొత్తినతెలిగిత్తరవాల్, తత్తడిజెఱకొత తల్లలఁ దొరతాతా. 108

మాలిని.—

జగములయొకిమీఁదాజాఱువావింటివాఁడా, తిగకొటికలగొంగాదిట్టజేజేబొజుంగా
పొగడిక గనువేల్పాపువుపజాబిల్లితాల్పా,సొగసులనెఱవంటాజోగిబార్నెముపంటా.

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురం
ధరఘనయశోబంధురకౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్ర బుధజన
విధేయ తిమ్మయనామధేయప్రణీతం బైన యచ్చతెలుఁగు రామాయణ మహాకావ్యం
బునందుఁ గిష్కింధాకాండము సర్వ మేకాశ్వాసము.

శ్రీరస్తు

# అచ్చ తెలుఁగు రామాయణము

## సుందరకాండము

---

క. సిరులఁ బరఁగించి బత్తుల, నిరవగు కనికరముతోడ నేలుచు నెపుడున్
దొర మీఱినదొర యనఁ దగి, విరివిగ జగ మేదుమెట్టువిలుబలుదిట్టా. 1

తే. ఆలకింపుము గూర్మిఁ గయ్యంపుఁదిండి, తపసికన్నాకు కతవిను తపసిఁ జూచి
యిట్టు లను గాడ్పుచూలి యిట్లివముసూడు, గుఱ్ఱకునంతకు నొదిగి, యక్కొండ నున్న.

క. అంకటఁ గదలం దల్లఁ గొ, అంత యొకింతయును లేక అంచిల్లె నిరుల్
వంతపురక్కసిమూఁకల, అంతు లుడిగె నెలమి గనిరి అంచువెలందుల్. 3

ఆ. అపుడు కోఁతిమిన్న యసదుమూపునఁ జని, ప్రోలిచాగ కానిమూలగవను
దూఱి యచటఁ గాంచె మాఱట మిత్తియో, యనఁగఁ బరఁగులంకిణిని జెలంగి. 4

ఆ. కాంచి దీని నిపుడు ద్రుంచినఁ బ్రోలివా, రెఱిఁగి చేర వచ్చిరేని కర్జ
మెల్లఁ దప్పు మరల నేఁగుచోఁ దునిమెద, నని తలంచి సరగ నపని కరిగె. 5

క. అరిగెడుచో నీతఁడు నెఱి, నరయుచెడ న్వెలుఁగు వలయు నని తేతే ల్వా
విరిఁ బట్టుదివ్వటీ యనఁ, దిరముగ రేఱేఁడు దూర్పుదెసఁ గన్పట్టెన్. 6

తే. అట్లు జాబిల్లి దనకు జోడై వెలుంగఁ, బొలుపు దళుకొత్త మెల్లనఁ బ్రోలు పొచ్చి
యొరులు దన్నెవ్వ రెఱుఁగక యుండునటులఁ, గలయ నెల్లెడఁ బరికింపఁగాఁ దొడఁగి.

సీ. ఇరవులు రోసి దేవరగుళ్లు నెమకి యుప్పరిగలు వెదకి చప్పరము లరసి
మోసల ల్లడవి లోఁముంగిళ్లు గనుఁగొని గొందులు పరికించి కొల్ల గాంచి
మందసంబులు దేవి మాడువు ల్పొదగని కొత్తడంబులు చూచి కోటగవను
లారసి బలితంపుఁదేరులు గాలించి కొలఁకులు తోఁటలు గలయఁ జెట్టి

తే. యాటపట్టులు చొరరానిచోటు లెల్లఁ, దేటతెల్లంబుగాఁ గని తెఱవ నెందుఁ
బొడగనఁగ లేక కడు డెందమునఁ గలఁక, నిగుడఁ బొలదిండియొకిమోసిగడు సేరె.

సీ. పసిఁడిగోడలు పుల్గుపచ్చతోరణములు గొప్పక్రొన్నెలతాలయుప్పరిగలు
మగటాలు దాపెనపగడంపుఁగంబము ల్తెఱఁగంటిరావకాలిన్నియులును

బిల్లికఱ్ఱరతనంపుఁబెద్దమందసములు ప్రొద్దుగల్నాడెంపుమిద్దియలును
జెలువంపుముత్తెంపుచలువచప్పరములు వలుదనెత్తమ్మికెంపులకలుపులు

తే. మఱియు వెలలేనిముత్తెగమానికముల,యాందలంబులు నుయ్యెల లరదములును
గవనికట్టులుఁ బెండియ ల్గద్దియలును, బాఱఁ జూచుచు సరగ లోపలికిఁ దూఱె. 9

తే. తూఱి యెన లేనిసొగసుల మీఱుచున్న, జాళువామేడ గన్గొని సంతసమున
డాయఁ జని యందు మేలికడానిచీని,పనుల నలరొందునొకపూలపాన్పునందు. 10

సీ. చెఱ గొన్నముగుదజేజేపాలంతు లలంతి నిదురలతో నజ్జ లాదిగి యొత్త
మొనసి యీరారైదుక్రొమ్ముదులఁ జాగపుచెల్ల పూవుటెత్తులు క్రొత్తతావు లీన
నొడలిమేల్రవణాపుటొరపుమానికములు మలయుఁదివ్వెలలతో మాఱ్వెలుంగఁ
దివిరి వేల్పులమీఁద రవరవ ల్నిగుడించు వడువున నూర్పులు గదలుకొనఁగఁ

తే. పుడమిపుట్టువు నెదలోన నిడి మరల్ప,రానివలవంతిసెకలఁ గరంగి బయల
మఱచి నిదురించురక్కసిమన్నెగాసిఁ, జూచి తనలోన నిట్లనుచుం దలంచె. 11

ఉ. అద్దిర వీనిక్రొవ్వియు నొయారము దిట్టతనంబు చేవయుం
దద్దయుఁ నబ్బురం బెదకుఁ దార్కొనఁ జేయఁ దొడంగె నిట్టిబ
ల్గద్దఱికాఁడు వాఁడిని జగంబులు గెల్చుట యేమివింత మే
ల్బుద్ధి యొకింత లేక చెడిపోవఁ దలం పిడెఁ గాక యిత్తఱిన్. 12

క. ఈటీవికి నీ నేర్మికి, మేటితనంబునకుఁ జాల మేలిగొనంబే
నాటుకొని యున్న నీతఁడు, సేటెన్నఁడు లేసిసిరులఁ జెన్నారుఁ గదా. 13

క. తెఱఁ గెఱుఁగక రామునితోఁ, గఱుతుగఁ బగ గూడఁబెట్టుకొని కొల మెల్లం
జెఱుచుకొనెఁ గాక యాతం, డుఱుఁడు గదా పూని వేల్పుటొడయని నైనన్. 14

క. అని యెదలో నెన్నుచు మెల్లన నాతని సెజ్జపజ్జలకుఁ జని యొకమా
టున నిలిచి కోఁతిదొర తన, కనుదోయికి నబ్బురంబు గదలుకొనఁగన్. 15

సీ. ఎడసినజిలుఁగుపయ్యెదతోడ ముడి వీడి నేల జీరాడుపెన్నెఱులతోడఁ
గరఁగి నెమ్మొగ మెల్లఁ బెరయుఁగస్తురితోడఁ దొలఁగినచెవియాకుదోయితోడ
నుడుగక నినుచనిట్టూర్పుగాడ్పులతోడ జాఱిననెఱిబన్నసరముతోడఁ
జెదరినపాపటచేర్చుక్కబొట్టుతోఁ బొడిపొడి యైనమేపూఁతతోడ

తే. మగనిపిమ్మట నెమ్మేను మఱచి నిదురఁ, జెందుమందోదరిని జూచి చెలువ కిపుడు
చెడుతెఱంగులుఁగడుఁగనఁబడఁ దొడంగె,నంచుఁ దలయూచి చయ్యన నచటు దరలి.

తే. పొలసుమేపరిచేనిలోఁ బుట్టువులును, గొడుకులును నెమ్మి నుండుటెంకులకుఁ బోయి
వెలఁది నచ్చోటులం దెల్ల వెదకి వాండ్ర, పెంపు గన్గొని యెదలోన బిట్టు సోలి.

క. మఱియుం బేరగురక్కసి,నెఱజోదులకాఁపురంపునెలవులయందుం
జెఱసాలలందుఁ జెలిఁ బ్రల్లఱు నారసి కనఁగ లేక మదిఁ దలఁ కెలయన్. 18

చ. కటకట రాచరేవెలుఁగుకర్జము పూని కడిందిచేవతో
నిట కరుదెంచి బోటి నిపు డెందును గానక శోఁతిఁజేని చెం
గటి కిఁక నూర కే మరలఁ గాఁ బఱతెంచిన నెల్లవారుఁ బి
మ్మట నగ రే మగంటిమియు మాటనిజంబును గోలుపోవదే. 19

తే. లెక్క కెక్కువ యగుకోఁతిలెంక లెల్ల, గనుఁగొనఁగ నేలచేఁదు న న్గదియఁ బిలిచి
పడఁతి కిమ్మని యుంగరం బిడుట కెటులఁ, బని యొనర్పక క్రమ్మఱఁ జనఁగఁబోలు.

ఆ. తలువరక్కసుండు దొంగిలి తెచ్చుచో, మడఁతి బీతు గుడిచి మడిసె నొక్కొ
కానఁ గాన రానికడ దాఁచె నొక్కొ యి, చ్చెనఁటి యింక నేమి సేయువాఁడ.

చ. వెలఁదిని జూపు మంచు తొలివేలుపురాయనియెమ్మ లొక్కటం
గులగులగా నడంతునొ రగుల్కొనఁ జేతునొ ముజ్జగంబులున్
మిలమిలలాడుచుం దవిలి మింట వెలుంగెడురిక్క లన్నియుం
జలజల రాలఁ దన్నుదునొ సంద్రము లుమ్మడి నింకఁ జేతునో. 22

క. కొండలు పిండియొనర్తునొ, గం డెసఁగఁగ నలువగ్రుడ్డు గాలింతునొ వే
చెండుదునొ గుదియతాలుపు, కండలు గుండియలు వేల్పుగమి నొంపుదునో. 23

క. అని యిత్తెఱఁగున డెందం,బునఁ దలఁపుచుఁ గొమ్మమెకపుఁబోటరి యత్తా
వునఁ దరలి మెల్లమెల్లనఁ, జని యొకచో మిగుల సంతసము దైవారన్. 24

సీ. మారేళ్లు నేరేళ్లు మావులు రావులు పనసలు గొజ్జంగు లనఁటు లిప్ప
లీడెలు సంపంగు లిరువ్రదు ల్పొగడలు దబ్బలు ప్రబ్బలు త్రాళ్ళు మేళ్ళ
గోఁగులు రేఁగులు క్రోవులు మోవులు మద్దులు నిమ్మలు లొద్దుగులును
గలుగొట్లు పొన్నలు కదుములు వెలగలు గోరంట లుసిరిక ల్నారికెడము

తే. లందుగులు గేదఁగులు మఱ్ఱి లింగుదులును, మోదుగులు దాసనంబులు మొదలుగలుగు
ప్రాఁకులకునిక్కయగుచు వేమఱుఁ జెలంగు, చున్న నాడెంపుఁబూఁదోఁటయొకటిఁ గనియె

క. కని తప్పటడుగు లిడుచుం, జని మెల్లనె యందుఁ దూఱి జతనంబుగ నిం
తిని వెదకుచు మ్రోలం జక్కనిబంగరుమేడ యొకటి గనుఁగొని సరగన్. 26

క. అమ్మేడచివర కెంతయు, నెమ్మదిలో నెక్కి కదలు నెమకుచుఁ జెట్టుం
ద్రిమ్మరి తెలిడాలుమెకం, బిమ్ముగ నొక మ్రానిక్రింద నెనసినకడఁకని. 27

సీ. కట్టిననెఱమాపుగడితంపుఁబుట్టంబు నెన్నుమీఱెడు సారచీర గాఁగఁ
గలయంగ నంటలు గట్టి మూఁపున ప్రేలు నిడుదపెన్నెఱులు కెంజడలు గాఁగఁ
బుడమిపై నిచ్చలుఁ బొరలుచో నొదవిన బూడిదమైపూఁత బూది గాఁగ
నిదురయుఁ గుడుపును వదలి యుండుట యెల్లఁ దరలక యొనరించుతపసు గాఁగ

తే. వానలకు నెండలకుఁ గరువలికి వలికి, నైఁచి డెందంబు తనపాలిసామియందు
నిలుపుకొని కేవుకోఁగిజాదిలితెఱఁగునఁ, బొనరునొకరాచకలికాకఁ బోఁడిఁ జూచె. 28

తే. వెల్లు గిఱికొన్న బావురుపిల్లిగములఁ, జేతఁ జిక్కినయాటరాచిలుకవోలెఁ
బెదుగుపాలదిండిపడఁతులనడుమ నున్న, యన్నెలంతుక నటఁ జూచి మిన్నుముట్టి. 29

ఆ. పడఁతిచంద మెల్లఁ బరికింపఁ బంటపై, దలియనుంగుపట్టివలెనె తోఁచు
చున్న దనుచు మేడ గ్రన్నన డిగి యాపె, గూరుచున్నమానికొనకుఁ బ్రాఁకె. 30

తే. ప్రాఁకి యమ్మేటియిరుగుడుమ్రాఁకుచివురు, జొంపములలోన నిఱికి యజ్జోటి సారె
సారెకును రామ రామ యన్పేరు నుడువ, నొవర నాలించి సీత యంచును దలంచి.

క. ఈపున్నియంపుఁజెలి కే, రూపునఁ దననిక్కువంపురూ పేరుపడం
జూపుదుఁ బైదలితో నిఁక, నీపట్టున మాట లాడ నె ట్లొనగూడున్. 32

తే. అని తలంచుచు నున్నచో నంతలోనె, మన్నుకానుపుసొగ సెల్ల మదిని నిలిపి
రక్కసులఱేఁడు మిగుల విరాళిఁ దేలి, తాల్మి యెల్లను బ్రీలి తత్తరముతోడ. 33

సీ. చలువగొజ్జఁగినీట జలకంబు లాడి జిల్గుమఱుంగుఁగొనఖుపుట్టములు గట్టి
వినుమ్రానిపరువంపువిరిదండ లెద నించి కలయ నెమ్మెయిఁ గమ్మకలప మలఁది
వెలిమించురతనంపుగిలుకుపావలు మెట్టి కేల జాబిలినవ్వువాలు వట్టి
మొసలివాప్రోఁగు లింపెసఁగ వీనులఁ బెట్టి తలల హొంబొమిడిక లొనర నిల్పి

తే. గొలుసు లుంగరములు మురుంగులును బతక, ములును దాళీలు నేవళంబులును గంట
పెంపెరంబులు మొదలగు పెద్దతొడవు, లెల్ల బలితంపుసింగార మెలయఁ బూని. 34

సీ. అచ్చరవిరిఁబోఁడు లాలవట్టము లూన వినుటెంకిచెలులు వీవనలు వైవఁ
బాఁపచానలు దమ్మపడగలు సేనఁ బక్కికొమ్మలు బరాబరు లొనర్పఁ
దళుకంటిగాణలతెఱవ లెల్లను బాడఁ దొలివేల్పుఁబోండ్లు కైదువలు దాల్ప
జక్కులపొలఁతు లిచ్చల దివ్వటీ ల్వట్టఁ దత్తడిమోరపైదలులు వొగడ

తే. మఱియుఁ దక్కినవేలుపుమచ్చెకంటు, లూడిగపుఁజెయ్వు లొనరింప నీడు లేని
ఠీవిఁ బొదలుచుఁ జెలువంపుఁబూవుఁదోఁట, కేపు దళుకొత్త గొబ్బున నేగుదెంచె. 35

ఆ. ఏఁగుదెంచి సొగసు లేర్పడ నమ్మున్న, చాలిమ్రోల నిలిచి సొరిదిఁ బలికె
వాలుఁగంటి వట్టికేల వై నీ విల్లు, వెతలఁ గుందఁ దగునె కేరపుమాలి. 36

క. ఇమ్మేటిసోయగంబున, కిమ్మేలిమి గారవమున కిప్పగిది వయో
నెమ్మదిఁ బెరయక ముద్దుల, గుమ్మా బలితంపుదెసలఁ గుందుట మేలే. 37

క. క్రొన్ననఁబోఁడిరో దిట మగు, జన్నియ కైకొని మెఱుంగుజవ్వన మెల్లన్
మిన్నక కోనం గాచిన, వెన్నలగాఁ జేయఁ దగునె వేఱేఁడి వగుచున్. 38

క. ఆలములు దుంపలు నమలుచుఁ, బోలములఁ బడి తిరుగురాచపురువులపై ని
చ్చలముగఁ దలఁ పిడి యకటా, చలమున నిటు లుంట పొందికాదయె నీకున్. 39

క. తెఱవా నాదెపుటచ్చర, తెఱవలకున్ లేనిమే ల్గదియ వచ్చు నెడం
జెఱుచుకొనఁ గూడ దిపు డీ, కఱటితనం బుడిగి నెమ్మిఁ గైకొను నన్నున్. 40

సీ. మలగొంగ యలరుటెత్తులు గట్టి యిడుచుండు దంటమోములసామి వంట సేయు
గవనివాకిలి నిచ్చఁ గాచుచుండు జముండు వాలు మోచుక యుండు మూలఱేఁడు
త్రాఁడుదాలుపు మేలిరతనము ల్గొని తెచ్చి గందవా ల్లొసఁగు నాకసముకుఱ్ఱ
బ చ్చయి వెచ్చంబు లిచ్చు రొక్కపుదొర దళవాయి యై కొల్చు చిలువతాల్పు
తే. తమ్మిపూఁజూలి మ్రోలఁ బొత్తమ్ము విప్పి, చదువుచుండుఁ గరంబు హెచ్చరికతోడ
నిట్టినాదొడ్డతన మెద నెన్నికొనక, గోల యూరక చెడిపోవ నేల చెపుమ. 41

సీ. అడవుల నిడుమలు గుడుచుచుఁ దిరుగురాఘవుఁ డింక నిచటి కేకరణి వచ్చు
వచ్చి యచ్చెరువుగా విచ్చలవిడిఁ బొంగి పాఱెడుకడలి నేపగిది దాఁటు
దాఁటి గాటపునల్లద్రావుడుపోఁజుల గొఱలునిద్దీవి యే నెఱిని జొచ్చుఁ
జొచ్చి యొచ్చెము లేక హెచ్చున నదరునాతోడఁ గడంగి యేజాడ నెదురు
తే. నెదిరి కుఱవక దురమున నెట్లు నిలుచు, నిలిచి యేచందమున నన్ను నెమ్మి గెలుచు
గెలువఁగాఁ బోల దిఁకఁ జెఱతలఁపు లుడిగి, తీవఁబోఁడిరో కోరిక ల్దీర్పు మిపుడు.

తే. కోఁతులను గొండముచ్చులఁ గూడఁబెట్టు
కొని పుడమిఱేఁడు మాతోడ మొనయఁ గలఁడె
వట్టియడియాస లన్నియుఁ గట్టిపెట్టి
పైదలిరో యింక మేల్పట్టుఁ బట్టుకొనుము. 43

తే. కొదమబెబ్బులి నేడిక లెదురఁగలవె, దొడ్డసింగంబు నేనుగు ల్దొడరఁగలవె
పిల్లితో నింటియెలుకలు పెనఁగఁగలవె, కలన నామ్రోల మానుసు ల్నిలువఁగలరె.

క. ప్రన్ననిశాణఁడు లేఁ డిఁక, వెన్నవలెం గరఁగి మదికి వేడుక కొదవన్
సన్నకసన్నం గవయక, మున్నటికలఁ బోవఁ దగునె ముగుదల కెందున్. 45

ఆ. అనిన మోము వంచి యవ్వెలందుక యొక, పూరిపుడక కేలఁ బూని వానిఁ
గూర్చి పలికె నోరిమూళరక్కసుఁడ యి, క్కఱఁతకఱవ లేటికొఱకు వినుర. 46

క. ఉ క్కడఁచి నేలఱేఁడులఁ, దక్కఁగఁ గను స్వామి న న్నిటకుఁ దెచ్చినబ
ల్తెక్కలికాఁడవు నీ కీ, చిక్కనిమగతనము తెల్ప సిబ్బితి గాదే. 47

క. ఎల్లజగంబులలోపల, బల్లిదుఁ డగురాఘవుండు పతికింపంగాఁ
జెల్లంబో నీ కెంతయు, నెల్లిదమై తోఁచె నింక నేమి యనఁ జనున్. 48

క. అలనేలఱేనిజెడిదపు,టలుఁగలు నీలంక ముంచి యరుదుగ నీచే
తులు దలలు దునుముచో న్నిమ్ముల నాతనిలావు నీవు పొడఁగనెదు గదా. 49

క. కుఱుకుఱుకేలుపుతెఱవలఁ, జెఱ పట్టినయటులె తెలివి చెడి రామునితో
మఱక పగ దెచ్చుకొంటివి, కొఱవిం దల గోఁకుకొనఁగఁ గోరెదుకరణిన్. 50

తే. పొట్టక్రొవ్వున నిప్పుడప్పుడమిఱేని, కడిమి యెఱిఁగియుఁ దెలుఁగవు గాక నీవు
పాలివాం డ్రోపమగాల్లు పేటూళ, పొలసుమేపరు లెవనిచేఁ బొలిసి చనరె. 51

క. గరితలఁ బలుమఱుఁ గలఁచుచు, గరువము మెఱయంగ నీమగంటిమి నీవే
కర మరుదుగఁ గొనియాడెదు, సిరియుం బ్రతు కెల్ల సరగఁ జెడుఁ గద చెనఁటీ. 52

తే. మిడుత గడితంపుటెరగలిమీఁద నుఱికి, పొలయుఁ దెఱఁగున నాఁకేని చిలుకుటగ్గి
కగ్గమై నీవు దిగ్గన మ్రగ్గి దుఱకఁ, దులువతనమున నిపు డింత త్రుళ్ళ నేల. 53

క. సిరిమగఁడు జడలసికదే, వరయుర్వీ రాయంచవారువపుజోదును జె
చ్చెర నడ్డగింపఁ బూనిన, దురమున రాగవుఁడు నిన్నుఁ దునిమెడుఁ జుమ్మీ. 54

తే. అనుచు నింతయుఁ సరకుసేయక నెలంత, దూలఁ బలికిన రక్కసదొర కడింది
కినుక నిగుడంగ నొడుపు దప్పినపిసాళి, నాగుఁబామును బోలుచు నవుడు గఱచి. 55

క. అద్దిర యాఁడుదిగా యని, తద్దయుఁ గనికరము సేయఁ దలఁచిన నెంతో
గ్రద్దఱి వై ప్రేలెదు ని, మ్ముద్దియ యిఁకఁ దేర్ప కున్న మోసము గాదే. 56

సీ. నిమురవెన్నగయాళితొడవులదొరయుండు గుండు గం డెసఁగఁగఁ బెండుసేసి
తెలిగూడు కాఁచుపుత్తేతీవజీరుచే పిప్పగాఁ గొద లేనిమెప్పు లంది
మగమానికపువాలుజగబాటునగరునఁ గొఱ లేసిసిరి యెల్లఁ గొల్ల పెట్టి
రూడి నెన్నిక గన్ననాడెంపుతెఱగంటిచిగురాకుఁబోఁడులఁ జెఱలు దచ్చి

తే. యెపుడు నిరుసతజగముల నెదురు లేక, మిక్కుటంబైన తేజున మెఱయునన్నుఁ
బలుకఁ బలుకుచు నున్న దిక్కులికి యిపుడు, చెండుబెండాడి రూపఱఁ జేతు ననుచు.

క. తివిరి కరవాలు సేకొని, అవఱవ లెసఁగంగ నత్తెఱవపైఁ జనుచోఁ
దివజడలరేయిుద్రిమ్మరి, పువుఁబోఁడి యొకర్తు నెయ్యమున నడ్డంబై. 58

క. దేవర నీ విపు డలుగఁగ, నీవెలఁదుక జేసికంటియెకిమీఁడో జముం
డో వేల్పుఱేఁడో నెత్తురు,ద్రావుడుగమికాఁడో నీళ్లరాయఁడో చెపుమా. 59

తే. బమ్మకొలమునఁ బుట్టినబల్లిదుఁడవు, చదువు లన్నియు నెఱిఁగినజాణ వెల్ల
కదలు గెలిచిననెఱిమొనగాఁడ విట్లు, తెఱవపై నీవు కైదువు వెఱుకఁ జనునె. 60

క. తాఁల్మి పూనుము కొఱకొఱ, చాలింపుము కొఱఁతగొనము సడలింపుము వే
వే లింటం జేజేనవ,లా లుండఁగ నీకు నివ్వెలందుక గొఱయే. 61

తరల. అనుచు నచ్చెలి యోర్పు పుట్టఁగ నాడుచోఁ దను జాల న
చ్చెనఁటిరక్కసిఱేఁడు వల్కినచిన్నమాటల కెద్దలోఁ
గనలి పంటవలంతిగాదిలికాన్పు పెద్దయెలుంగులో
మొనసి యామని గండుఁగోయిల మ్రోఁగుచాడ్పున నేడిచెన్. 62

తే. ఏడ్పుటలుచూచి తెరగంటియిగురుఁబోండ్లు, చిలువబోటులు జక్కులచెలులుఁబులుఁగు
చేడియలు నేడ్చి రప్పు డచ్చెట్టుమీఁద, నుండి రిక్కల త్రోవమన్నం దుగినిసి 63

ఆ. తొడరి వీని నిపుడె తునుముదునో కాక, మన్నకాన్పుఁ జూచి మాటలాడి
మరలి పోవునొపుడు మడియింతునో యనుచుఁ, దత్తరమున బుద్ధి దలఁచుచుండె. 64

క. మసలక నా కిప్పొలఁతిం, బొసఁగింపుఁడు కాక యున్నఁ బొరిగొనుఁ దని ర
క్కసిచెలుల నునిచి రావణుఁడు సనియెఁ దననగరునకుఁ గడుఁక సిబ్బితిలోన్. 65

తే. అంత నారేయి ద్రిమ్మరియలరుఁబోఁడు, లలసి యాదంచ నిదురించునపుడు త్రిజట
చెడుగుకలఁ గాంచి రావణుచేటు వారి, కెల్ల నెఱిఁగించి మక్కువ యొదఁ దలిర్ప.

తే. పొలఁతిగములార యింక నిప్పుడమికొన్న, నేఁపవల దంచుఁ గనుమాయ నెద యెఱింగి
చెట్టులోనుండి కరువలిపట్టి మిగుల, నెలమి నారాచవాల్గంటి కిట్టు లనియె. 67

తే. పడఁతి నీపెనికూరిమిబంట నతఁడుఁ,దమ్ముఁడును దాను మాల్యవంతమ్మునందుఁ
దమ్ము వలగొని కోఁతిమొత్తమ్ము లెల్ల, నోలిఁ గొలువంగ నెమ్మది నున్నవాఁడు. 68

క. ఓచాన యానవాలుగ, నాచే నీయుంగరంబు నలువుగ నీ కా
రాచూలి పుచె నిదిగోఁ, జూచుకొను మటంచు నెలమిఁ జూపించుటయున్. 69

తే. డెంద మిగురొత్త నమ్మేలికుందనంపు,టుంగరము దనమగనిచేయుంగరంబు
గా నెఱింగియు నమ్మక వానిఁ జూచి, యన్నతలమానికం బిట్టు లనుచుఁ బలికె. 70

తే. అన్న యేప్రొద్దుఁ దక్కరు లగుకడింది, పొలసుదిండులచేతిచెట్టలఁ గలంగు
చున్నకతమున నెకిమీనియుంగరంబు, గన్గొనియు లోన నమ్మిక గలుగ దిపుడు. 71

తే. ఎవ్వఁడవు నీవు నీకుఁ బే రెద్ది యెట్లు, పుడమిఱేనికి నీకును బొందు బెరసె
నద్దొరలరూపు లెట్టి విం దనుచునపుడు, సామి ననుఁ గూర్చి నీతోడ నేమి పలికె.

క. ఏకరణిఁ గడలి దాఁటితి, వీకడ కేపగిదిఁ ద్రోవ యెఱిఁగితి వెట్లీ
రాకాసుల మొఱఁగితి వికఁ, నీకల తెఱఁ గెల్ల మాకు నిక్కము చెపుమా. 73

క. అనవుడు నతఁ డప్పొలఁతిం, గనుఁగొని యిట్లనుచుఁ దెల్పఁ గడగెం దల్లీ
వినుమేఁ జలినట్టుకతం,బున నంజన యనెడుచెలికిఁ బుట్టినవాఁడన్. 74

క. హనుమంతుఁ డనెడు పేరం, దనరాఱెడువాఁడఁ ద్రోవలదాయ్తుయనుగుబి
డ్డసికిం గడు నెయ్యుఁడ నీ, పెనిమిటికిం గూర్చునట్టిబిడుదుమగండన్. 75

సీ. అమ్మ నిన్నీరేయి ద్రిమ్మరియొకిమీఁడు గొనివచ్చునెడ నిర్జగాంగకొమరుఁ
డిమ్ముగా ఋశ్యమూక మ్మనుగట్టుపై మముఁ గూడి మెలఁగుచో నమర నీవు
రవణము ల్దివిచి చీరచెఱఁగులోఁ గట్టి వైచిన నవి దాఁచి వగపు మీఱ
రాముఁడుఁ దమ్ముఁడు రమణ ని న్వెదకుచు నచటి కేతెంచిన నతఁడు వారి
తే. తోడ నెయ్యం బొనర్చి యత్తొడవు లిడిన,మిగ్గుల నలరొంది దొర వానిఘరుఁ డైన
వాలిఁ దగటార్చి వాఁ డేలు నేల కెల్ల, నొడయనిఁగఁ జేసి నెమ్మది యొదవ నునిచె. 76

క. ఆకోఁతులదొర దనుఁ బలు, మూఁకలతోఁ గొలువ నుండి ముద్దియరో యీ
రాకొమరుఁడు ని న్వెదకుట, కై కొందఱ బంట్ల నేర్చి యనిపెదు నెదలన్. 77

క. రంగుగ నాచేతికి ని, య్యుంగర మిడి సెలవు వెట్ట నుప్పొంగుచు ను
ప్పొంగడలి దాఁటి వచ్చి ని,నుం గాంచితి నిచట వేడ్క నూల్కొనఁ బడఁతీ. 78

క. బల్లిదపుఁగోఁతిమూఁకలు, పెల్లుగఁ దనుఁ గొల్వ నీదు పెనిమిటి యిదిగో
వెల్లిట నేఁటనొ యిఁటికిఁ, దల్లీ యరుదెంచు నింకఁ దలఁకకుఁ మదిలో. 79

తే. ఎఱచియొరదిండిమన్నియ యిపుడు వచ్చి నిన్నుఁ గఱకులు పలుకుచు నున్నయెడలఁ
జాన యిచ్చెట్టుపై నుండి వాని దునుమఁ, దలఁచి మరలితి నీకుఁ గీడెలయు ననుచు.

ఉ. కల్లరిరక్కసుండు నినుఁ గైకొని వచ్చినఁగోలె బల్లిదం
బెల్లను దూలి పూఁట యొకయేఁడుగఁ ద్రోయుచు నబ్బురంపుబల్
తల్లడ మూని తిండియును దప్పియు నిద్దురయుం దొఱంగి యీ
దుల్లము వద్ద నీపయినె యుంచి కలంగుఁ జుమీ పొలంతుకా. 81

తే. తడవు లేదిదె దండుతోఁ దరలి వచ్చి, కడలి వడి దాఁటి రక్కసు నడఁచి నిన్ను
మరలఁ గైకొందు నుమ్మలింపకుమటంచుఁ, బలుపుమనిపల్కెనతఁడు గ్రొందలిరుఁబోఁడి.

సీ. మొలకనవ్వులవాఁడు తలుకారుతొలుకారు బలుకార్మొగులఁ గేరుపొలుపువాఁడు
నిడుదచేతులవాఁడు నిద్దంపుటద్దంపుసుద్దంపు నెఱిచెక్కుజోటివాఁడు
వెడఁదకన్నులవాఁడు విప్పారియొప్పారు గొప్పనెన్నుదురుచే నొప్పువాఁడు
పఱపుపేరెదవాఁడు పదపంపుగరువంపు చెలవోని నెమ్మోముకలుగువాఁడు

తే. కేల సింగాణివిల్లొగిఁ గ్రాలువాఁడు, కుఱుచమెడవాఁడు సోగపెన్నెఱులవాఁడు
వలఁతి యగువాఁడు ముజ్జగంబులును వలచు, సోయగమువాఁడు సుమ్మె నీరాయఁడింతి.

తే. అరయ నిన్ని తెఱంగుల నలరువాఁడు, సూవె నీముద్దులమఱంది తీవఁబోఁడి
యనిన నెద నమ్మి సంతసం బెనయ నతని, గారవించుచుఁ బడఁతి యుంగరము గొనియె.

క. కొని కన్నుల నద్దుచు నక్కునఁ జేర్చుచుఁ దలచు మోపుకొనుచు న్మదిలోఁ
బెనిమిటిఁ జూచినకంటెం, దనరారి యొకింతవడి కతని కిట్లనియెన్. 85

తే. అన్న గాదిలిచుట్టమ వగుచు నేని, నెమ్మి యెఱిఁగించి యుసురులు నిలిపినట్టి [illegible]
ని న్నొకింతయు నగ్గింపనేర నింకఁ, ఋదమి నెను రెండులను లేక తడవు మనుము.

క. గుబ్బలిద్రిమ్మరిసింగమ, దబ్బరరక్కసుఁడు నన్నొదవ పల్కుటయున్
దబ్బున వింటివి గద యిది, గొబ్బున నీ వరిగి దొరకు గుఱుతుగఁ జెపుమా. 87

తే. వల దనంగను వెంటఁ గానలకు వచ్చి, యింత వుట్టించె నని కిన్క యిడకు మనుము
తనవెలందుక నొరుల కప్పనము సేసి, యూరకుండిన మగఁటిమి యొదవ దనుము.

తే. అరుదు మీఱినబల్లిదుం, డనుచుఁ దనకుఁ, దవిలి మాతండ్రి యిడుట లోఁదలఁపు మనుము
కోరి పెండిలి యాడినకొలముచెలిని, విడువఁ జన దని తగ విన్నవింపవయ్య. 89

చ. కదు ననుఁ గన్నతల్లి కెనగా నలరామునిఁ దండ్రిమాఱుగా
నుడుగనిబత్తితోఁ గొలుచుచుండెదుతన్ను వెదంగుఁ బూని కా
అడవులలోఁపలం గఱకు లాడినదోసపుఁబాట యంతయున్
గుడిచిలి నంచు వామఱఁదికట్టకు నిక్క మెఱుంగఁ బల్కుమా. 90

క. ఆమాట మదిని బెట్టక, నామీఁదం గనికరంబు నాటుకొలుపుచున్
వే మొనలు దెచ్చి రక్కసి, గామిడి నడపు మని యతనికడఁ గడుఁ జెపుమా. 91

తే. అనిన నతఁ డట్లు చేసెద నమ్మ యింక, రిక్తచేతుల దొరకద కెత్తెఱఁగున
మరలి చనఁ జను నీతలమానికమ్ము, నెమ్మి యలరార నానవా లిమ్ము నాకు. 92

ఆ. అనిన నన్నెలంత యన్న నీనిక్కపు, రూపుఁ జూచి కాని రూఢి నిక్క
డింపిమానికంబు డెందంబులో నిన్ను, నచ్చి గారవమున నిచ్చి పనుప. 93

తే. అనిన నతఁ డట్టె యొనరింప నలరి యలరుఁబోఁడి తలమానికంబు గొబ్బున నొసంగి
వీడుకొల్పిన మ్రొక్కి యవ్వాయుచూలి, కొమరుఁ డచ్చోటు వెలువడి కొమరు మెఱయ.

సీ. బావులు గలంచి చప్పరములు వడిఁ ద్రోచి పేరైన మ్రాఁకులు పెల్లగించి
పూవుగుత్తులు ద్రెంచి పులుఁగుల బెదరించి పండ్లు రాలిచి పొదరిండ్లు సదిపి
తేనెతెరల్ రేఁచి తీవియల్ నుగ్గాడి మేడలు గోడలుఁ బాడు చేసి
యాటతిప్పలు వ్రచ్చి పాటబందులు గూల్చి కట్టువ లన్నియు గాసి చేసి

తే. తోఁటకావలిరక్కసిదాఁటు నొక్క, మాట యెనిమిదివేలను మడియఁ జేసి
యదరుచున్నఁ గనుంగొని పుడమికాప్పు, చెంతఁ గాపున్నపాలదిండిచెలులు పఱచి.

తే. రక్కసులఁజేసిఁ బొదగని మ్రొక్కు లొసఁగి, వెఱఁగు గన్పట్ట నిట్లని విన్నవించి
రేమి చెప్పుదు మెకిమీఁద యిప్పు డొక్క, కోఁతి యెందుండియో రాచగోలిఁ జేరి.

తే. మంతనంబున నేమేమొ మాటలాడి, కడిమిఁ బూదోఁట లెల్లను గాసి సేసి
యచటఁ గావలి యున్నగయాళిప్రాఁత, వేల్పుమూఁకల నెనిమిదివేలఁ దునిమె. 97

క. తునిమి యెవ లేనికడిమిం, దనరారుచున్నవాఁ డతనిఁ దేటి కనుం
గొన నలవి గాదు వేల్పులకును రక్కసివంగడంపుఁగ్రొన్నెల యనుడున్. 98

తే. మండిపడి యాతఁ డాకోఁతి గం డడంచి, వేగ రం డని యెనిమిదివేలపాలసు
దిండిబంటులఁ బనిచినఁ ద్రిప్పి వార, లీఁదకొమరునిపయి నని కేఁగుటయును. 99

క. ఆరక్కసిమూఁకలఁ గని, పేరిమి మొయి పెంచి గాడ్పుబిడ్డఁ డనికిఁ బొం
గారు నెడఁ బచ్చమావుల, తేరిపజీనుండు దూర్పుదెసఁ గన్పట్టెన్. 100

సీ. అప్పు డాజగజెట్టి యారేయిద్రిమ్మరి దండుపై నెవ్వడిఁ దాకి యార్చి
తోఁకతోఁ జుట్టి పదువుర నూఱువురను బట్టి తోరణపుఁగంబమునఁ గొట్టి
మూఁపులు వీఁపులు మోరలు బోరలు కాళ్లు చేతులు పత్తుకలును దలలు
పిక్కలు డొక్కలు జక్కుగాఁ జెండాడి యందఱ జముప్రోలి కనిచి వైచి

తే. మొసలితోరణ మెక్కి యామునఁ జెలంగు, చున్నఁ బోలియక చిక్కినయుంటియబంట్లు
పఱచి తొలివేల్పుఁజేని కత్తెఱఁగు దెలుపనదరిపడి వాఁడు కొఱకొఱ యొదవికొనఁగ.

తే. మున్నరక నొప్పుశార్దూలముఖుని నశ్మ,వక్షు మఱి పింగళాక్షుని వక్రనాసు
దీర్ఘజిహ్వునిఁ బిలిచి యాదిట్టకోఁతిఁ, దునియలుగఁ జేసి సరగ రం డనుచుఁ బనిచె.

క. కనిచిన నమ్మేటిమగ, ల్లని బిట్టుగఁ బొదవి యంపజడివాన యొన
ర్చిన నతఁ డయ్యాంపఱ యె, ల్లను దోఁకం బాయఁ ద్రోచి లా వెలయంగన్. 103

సీ. పోనీక తఱిమి క్రాబోరరక్కసులొమ్ము బెడిదంపుఁబిడికిటఁ బొడిచి చంపి
వాత ముక్కున నల్ల పఱవ లుబ్బుఁగఁ దాఁచి వెస వంకముక్కులొల్వెల్వఁ జెండి
మొగిఁ దోరనపుఁగంబమునఁ గొట్టి బెబ్బులి మోము రేద్రిమ్మరిమొఱి యదంచి
తోఁకతోఁ జుట్టి వే పీక మింటికి వైచి నిడుసాల్కపొలదిండిఁ బుడమిఁ గెడపి
తే. ప్రేలిమిడిఁ బచ్చకన్నులవేల్పుసూదుఁ, జిదిమివైచిన మ్రగ్గక చిక్కి యున్న
బిరుదు లోకకొండ చేతెంచి వరుసమెడల, నల్లద్రావుడుదొరకు విన్నప మొనర్చె.

ఆ. కనలి ప్రగడకొమరులను శతజిహ్వుని, స్తనితహస్తు శూలదంష్ట్ర రక్త
రోము వ్యాఘ్రకబళు రుధిరాక్షు నతని పై,నని యొనర్పఁ దఱుచుఁ బనుచుటయును.

క. మా తెంపు లేనికడిమి, స్సీఱుచు నరదంబు లెక్కి సెఱ మొనగాం డ్ర
య్యాఱుగురుఁ బొదలి తాఁకినఁ, బాటి చనక కొమ్మమెకపుఁబంటు కడంకన్. 106

తే. తోఁక యల్లార్చి కేవునఁ గూఁకఁ బెట్టి, తోరనము డిగ్గి పోరికిఁ దొడరుసెదలఁ
గఱకుటమ్ములవాండ్రు మేఁ గాఁడ జేసి,బిట్టు నొప్పింపఁ గినిసి యాజెట్టిబిరుదు.

సీ. అరదంబు లన్నియు నఱవఱల్గా మోఁది మావుపిండుల నదమదము చేసి
ప్రేగ్గలమెకముల్ఁ జెండుచెం డొనరించి కాలిపోఁజుల నేలఁ జమిరి
గొడుగులు పడగలుఁ బొడిపొడి గావించి దొనలును దూపులుఁ దునిమివైచి
కైదువుల్ విండ్లును గత్తళంబులు పేల్చి బూరలుఁ దుదుములు బుగ్గిఁ గలిపి
తే. చివ్వప ట్టెల్ల నల్లయుఁ గ్రొవ్వ మెదడుః,బొలసుఁ బ్రేవులు సెమ్ముకలుఁ బుఱియగములు
నిండుకొల్చిన అవఱవల్ నిగుడ నగ్గ, రాసురాకాసు లతనిఁ జేరంగ డాసి. 108

తే. కొండపైఁ బెల్లుజడివాన గురియుకరణి, బెట్టిదపుఁదూపు లేసిన బెగడ కతఁడు
పేర్మి నొక్కొక్కరినిః బట్టి పిడుగులట్లు, నడరుపిడికిటిపోటులఁ బుడమిఁ గూల్చె.

తే. అత్తెఱఁ గెల్లఁ గని పరు వెత్తి కొంద, టెఱచిదిండులు రావణుసెదుటఁ జేరి
యనిరి దేవర విను కోఁతి యబ్బురముగ, రక్కసులబూచియై యిందు వ్రాలినదిగ.

క. అటిమటి సెటి మొనగాం డ్రే, డ్తెఱ దురమున కరిగి కడుఁ గడిందిగ నిపు డం
దఱు నొక్కయుమ్మడిం బో, ల్పటి రబ్బలుకోఁతిబారి కగ్గం బగుచున్. 11

తే. అనిన విని నెయ్యి సోఁకినయగ్గి వోలె, మండిపడి వాఁ డపుడు జంబుమాలి ననుప
నక్కడిఁదిజోదు వడిఁ జని యంక్క మెఱయ, గట్టు ద్రిమ్మరితలకట్టుఁ జుట్టుముట్టి.

క. కఱకు మొనవాఁడిములుకుల, వఱపిన నగ్గాలియనుఁగుఁబాపఁడు మదిలో
వెఱచఱపక యొకపెనుమ్రా, న్వెఱికి వెస న్వానితేరు నేలం గూల్చెన్. 113

ఆ. కూల్చి యామునేఁగులగుఱ్ఱములమూఁక, నెల్లఁ బొలియఁ జేసి యెసఁగుచున్న
నలిగి వాఁడుఁ గేల నడిదంబు గొని గావ్చు, పట్టిఁ బట్టి నొసలు బిట్టు నటికె. 114

చ. నఱికిన పోలి యయ్యెడవినట్టుజగామొనగాండ్రమిన్న యు
క్కఱక యొకింతసేపునకుఁ గ్రమ్మఱఁ దెప్పిరి యప్పిశాళిపై
నుఱికి చలంబు మీఱఁ దల యూడఁగ మొత్తెను వానికత్తియే
మెఱుఁగు దలిర్పఁ బుచ్చుకొని వేల్పులు నింగి చెలంగి యార్వఁగన్. 115

ఆ. అటులు జంబుమాలి దిట మంతయును దూలి, సరగఁ బోరఁ గూలి జమునిప్రోలి
కేఁగినట్టిజోలి యెరచిమేపరు లోలిఁ, దెలుప నవ్విధము గరచి దీవిఁదేఁడు. 116

తే. అక్షుఁ డనుపేరుగలతనయుఁడు గొడుకుఁ, బిలిచి యాతోఁటి తల కోసి బీర మొదవఁ
దోరనపుఁగంబమునఁ గట్టి పేరువాఁడి, మరలి రక్షుని సెల విడ్డఁ గరము చెలఁగి. 117

క. వాఁ డొకతే రెక్కఁ కదుక్, వాఁడిమెయిం జని మెఱుంగువాల్నారసముల్
పోఁడిమిలోఁ గోఁతిపయి, న్వాఁడుపడు త్వెక్కసముగ నో శేయుటయున్. 118

సీ. మబ్బుత్రోపరికూన గొబ్బున వానిసింగాణి ముత్తునియలుగా నడంప
వేఱొండువిల్గొని తూఁటి ప్రాజేశలకేని ప్రేముడిపట్టి రేఁచి బల్క
దంక నచ్చెట్టుబిడారుబొబ్బమెకంబుపై నగ్గలంబుగఁ బాఱ వాఁడి
యమ్ములు పఱుప నయ్యనుమఁడు తోఁకచే నవి యెల్ల నుగ్గాడి యార్చి యొక్క

తే. తాడిమ్రానుక్కమీఱంగ నూడఁ బెఱికి, యక్కవాశింపురక్కసుఁ డెక్కుకొన్న
యరద మఱపఱ లాసరించు నలిగి వాఁడు, వానిదెన్నొన్న లుఱక నొవ్వంగ నేసె.

తే. ఏయుటయు బిట్టు పోలి యయ్యుపమనూడు, కొలపురాశిక్కదొరబాటు గొంతపడికిఁ
దెలిసి బిగి యొప్పు నప్పాలదిండిమిన్న, లొమ్ము పిడికిటఁ బొడిచిన సొమ్మసిల్లె. 120

క. సొమ్మసిలి సరగఁ దెప్పిఱి, యమ్మేటిమగండు గుదియ నయ్యనుమనిపైఁ
బొమ్ము నగలింప వాతఁడు, గ్రమ్మఱ నగ్గుదియ నతనిఁ గదు పడి మోఁదెన్. 121

తే. మోఁదుటయు వాఁడు వాల్గొని మొనసి కోఁతి, తొడలు నొవ్వఁగ నడిచినఁ దోన యెగసి
పట్టుకొని నేలపైఁ బడఁ గొట్టి గాలి, పట్టి యారక్కసుని జముపట్టుఁ జేర్చె. 122

తే. అంత మడియక మిగిలి యున్నట్టిపోఁక, బంట్లు పదికత్తుకల జేనిపాలి కేఁగి
మిక్కుటంబుగఁ బాముల పేఁతబుడుత, మగతనం బెల్లఁ బలుమఱుఁ బొగడి యనిరి.

సీ. శార్దూలముఖుఁ డీల్గె స్తనితహస్తుఁడు సెల్లె దీర్ఘజిహ్వుఁడు గడతేరిపోయె
శూలదంష్ట్రుఁడు మ్రగ్గెఁ గూలెఁ బింగళనేత్రుఁ డక్షవక్షుఁడు డెగటారె రక్త
రోముఁడు మెయి వీడె రుధిరాక్షుఁడును వ్యాఘ్రికబసుండు నక్షుండు గంతుగొనిరి
జంబుమాలి యడంగె శతజిహ్వుఁడును వక్రనాసుండు నుసురులఁ బాసి చనిరి

తే. మఱియు నెనిమిదివేలు గ్రద్దఱివదీక్ష, పడిరి పూఁదోఁటకావలిబానసీంత్రు
సోలఁ జచ్చిరి నేఁడు నీమ్రోల నేమి, తెలుపుదుము సామి యాతోఁటి తెఱఁగు మేము.

చ. అన విని పోఁకరాయఁ డెద నల్కయు నుమ్మలికంబు నబ్బురం
బును గదురంగ నక్షుఁ దలపోసి కడుం బలపించి యద్దిరా

మును నెపుడు న్వినంగననిముచ్చట పుట్టెను గాక కోఁతు లెం
దును బొలదిండిపోటరుల దుష్మట గంటిమె తప్పి జాతియందున్. 125

ఆ. తలఁప దఱిసియు నిపుడు దాఱుమాఱయ్యెఁ గాఁ,బోలు నేమి సేయఁ బోలు దీని
కనుచు నుత్తలంబు పెనఁగొన దురపిల్లు,నెదల నింద్రజితుఁడు సేఁగుదెంచి. 126

క. అప్పా జగములు మూఁడును, విప్పారెడుకడిమి గెలిచి వెలసిననీ వీ
చొప్పున నొకకోఁతికి నై, తప్పక పలుమఱుఁ గలఁగఁ దగవే చెపుమా. 127

క. ఉమ్మలిక యుడిగి పెద్దయు, నెమ్మదితో నుండు మిపుడు నీచెంతకు బీ
ర మ్మొదవఁగ నగ్గట్టుం,ద్రిమ్మరిమొనగానిఁ బట్టి తెచ్చెద నెలమిన్. 128

క. అని యరద మెక్కి యుక్కునఁ, జని తెమ్మెరకూన నంపజడివానల ముం
చిన నది యాతఁడు దోఁకం, దునిమి మలలు చెట్టు లేసెఁ దొడరి యతనిపైన్. 129

ఆ. దాని కలిగి నల్లద్రావుడు మేల్బంతి, తోన మరలి వాలుఁదూపు లేసె
నవియుఁ దునిమి వానియరదంబు మావుల, గాలిబుడుత నుగ్గుగా నొనర్చె. 130

తే. ఆ ట్లొనర్చిన రక్కసుం డతపికడిమి, కబ్రపడి కొన్ని నెఱితూపు లడరి యేయ
నవి యొకింతయుఁ గాఁడక యవలఁ జనియె,నప్పు డమ్ముబ్బరొందసోఁకు దలుక నిగుడ.

తే. బమ్మయ మ్మేర్చి యజ్జగబంటుమీఁద, వైవ నది నంఱు జాలక వానిఁ గుదియఁ
గట్టి వైచిన మే నల్ల పట్టివైచి, తండ్రికడ నిల్పె నగ్గట్టుదాయసూడు. 132

క. నిలిపిన నమ్మలద్రిమ్మరి,తలకట్టుం జూచి నల్లద్రావుడు కన్నా
కలుకయు నులుకును మదిలోఁ, నెలయఁగఁ గన్బొమలు ముడిచి యిట్లని పలికెన్.

ఆ. ఓరి కోఁతికూళ యొక్కింతయును మదిఁ, గొంకు లేక నీరుకుప్ప దాఁటి
గడుసుబోలసుదిండిగము లుండునిద్దీవి, కెట్లు చేరినాఁడ వెఱుకమాలి. 134

తే. అరయ జగముల రావణుఁ డనెడుపేరు, విన్న గుండియ లవియుఁ బో వేలుపులకు
నహహా నీడెందమున నించు కైన జంకు, దవుల కున్న దిదేమిచందంబొ కాని 135

క. ఎవ్వనిపంపున వచ్చితి, వెవ్వఁడు నీపేరు కర్జ మెయ్యది నీ కి
ట్లెవ్వడు సొరఁగ నిమ్మెయిఁ, గ్రొవ్వెల్ల నడంతు నింక గొబ్బునఁ జెపుమా. 136

తే. అనిన విని గాలిపట్టి యచ్చెనఁటిసోఁకు, కొలముదేవరఁ గనుఁగొని పలికె మరల
నోరి టక్కరికాఁడ యియ్యోజ లేని, కఱవ లేటికి వినర నిక్కముగ నిపుడు. 137

క. మానుగ జగములయొవడి, మానుపఁగాఁ గోరి పుడమిమడఁతుకకై వి
న్నానికపువంగడంబున, రానెల యై పొడమినట్టిరామునిబంటన్. 138

క. విను సుగ్రీవుఁ డనం బరఁ,గినకోఁతులమన్నెగానికి న్నెయ్యుఁడ గా
డ్పునకుం గాదిలికొమరుఁడ, హనుమంతుఁ డనంగఁ బేర్మి నలరినవాఁడన్. 139

క. కావరమున నారాముని,దేవేరి న్నీవు పట్టి తెచ్చిన వెదుకం
గా వలసి కడలి దాఁ టి,ద్దీవికి గం డెసఁగ నరుగుదెంచినవాఁడన్. 140

క. ఇమ్ముగ నీ ప్రా లంతయుఁ, ద్రిమ్మరి పూఁదోఁటలోనఁ బెల్లంబుగ రా
కొమ్మఁ గని మాటలాడి కర మ్మెలమిన్ జేనికడకుఁ గ్రమ్మఱి చనుచున్. 141

తే. కెరలి బారాక నీ కెలిగింపఁ గోరి, మేలిపూఁదోఁట యెల్లను గూలఁ ద్రోచి
మొనసి యనిలోన నక్షుండు మొదలుగలుగు, రక్కసుల నెల్లఁ జెక్కుండ్ర నుక్కడంచి.

ఆ. నిన్నుఁ జూచి కూర్మి నివ్వటిల్లఁగఁ గొన్ని, బుద్ధు లెఱుఁగఁ జెప్పి బుజ్జగింపఁ
దలఁచి పట్టువడితిఁ దప్పక నామాట, దిటము చేసి బ్రతుకు తెరవు కనుము. 143

చ. జగములతల్లి యై పుడమిజవ్వనిగాదిలిపట్టి యైనయి
మ్ముగుదలమిన్నఁ దెచ్చితివి మోస మెఱుంగక నీకు నెవ్వరుం
దగ దిది యంచుఁ జెప్పఁగలదంటలు గల్గమిఁ జేసి యిట్టికీ
డగపడె నింక నైన విడనాడక రామునిప్రాపుఁ జేరుమీ. 144

క. చెన్నగు రతనపుఁదొడవులు, మున్నుగ మన్నుంబడంతిముద్దులపట్టిన్
మిన్నక యుడుగర యిడు మీ, చెన్నటితన ముడిగి రాచసింగంబునకున్. 145

క. అక్కటికపుగని యగున, య్యక్కటిరాచందమామ కెలమిఁ గొలిచి యీ
రక్కసివంగడ మంతయు, దక్కించుకొనంగఁ జూడు టక్కుడిగి యిఁకన్. 146

తే. చుట్ట లనుఁగులు బంట్లు తోఁబుట్టువులును, గొడుకు లేనుఁగు లరదము ల్గుఱ్ఱములును
నలరునాతేనితూపుటింగలమునందు, బ్రుగ్గి పోవకమున్నె వే మలఁపుకొనుము. 147

క. ఇప్పని సేయక మసలినఁ, గప్పుమెదపలంతి వచ్చి కాచిన నిన్నుం
గుప్పునఁ బొరిగొను రాముఁడు, దప్పదు నామాట వినుము తఱుచు లిఁ కేలా. 148

క. నలువకొలంబునఁ బుట్టిన, బలియుండవు తొలిపలుకులు పఠికించిన మే
ల్వలఁతివి నీ కిటు పెఱచెలిఁ, దెలివి యొకింతయును లేక తేఁ దగ వగునే. 149

ఆ. అనినఁ గినిసి వాఁడు హనుమంతుతోడ ని, ట్లనియె నోరి కెడఁగ వినర యిట్లు
వెఱపుమాలి యొక్కఁడిఱుతమానిసివి నా, యెదుటఁ గొండ చేసి యెన్నె దిపుడు.

మ. జముఁడో వేల్పులఱేఁడో నీళ్లదొరయో చాగంపురాయండో వి
న్కొమరుండో విసదారితాల్పరియొ సోఁకుంబెద్దయో గాడ్పుచు
ట్టమొ మున్నీటియనుంగుపట్టిమగఁడో దంబార నాతోడ నా
లము గావింపఁదొడంగి యుక్కఱక నిల్వ న్దల్వమా ద్రిమ్మరీ. 151

తే. కోఁతి యెద లేనిమూఁకలతోఁడఁ గూడి, కట్టువిలుకాఁడు గొలువున్న మెట్టు నెత్తి
నట్టినాతోడఁ బోరాడు టెట్టు వొసఁగుఁ, బేదమానుసులకుఁ గోఁతిపిండులకును. 152

క. కొండలయాదుం జేయక, పందులుఁ గాయలును నమలి బ్రతికెదుమీకున్
దండులు గూడుక మానిసి, దిండులపై నడువ నెట్టితెం పొదవెనొకో. 153

తే. అడవిదుంపలె కాని సంబరము లొసఁగఁ, గాసుపీసుంబు చేత నెక్కడను లేక
మొగువఁ గోలొప్పియ కదునిమ్మలఁ గలంగునలఁతిదొరఁ గొల్వఁగడఁగు వెంగలులు గలరె.

క. కడయొడయలఁ దఱిమెదు నం,బుడుపిండులు మిమ్ము మనుపఁ జూతురె పోరం
గుడి మిఱుఁగెడువానికి నో, వడరెడు వేల్పుట్రపడియు మగుఁ గద తలఁపన్. 155

తే. అనిన విని తొలివేల్పురాయనికిఁ జెట్టు,నట్టుమొనగాఁడు వెండియు నిట్టు లనియె
నహహ చెనఁగోరుకొనువాని కరయ నొరుల,పలుకు సెవులకుఁ గొఱవియై యెరఁగకున్నె.

సీ. నినుఁ దోఁకఁ జుట్టి మున్నీటఁ బల్మఱు ముంచి విడిచినవాలి నుక్కడఁగఁ జేసె
నీ వాకింతయుఁ గేల నెగయ నెత్తఁగ లేని విరుసికయొకిమీనివిల్లు దునిమె
నిను గెల్వఁగొని వాఁడి నొనరెడువేయిచేతులఱేని గెడపినబలియు గెలిచె
నీచుట్ట లగుఖరునిఁ దూషణుని దిగతలలరాకాసిని బిలుకుమార్చె

తే. నీదుకుఁపున నిట్టిదై సెఱిని జన్న, కూళతొలివేల్పు నొకకోలఁ గూల వేసె
నట్టిరామునియందు నీయందుఁ గలుగు, దొడ్డుకొంచెంబు లెంచుమా త్రుట్లి పదలి.

తే. మిత్తితలదన్ని గుదెతాల్పు మీన లూడఁ, జెఱికి వినదారిరాయని జెవరఁ దోలి
గట్లు కెకలించి సంద్రము ల్గలఁపఁ జాలు,కోఁతిబిందము లారాముఁ గొలుచు జుమ్మి.

క. నీపేరు సెప్పినప్పుడె, యాపోటరు లెల్ల నలుక లఱిముఱిఁ బెరయం
జూపోపక బల్గ్రిద్దలు, లై పలికెదు తెఱఁగుఁ జెప్ప నచ్చెరువు గదా. 159

తే. అనిన రాకాసిదొర బొమ లదరఁ బడ్లు, గొఱుకుకొంచును గన్నుల నెఱుపుమీఱ
వీని నిటు డాయఁ బిల్చినఁ బూని వేయి,చందములఁ బ్రేలుచున్నాఁడు జాకుమాలి.

క. కావున నికం గొంకక, నీపెడఁగుంగొమ్మమెకము నిపు డడ లొదవం
దావిమలచక్కరాయని, తావున కనుపుఁ డని బంట్లఁ దగఁ బనికొలిపెన్. 161

తే. అత్తఱి విభీషణుఁడు డాసి యన్న యిట్లు,తెరువతో రాచపను లాని తిరుగుబంటు
లేమి యాడిన నాడుమ,రింతె కాని, తప్పుగాఁ గొని చంపఁపఁ దగదు సుమ్మి. 162

తే. కాక యించుక కినుక నోఁ గలిగెనేని, కొంత వెత వెట్టి విడుచుట గూడు ననిన
నట్ల కాకని యొప్పునగ్గలసూడు,పగతుఁ డబ్బంట్లఁ గనుఁగొని నగుచుఁ బలికె. 163

క. ఈదుదునుకోఁతిఁ గొని చని, మీఁదిట్టతనంబు లెల్ల మెఱయఁగ నిపు డోఁ
గాదనక తోఁకఁ గాలిచి, వీధివీథులను ద్రిప్పి విడువుఁడు కడఁకన్. 164

తే. అనుడు రక్కసు లతనిఁ దొడ్డొఁకని తొలంగ, నేఁగి మోకులు పగ్గము లెన్నియేని
గూర్చి బిగఁగట్టి తద్దయునార్చుకొనుచుఁ,దప్పెటలు మ్రోయఁ బ్రోలెల్లఁ ద్రిప్పి మఱియు.

తే. పుట్టములు దిట్టలుగఁ గూడఁ జెట్టి నేయి,నూనియల ముంచి యవి తోఁకపైని జుట్టి
నిప్పుకలు వెట్టి రవ్వలింపఁ గప్పు తెరవు,బాణమంటలు వెదచల్లఁ బాగె మిగుల. 166

తే. అపుడు గొందఱు సోఁకుఁదొయ్యలులు దక్కి, చాలు పేర్చింటిరాచప్రోయాలికడకు
నేఁగి యత్తెఱఁ గంతయుఁ నెఱుఁగఁ జెప్ప, నమ్మెలంతుక తద్దయు నుమ్మలించి. 167

క. అక్కట యుసురులవిం దగు, నిక్కోఁతులమిన్న కిప్పు డిట్టిదొసంగుల్
చిక్కులిదయ్యం బింతయు న,క్కటికము లేక యిట్లు హత్తించె నొకో. 168

తే. అనుచుఁ జేదోయి మోడ్చి యోయంటరాని, వేల్పు నీసాఁగడీఁ దగుదిన్నచార్లి
కనుఁగుఁగొడు కగుకోఁతికన్నాకునందు, నుడుకు చూడక చల్లనై యుండుమయ్య.

ఆ. అనుచు వేడుకొనిన హనుమంతునకుఁ గడు, నగ్గి చల్లనయ్యె నాతఁ డంతఁ
గడఁకఁ బ్రాఁకమినుకునుకువులు గొడఁగిన, గడిఁది మీఱ బమ్మకట్లు వీడె. 170

క. వీడినఁ దద్దయు నేడ్తెఱ, తోఁద న్నెయి వెంచి తులువతోలి వేలుపులం
గామపడఁ దఱిమి యార్చుచు, గాదుపువాలీదు సొచ్చె గాటపుఁగినుకన్. 171

సీ. మేడలు రవులించి మాడవు ల్గాల్చి పెక్ రచ్చకొట్టాయినం జిచ్చు నించి
చప్పరంబులు సూఁడి చవికలు మసి చేసి తత్తడినెలవులు దగులవైచి
విడిముడిపట్టులు ప్రేలిమి గావించి మల్లెసాలలు బిట్టు మండఁ జేసి
లోనగ నెల్లఁ బెల్లుగ నగ్గి కెరచేసి నెఱిమించుసరకు లన్నియును మాడ్చి

తే. గట్టువిలుకాఁడు దిగ ప్రోళ్లు గాల్చుతెఱఁగు, దోఁప రాకాసివీ డెల్ల దుమ్ముచేసి
కడలిఁ జిచ్చార్చుకొని నేలకాన్పుకడకు, మరలి తనచందమంతయు నరయఁ జెప్పె.

క. ఇదె నీరాయనిఁ జెచ్చెర, నెద నమ్మలికంబు మాని యెలనాగరొ నె
మ్మది నుండు మింక నని చేయిదోయిక్ మొగిడిచి జోవాఱు లిడి చనుసెదలన్.

తే. వేగ లంకిణి యనెడుతోల్వేల్పుపడఁతి, త్రోవ కడ్డంబుగా వచ్చి తొడర దాని
నొక్క గుద్దునఁ గెడపి లా వొప్పఁ గడలి, మగుడఁ జంగున దాటి యజ్జగమునందు.

తే. అచట నెలుఁగులయెకిమీఁడు నంగదుండు, మొదలుగలిగినతమవార లెదురు వచ్చి
కౌఁగిళులఁ గూర్పఁ దాఁ జన్నకజ్జ మెల్లఁ, దెల్లముగ హరికెలమితోఁ దెలియఁ జెప్పె.

తే. వారుఁ దానును పసవారువములజోదు, కొడుకు నిల్పిన పెనుతేనెకాన కరిగి
పండ్లుఁ గాయ లిగుళ్లు దుంపలును దేసి, యలుఁ దనివి దీఱఁ జాఱగా నారగించి.

క. అచ్చోటఁ దరలి యందఱు, విచ్చలవిడి నరిగి రాచవెన్నెలఱేనిక్
మచ్చికఁ బొడఁగని యడుగుల, కొచ్చెము గనరానిబత్తి నొరఁగినపిదపన్. 177

ఆ. మొగిలుకప్పుసుకటిముద్దులపట్టి దా, నరిగి నేలకాన్పు నరసి వచ్చు
కొలమిఁ దెలిపె యూపెతలమానికము రాగ, వున కొసంగుటయు మివులఁ జెలంగి. 178

తే. అతనిఁ గౌఁగిటఁ గదియించి వెతలు డించి, పుడమిఱేఁ డుల్లమునఁ దద్దఁ బొంగుచుండె
ననుచు వారదుఁ దెఱఁగింప నవలికతయుఁ, దెలుపుమసిపుట్టఁబుట్టువుపలుకుటయును.

చ. వలువయు వెన్నుఁ దగ్గి చలినట్టును గట్టులసూడుఁ బ్రొద్దు రే
వెలుఁగును నీళ్లదేవరయు విన్నప నేలయుఁ బైఁడిరాయఁడు
న్నలులును నుద్రము ల్గాద లనం డగనిజ్జగ మెల్ల నీవ యై
వెలఁగుచు నుండువేలుపులవేలుప మున్మొనవాలుదాలుపా. 180

క. ఎవ తేఁగొనబుకాఁడా, పెనుమినుఁగుంబెగలు వొగదుపేరిమివాఁడా
చెనఁటిపాలదిండ్లసూడా, కసమసుకలరాచసూడికఁబులపేఁడా. 181

తోటకవృత్తము.—

సేతుబంధులపుణ్యులపేరులు బో
ష్మున ప్రేలఁగఁ గేలను ముష్టినవాల్
గొనఁ బోరఁగ సాదలఁ గ్రొన్నెలయుఁ
మినువాఁకయుఁ గలిగిన మేల్పిరుదా. 182

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధరఘనయశోబంధురకౌండిన్యసగోత్రపవిత్రకూచిమంచిగంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయతిమ్మయనామధేయప్రణీతం బైనయచ్చ తెలుఁగు రామాయణమహాకావ్యంబునందు సుందరకాండంబు సర్వ మేకాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# అచ్చతెలుఁగురామాయణము

## యుద్ధకాండము



క. సిరిగొలుపరుసతేరుల దొరబిడ్డనిపాలఁ గలిగి దురమున గెలుపుల్
బెరయుంచి యళనిచే వ్రాఁసి బూజలు గొన్న మేటివేల్పులమిన్నా. 1

సీ. విను మబ్బులెఱియకాచుపునకుఁ గయ్యపుఁబిండిజదారి యిట్టని నుడివి నట్టు
గాదుపుచూలి లంకకు నేఁగి క్రమ్మఱఁ బఱతెంచి తాఁ బాటుపడఁ దెలిసుఱుఁ
జూచుటయును రక్కసులరాయఁ డున్నచందంబును మఱి వానికమ్ముదోయి
తెఱఁగును బాట్లమేడ్తెఱయును మూఁకల పెల్లును త్రెగ్గడపిందు పెంపు

తే. ప్రాఁకిటీవియు నారాచబొబ్బ మెకము, తోఁడ నెఱఁగింపఁ గడఁక నాప్రొద్దుపేఁడు
కొలఁది మిాఱినపోటుబొమ్మ మెకపు, వెల్లువలు గూడి యప్పుడె వేఁగఁ దరలి. 2

తే. మిాలు గప్పలు దాఁ జేళ్లు గాలిదిండ్లు, మొసలు తెంద్రలు నెగడులు మొదలుగలుగు
నీరుదిమ్మరిమవ్వులు నెఱయఁ బెరయఁ, బొనరుమున్నీరు సేరి యబ్బురము మిాఱ. 3

తే. అద్దఱిని దండు విడియించి తద్దఁ జెలఁగుచున్నతో నంత లంకలో నెన్నరాని
తిఁడ్డఁ జేఁబోలగం బుండి రావణుండు, గడఁక క్రైవార నమ్మఁగుఁ దెగ్గరల బలికె. 4

ఉ. త్రెగ్గరలార వాకలుకు ప్రేముడితోడ వినుండు వేల్పులన్
వెగ్గలఁ దోలి యక్కజపుఁ జేవ్ర దలిర్పఁగ ముజ్జగంబులన్
గ్రుగ్గఁగ నీడి కేలుదుఁ గరింబుఁ జెలంగుదు నుంటిఁ గాని ము
క్కుగ్గరవ ల్గముంగొర దొకించుక చే టొనరూడె నియ్యెడన్. 5

ఆ. ఒక్కకోఁతి సేరి ప్రక్కక వెక్కండ్రు, రక్కసులను బట్టి యుక్కడంచి
చనియె నింక నేమి యనఁ బోలుఁ దఱి తాఱు, మాఱుగాఁ దొడంగ వుదిఁ దలంచు.

తే. కదలి కోఁతుల కొక తోఁటకాల్వయయ్యెఁ, బెంపులపులంక యొక పేదకొంపయయ్యెఁ
బొలసు మేకరులొకచిఱుపురువులైరి, యహహచయ్యంబునిక నేమియనఁగఁ బోలు. 7

తే. అక్కజపు బైవపసున కలుని ముస్సు, వలువ కోఁక లొనగెడువాఁడు మేయు
తాలుపుల కెల్ల నెఱ్ఱన ట్లోరి సడి, కోఁతులకు మానుగుల గెల్వఁ గోర నైరి 8

క. అటు లగుటఁ జేసి యిపు డొక్కటఁ గోఁతులు మానుసులును గయ్యమునకు జ
క్కటిమగఁటిమితో వచ్చిరి, కటకట యిఁక నెద్ది తెరవు క్రన్ననఁ జెపుఁడా. 9

మ. అనినక్రై రక్కసిపెద్ద లిట్టు లని రాహా వేల్పురాసూద యొం
దును మున్నాఁడనిబీదపల్కు లిపు డెంతో నెవ్వగం బల్కఁగాఁ
జను నే భూని జగంబు లెల్ల నెఱి హెచ్చం గెల్చి గాటంపుటు
క్కునఁ జెన్నారెడునీకు మానుసు లెలుంగుల్ గోఁతులుం బెద్దయే. 10

తే. చెల్లఁబో యేఁడ నీయట్టిబల్లిదునకుఁ, గడిమి దిగఁద్రోచి తద్దయుఁ గన్నచిన్న
వార లెల్లను నగఁగ నివ్వరుసఁ గొఱఁత, మాట వాక్రువ్వఁ దగునె యుమ్మలిక పూని.

తే. జమునికంటెను జేజేలసామికంటె, జంట మోములవేల్పుకంటె నీళ్ల
ఱేనికంటెను లిబ్బులఱేనికంటె, మేటియే రాఘవుఁడు నిన్ను మీఱి పోర. 12

ఉ. అంచపుమాయిజోదు నలరారఁగఁ జేసి కడిందికోరిక
ల్గాంచి పెడందరక్కసికొలంబున కెల్లను మేలుబంతి వై
మించుపుఁగోదుతాలుపరిమాఱ్కబిడారపు మెట్టు నెంతయుం
గొంచక యెత్తినట్టినినుఁ గోఁతులు గీతులు గెల్వఁజాలునే. 13

ఆ. అదియుఁ గాక మమ్ము నెదిరించి పోర జే, జేల కైన బలిమి సాల దుండు
మానిసులును జెట్టుమనికివడీసులు, నెంతవారు కలన నెదిరి నిలువ. 14

ఉ. కొండలు పిండి సేతుమొ మొగుల్తెరు వొక్కట మ్రింగివైతుమో
గం డలరారఁ జిల్వగమికానిఁ గలంతుమొ యెల్ల వేల్పులం
బిండులఁ బట్టి కాఱియలఁ బెట్టుదుమో పెను మిత్తిగుండియల్
సెందుదుమో జగంబులకుఁ జేటొదవింతుమొ యీవిరాయఁడా. 15

క. ఘాతమునఁ బ్రొద్దుపస యుడిగింతుమొ పకమొసలిపట్లఁ గినుక నిగడం ని
కింతుమొ జముని నడంతుమొ, కొంతయుఁ గాదనక మాకు గొబ్బునఁ జెపుమా. 16

క. అనుతఱి విభీషణుఁడు మెల్లన నిడుచేవంచయాదలలరక్కసిరా
యనిఁ జూచి యిట్టు లనియెం, దనపలుకుల వలఁతితనము దనరారంగన్. 17

తే. అన్న యాపోటరులమాట లాలకించి, యేటి కెల్లను జేటు గానిఁగఁబోకు
రాచజేజేలఱేఁ డగు రాఘవునకు, నెలఁత నొప్పించి సిరు లెల్ల నిలుపుకొనుము. 18

తే. మొదలివెన్నుఁడు పంటలముగువగొడవ, లుడుపుకొఱకిర్లగొంగవంగడమునందు
రాముఁడై పుట్టె లిబ్బులచామ సీత, యై పొడమె వేల్పులు గోఁతు లైరి సుమ్ము. 19

క. మలసూ దగ్గియు జముఁడును, బొలవిండియుఁ ద్రాడుదాలుపుం గాద్పును ఘ
ళ్కులయొకమీఁడును లేఁగ్రొ, న్నెలతాల్పును గాను నోర నీ వెదిరింపన్. 20

క. తరికపుమానిసి యని నీ, తలఁపున నివు దల్లనేలతాలుపు మిన్నం
బులుకఁగఁ జూచెద వకటా, గెలుపఁగ నీవంటివారికిం దర మగునే. 21

సీ. జడదాఁకివెనువెంటఁ జనుచుఁ దక్కరిపోఁకుటెలనాగ నొకకోల విలుకుమార్చ
సేబల్లిదులు వ్రేల నెత్త నోపనిగట్టువిలుకానిసింగాణి విఱిచివైచె
బలురాచమిన్న శౌర్యాల బిట్టుసెలవిన గండ్రగొడ్డలితాల్పుగం డడంచెఁ
బైనుగానలోఁ బేలబిత్తరికానుపుఁ గొనిమేఁగుచెను వేల్పుగొంగఁ జిదిమెఁ

తే. బూవి చౌవంచమత్తులకోనలోన, ఖరుఁడు మొదలగు మేటిరక్కసులఁ గడపె
నొదలిచూపులయొడయనికొడుకుఁ గూల్చె,నహహ రామునిమగతనం బరుదు గాఁడె.

తే. తగరు బలితపుఁగొండతోఁ దాఁకునట్లు, దోమ బలుహజ్జమెకముతోఁ దొడరునట్లు
నీవు రారిక్కతేనిపైఁ బోవు టెల్ల, వలదు జత గానిసూడు నాపలుకు వినుము. 23

ఆ. ఒక్కకోఁతి సేరి యుక్కున నీ ముప్రోల్, ఎల్లఁ గాల్చి మేటియెఱచివిండి
బంట్లఁ దునిమివైచుపట్ల నీటాటోటు,తనపుఁ బెద్ద లెందుఁ జనిరి చెపుమ. 24

క. అనిన విని యతని నేమియు, నన నొల్లక పోఁకుటొడయఁ డలుకమెయిం గు
ప్పున లేచి కొలువు వీడ్కొని, తనలోనగరునకుఁ జనియెఁ దత్తర మెసఁగన్. 25

తే. అంత నమ్మఱునాఁ డెవ సంతసంబు, గదుర నన్నకడకుఁ గుంభకర్ణుఁ డేమ్మెఁ
జనినతోడన చని విభీషణుఁడు బత్తి,నన్నలకు నిర్వురకు మ్రొక్కి యున్నయెడల. 26

తే. వారిఁ దద్దయు నక్కిలి గారవించి, బంతిమోములదొర తనబంతిఁ గుడువఁ
బెట్టి వీడెంబు లిడి యొకనట్టువందు, నెమ్మిఁ గూర్చున్నచోఁ దిన్నతమ్ముఁ డనియె.27

క. పెద్దవు నీ వెఱుఁగనిపని, యెద్దియు లేదైన నొక్కఁ డేఁ దెల్పెద నీ
విద్దెసఁ గినుక యొనర్పక, గ్రద్దన రావేల్పుటేనికలికి న్విడుమా. 28

క. పంతము మెఱయఁగ రాచప,దంతి న్విడలేక యక్కటా యొకటఁ గొలం
బంతయుఁ జెఱుపఁగఁ జూచెద, వెంతయు మేల్గానము పూన కేమి యనఁ జనున్.

ఆ. తూఁడువిండిమావుదొరకుఁ గడంబున, బుట్టి ప్రాఁతమిన్కుతెట్టు లరసి
పొలుపువిండికొలపుఁదలకట్టవై పెఱ,తెఱవఁ గొనుట నీకు నెఱసనంబె. 30

క. ఈ డొదవనికయ్య మిటు, ల్గాఁదడు నావిన్నపంబు గుఱుతుగ వినుమా
కీడు తెఱంగులు మిగులం, జూడంబడుచున్న వివుడు పోఁకుడు రాయా. 31

తే. కడలయొకిమాంద్ర గెలిచినగరువ మూసి, యిపుడు జన్నంపుఁగాపరి నెమరఁ దివిర
దహహ యాతనిలావు గోరంత యైనఁ, దెలియ రాదు గదా నీకుఁ దలఁపుఁ జూడు.32

ఆ. పుడమితేనిలోడఁ దొడర నీలా వేమి, ఖరునికంటె నల్లగట్టుసూడు
కొడుకుకంటె గండ్రగొడ్డలితాలుపు, నేలవేల్పుకంటె నెఱయె చెపుమ. 33

ఆ. వేయు నేల వినుము వేగ నేలపాలంతి,పట్టిఁ గానుకఁ బెట్టి బత్తి మీఱ
మ్రొక్కు లొనఁగి రాచరిక్కలయెకిమీని, మఱుఁగు చేరి చెడక మనుట మేలు. 34

తే. అనినఁ బద్దుమఁ గిన్కతో నవుడు గఱచి, మోఱమేపుదొర కన్ను లెఱ్ఱఁ జేసి
కొలువు సేపరివారెల్ల నలుకు పూని, జలదరింపంగ నవ్విభీషణునిఁ జూచి. 35

సీ. ఓరి తమ్ముఁడ వయ్యు నోడక దొంగచేతికిఁ గ్రాలోసంగి నెట్టుకొని యింటి
వారల మేల్కొల్పు వడువునఁ బగవారిఁ గూడుక నామోములఁ గొంతు లేక
మాటికి నొకపేదమాసిసి నెమ్ముచుఁ జీఁకున కెంతయుఁ జేవ యిడుచుఁ
గానియోజలు జెల్వఁ గడఁగితి విపుడు నీ యెదలోనిట క్కల్ల నెఱుఁగఁబడియె

తే. నహహా నీవంటికూళ నుక్కడఁచి యింక, వంగడం బెల్ల బాగొనర్పంగఁ జను న
టంచు నడిదంబు చెలికి ప్రేయంగఁ జనిన, నడ్డుకొని సోఁకుదొరకుఁ బ్రహస్తుఁ డనియె.

క. ఒదయఁడ తోఁబుట్టువు నిటు, లడిదముఁ గొని ప్రేయఁ బోయె దకటా మది ని
క్కడుకినుకఁ బూనుకొని యా, జడిఁ జెందుట నీకు మేత్తెఱఁగె తలంపన్. 37

తే. ఇతనిపలుకులు నీచెవి కింపు గాక, యుండుఁ గా కేమి వినని యట్లుండు టొప్పఁ
గాక తెగఁ జూడఁ దగునె యిక్కడిఁ దిమగఁడు, లేనిసిరు లేల మురువేల లిబ్బులేల.

క. అని మరలించిన రక్కసి, మొనగాఁ డొకయింత డెందమునఁ దాలిమిఁ గై
కొని యుండెఁ గుంభకర్ణుఁడు, దనమనికికిఁ జనియె నిదురతమి మీఱంగన్. 39

తే. అపుడు నరమమగం డెవ నలుక నిగుడ, గట్లమారుతుపగతునిఁ గాంచి పలికె
నహహా యిపు డన్న మదిలోన నడలు పూని, నీకు మేల్బుద్ధి గఱపుట నేర మొదవె.

తే. కనికరంబున నీచేటు గాంచ నోడి, తొడరి మేల్బుద్ధిఁ జెప్పినఁ ద్రుంపఁ జూచె
దగ్గిఁ బడఁబోవుపాట్టియ నమరఁ బట్టి, మనుపఁ బూన్వానిఁ గుట్టక మానఁ గలదె. 41

క. మలద్రిమ్మరిగమితో రా, నెల నుద్రము దాఁటి వచ్చి నీకుత్తుకచా
ల్నెఁగపునపు డైన నెదలోఁ, దలఁపుము నామాట నల్లద్రావుడు తేఁడా. 42

క. గట్టులవలె నీకొడుకులుఁ, జుట్టలు మొనగాండ్రు రాచచుక్కలదొరపె
ద్దట్టపుటలుఁగులఁ జెనఁకువ, పట్టునఁ బదునప్పు డైనఁ బరికింపు మెదన్. 43

తే. మేర మీఱినబల్కొక్కమ్మ మెకపుబంట్లు, మూఁగి నీపూవుఁబోండ్లఁ గొమ్ములు పట్టి
యక్కజంబుగ నీడ్చుచున్నప్పు డైన, నీవు నాబుద్ధి తలఁపవ నిలుపుకొనుము. 44

తే. పుడమిపట్టువుఁ గ్రమ్మఱ నిమ్మ వ లేక, మసలెదవు గాని యాపె చక్కసికొలంబు
ద్రుంగ వచ్చినమాఱటమిత్తి యనుచు, నరయ జేరవు నిన్నెమి యందు నింక. 45

సీ. అనుటయుఁ జేయి సోకిన గాడ్పువెలికాని మాడ్కి నెంతేనియు నుండిపడుచు
లేచి శేశేలసూ డేచినక్రొవ్వునఁ గెరలుచు నతని నుంకించి తాఁచు
టయు సొమ్మసిల్లి యబ్బలియుఁడు వే తెప్పిలి విరానినుదువులు పేనవేలు
గొదుగక యాడినఁ గొఱకొఱతోఁ గుండవీనులఁబల్త్రావి వేల్పుమిన్న

తే. యన్న దనమనిక్కపట్టున కరిగె నవ్వి, భీషణుఁడు తల్లికడ కేఁగి బిట్టు వగఁచి
యన్న చేసినపని యెల్ల విన్నవించి, యాపె యానతిఁ గైకొని యపుడె కదలి. 46

క. నలువురుబంట్లుం దానును, వలనుగఁ జని వేఁడివెలుఁగువంగడపుంజా
బిలిఁ గాంచి దవ్వులనె సా, గిలఁబడి యిట్లనియె మోడ్పుఁ గేల్గవతోడన్. 47

సీ. జగములయేకిమీఁద జత లేనిమొనగాఁడ కలుకుసోఁకుడుసూద కావుకావు
తోఁగులవెలియావ సోయగంబులప్రోవ కనికరంబులతావ కావుకావు
మేటివేల్పులవేల్ప మేల్గానంబులచాల్ప కడిఁదిసింగిణితాల్ప కావుకావు
ప్రోదలతలకట్ట పున్నియంబులకొట్ట కయ్యంపుఁజెనుదిట్ట కావుకావు
తే. వరుసతేరులమన్నీనివంగదంబు, కరము వెలయింపఁ దగునయ్య కావుకావు
గట్టుద్రిమ్మరిఱేనిఁ జేపట్టి గాదవ,గములు వాపినబలియుఁడ కావుకావు. 48

క. కావరపురక్కసుఁడు చెను, ద్రోవం బడఁదన్ని వెడలఁ ద్రోయించుటచే
నీవే దరి యని వచ్చితిఁ, గావుము నన్నిపుడు రాచకలువలఱేఁడా. 49

ఆ. అనుచు వేఁడుకొనిన విని రాఘవుఁడు ప్రొద్దు,మాలినెమ్మొగంబు చూచి పలికెఁ
గావుకావు మంచు నేపురరక్కసు, లుఱక చేర వచ్చుచున్నవారు. 50

ఆ. వారిచంద మెల్ల నారసి రాఁ దగు,వారిఁ బనుపు మిపుడె కోరి మఱువు
సేరుకొనెనువారిఁ జేపట్టఁ జనుఁ గదా, పెర వెఱుగుమేటిదొరల కెల్ల. 51

క. అనవుడుఁ గోఁతులదొర చ,య్యనఁ గొండఱుబాల్గ నటులె యనిపిన వారల్
చని రక్కసిరాయనిత,మ్మునిఁ గొదగని మాటలాడి మురువు దలిర్పన్. 52

ఉ. క్రమ్మఱ వచ్చి యత్తెఱఁగుకల్వలదాయయనుంగుఁబట్టితో
నిమ్మగ విన్నవింప నతఁ డెత్తుక ముందట నిల్పి కేలుఁగెం
దమ్ముల దోయిలించుకొని తద్దయు నేర్పునఁ బల్కె రాచమొ
త్తమ్ములమిన్న నీ విపుడు దప్పక నానుడు వాలకింపుమా. 53

తే. చాల్పుమోములచెడుగులోల్వేల్పుజేని,తమ్ముఁడు విభీషణుం డలఁ దనరు నాతఁ
డన్నచే నొప్పి వడి యిందు నిన్నుఁ గొలువఁ, గోరి యరుదెంచినాఁడట కొంత లేక.

తే. దాయలోఁబుట్టువఁట వేల్పుదాయకొలుపు, పెద్దయఁట మెయిదాలుపుపిందువులను
మెక్కుటక్కరియఁటవాఁడు మిమ్ముఁగొలువ,వచ్చుటెఱఁగేమొ కరికొంకుపలుమొఁగాడ.

ఉ. అనుచును గోవ ద్రిమ్మరిగయాళులు కొండఱు చూపి పల్కి రో
గొనయుల ప్రోకలార యదిగోఁ బగ చేరికి వచ్చినప్పుడే
కని కసరింపఁ జెల్లుఁ జెఱకల్కులుఁ గేటికిఁ బంపు పెట్టఁ ద
ప్పినఁటులఁ బట్టి కేటడచి చెప్పర వచ్చెద ముక్కు మీఱఁగన్. 56

ఉ. కల్లల కెల్ల నిక్కు లనఁగాఁ దగువంజుదుదిండికూళ లి
క్కెల్లజెఱుంగులం దవిలి యెత్తెఱఁ ద్రిమ్మరుచుందు వాండ్రు మీ
రుల్లమునందు నమ్మికొని యూరక చెల్మి యొనర్పఁ జూచుటల్
సెల్ల దటన్న రాకొదమసింగము వారలఁ జూచి యిట్లనున్. 57

ఆ. వినుఁడు కొమ్మమెకపుమొనగాఁడులార లో, నయము పూని కావు మనుడు మఱువు
గూలిపట్టినాఁడిఁ ద్రోచిపుచ్చుట కీలు, తాల్పువారిలుఁలకుఁ దగదు సుండి. 58

తే. వేలుపులగొంగపై దోడు వెనుకఁ దూలి, కావు మని వేఁడుకొనెడిచోఁ గడఁక నిలని
మనుపు టక్కులపాలఁదిండిమన్నగాని, పెనుపుఁ జేవయుఁ దేఱఁ గైకొనుట సుండి.

క. కావున మీ రానెత్తురు, ద్రావుడు వంగడపుఁ గడలితామరదాయ
న్వేఁడెఁ దోడు సేఁత, ద్దీవికి దొరఁ జేసి యునుతుఁ దిర మొప్పారన్. 60

క. అనుటయు మలద్రిమ్మరిరా, యనిపంపున బాట్లు గొంద ఱక్కిలిఁ జని గొ
బ్బున రక్కసిమిన్నందో, డ్కొని తెచ్చిన వచ్చి యాకఁడు గదుం బత్తిన్. 61

తే. రాచముక్కంటియడుగుల వ్రాలి పెక్కుచందములఁ గొనియాడి యాసామి కిట్టు
లనియె నోపే ప్ప నలువ లోనైనవేల్పు, దొరలు గనలేనినీవాజ్ఞదోయి గంటి. 62

క. తులువలు గొందఱు నిన్నదిఁ, దలఁపరు నెఱవంట లెల్లఁ దమి నీయడుగుం
గలమునఁ బుట్టువుమున్నె, రలరఁ గదిరి ముల్లఁ గడతు రన్నిటిపేఁడా. 63

రగడ.—

సిరియుఁ బాటవలంతియుం దమిఁ జేరి చేరిక నడుగు లొత్తఁగఁ
బొరిఁ బొరి న్వలిముద్దుమోమునఁ బూపనవ్వులు మొలకలెత్తఁగఁ
జెలువు వెసంగఁ బయిం గడానిపసిండిదుప్పటి తళుకు లీనఁగఁ
దలచు రతనపుబొమిడికము తొగదాయలో బలువాదు పూనఁగఁ
వెడఁదతామరకెంపు టొమ్మున వేమఱుం గొనబారి వ్రేలఁగ
గుడుసువాలుచ జిందము న్వైచుగుదియ దమ్మియుఁ గేలఁ గ్రాలఁగఁ
దొలుమొగుత్తెగ దొగదునెమ్మెయిలోరపుంజిగి కదలఁ గప్పఁగ
వలపు గులుకుచు నొసలిపై నిడువాలుఁగస్తురిరేక యొప్పఁగ
మొసలివానునుబోఁగురంగులు మురువుఁజెక్కులపై మెలంగఁగఁ
బొసఁగఁ జేతుల బాఁపమేపుఁదుపులుఁగ కల్మురువు లెసలంగఁగఁ
బాలసంద్రముఁలోన నిద్దపుఁబడగదాలుపురాచనెజ్జను.
వేలుపుంజడదారిపాటలు వించుఁ బాడుక యుండి పొజ్జను
జగము లన్నియు నిలిచి నెమ్మిని సాఁకుచుండు కడింది వేలుప
చిగురుఁ గైదువుజోదులో నెనఁ జేయఁ బోల్నెఱిమేనుతాలుప
వంటపైదలికొలఁకు జేజే ల్పలసి వేఁడినఁ జాల్పుతేరుల
దంటగీమునఁ బుట్టి సోకుదుతలిరుఁబోఁడి నడంచి పోరుల
హెచ్చుమీఱినమంచిజబ్బులయొఱచిబోనపుబంటు దేఱిచి
మెచ్చుగా జడదారియాదలమిన్నజన్నము నిండఁ గూరిచి
చట్టుఁ దొయ్యలిఁ జేసి బూదులసామివి ల్దునుమాడి సారుల
లిట్ట యగుచాల్పేరినాడెపుఁ దెఱవ గైకొని రాచబారులఁ
గడిమి దిగవిడమాన్పు లడఁచినగుండ్రగొడ్డలితాల్పుఁ గైకొని
కడిఁదిలా వివి యంచు కెల్లపుఁ గాంచి మెచ్చఁగ గెల్పు సేకొని

యప్పుడామానవతి పూని కానల కరిగి తపసుల వెఱపు దీటిచి
సుప్పనాతిని ముక్కుసెవులును సారిదిఁ గోసి గొఱంతఁ జేరిచి
ఖరునిఁ జీచ మడంచి కల్లమెకంబు నొక్కవెడఁదతూపున
మురియ లోనరిచి పక్కిఱేనికి ముక్తి సతముగ నొసఁగి యేపున
వాలిఁ ద్రెళ్ళఁగ జేసి సతవార్యములదేవరపట్టిఁ గూరిమి
నేలి దాఁటుల నరుగుమెకముల నేర్చి కూర్చుక వచ్చి పేరిమిఁ
బొలసుమేపరిఱేని నడఁపఁగఁ బూని చెలఁగెడు రాచయేనుఁగ
యెలసి నీకెఱుగొనను లన్నియు నెన్న నేరిశరంబు జానుగ
మీను తాఁ జేల్పంది మానిసిమెకము గిడ్డియు నేలవేల్పును
గోనద్రిమ్మరిమూఁకఁ గూరుచుకొన్న నీవును దాడితాల్పును
మ్రానిలోఁ బొడకట్టు దిట్టయు మావు నెక్కుజగామగండును
లోనుగాఁ బలురూపు లూని వెలుంగు దయ్యము వేల్పువిండును
నిక్కువంబుగ నిన్నుఁ జేర్కొన నేర రని పెనుమిన్కు లాడఁగ
జక్కగా మముబోటు లెట్టుగఁ జాలుదు రొక్కనియాడి చూడఁగఁ
బ్రాఁకమిన్కుకొన ల్గనుంగొని బల్మిఁ బుట్టువుకట్టు లూడిచి
రోఁకకాపురమునకు వేసరి రొక్క మెత్తి కడంకఁ బాడిచి
చెలఁగి గాటపుఁదెలివిచిచ్చునఁ జెయ్వుకూటువు లెల్ల వ్రేలిచి
యలరి లోపలిదాయలను వెస నాఱువుర మొదలంటఁ గూలిచి
కనుఁగొనంబడు నెల్లజగమును గల్ల యని డెందమున నెంచుచు
నెనసి దిట మగులోనిచూపున నెప్పుడుం దనుఁ దానె కాంచుచుఁ
దివిరి యెద్దియుఁ గోరఁ బోవక తెపగొనమ్ములు నొందనీయక
తవిలి యెన్నఁడు నేని నిమ్మెయితాలుపులకును గీడు సేయక
పుడమిపైఁ దనయందు నెల్లెడఁ బున్నియపుఁజాడములె వామిగ
పడర నడచెడుజోగి చేరువ నందఁ బాయక యుండుసామిగ
కడలి పుడమియు నాకసంబును గట్లు జెట్లును నీరువాములుఁ
గడలివెన్నయు వేఁడివేలుపు గాడ్పు నగ్గియు నెల్లగాములుఁ
జిలువరాయఁడు ప్రొద్దుచూలియుఁ జేఁకతాల్పును వేల్పుఁ బెద్దయు
వెలిహుమాయివజీరుఁడుం గరి వేల్పు నీవె యటంచుఁ దద్దయు
నెలమిఁ దలఁపున నిల్పి సాఁకు నెంతు నర్మిలి నన్నుఁ బ్రోవుము
ఫలుదొసంగులఁ బాపి కూళలపాలఁ జిక్కఁగనీక కావుము. 64

తే. అనుచుఁ బొగడినఁ దద్దయు నలరి రాచ,యాచ మున్నీటిసీమ దెప్పించి యపుడె
పైని జిలికించి దీవిఱేనిఁ జేసి, యతని నఱ లేనినెయ్యు మొప్పారఁ జూచి. 65

క. పొలమేపరివంగడపుం, జలిడాలుమెకంబ నెమ్మది న్నీడీవిం
గలపెద్దలతెలుఁగును మూఁ, కలకొలఁదియు నేర్పరించి క్రన్ననఁ జెపుమా. 66

తే. అనుడు రాచూలి కతఁ డిట్టు లనియెఁ దండ్రి, తెలియ నాలింపు మిపుడు మాదీవిలోని
వేల్పుగొంగలతెలుఁగును జాల్పుకలల,రక్కసునిదిట మెఱిఁగింతు నిక్కువముగ. 67

తే. నలువ నలరించి కొలఁది యొనర్పరాని, మెప్పు లెన్నేని కైకొని మేటి యగుచు
జగము లన్నియు గెలిచినజగమగండు, రావణుం డొప్పు నెన లేనికీవిలోడ. 68

క. జన్నంపుఁదిండిదొరలకు, ముగ్నలికం బాఱఁ దోలి ముజ్జగములు చే
కొన్న నెఱబిరుదు రావణు, కన్నం బలియుండు కుంభకర్ణుఁడు దనరున్. 69

చ. తునుమఁగ రానిజోల్ల నొకతూరియు వ మ్మయి పోనితూపులున్
మినునిసువు న్వడిం దెగడి మీఱెడిమావులు లొజ్జగానిబ
ల్దొనలును దొడ్డసింగిణులు దూకొని వెన్కకు రానిబీరమున్
బొనరఁగ వేల్పుగొంగతొలిబొట్టియ యింద్రజితుండు ఱొపిలున్. 70

సీ. రాయఁడ విను మతికాయుండు మొదలగు వాలుమగ ల్పెక్కువేలు రక్క
సులజేనిజోదుమ లజ్జోదు లొక్కొక్కఁడు వేనవే ల్బూనిచేసివేలబంట్లఁ
గూడుక ప్రోలిబలొక్కట లేదును గాచుకొని యేమఱక వేఁడిమిని జెలంగు
చుండు రాతనికి నెయ్యుఁడు దళవాయియు నై ప్రహస్తుం డన్నట్టిజెట్టి

తే. బిరుదు రాణించు మఱియుఁ జెన్ దురమునందు, వాసి మీఱినప్రోదరాకాసిబంటు
లక్కజంబుగ లెక్కల కెక్కు వగుచుఁ, గ్రిక్కిఱిసి యుందు రెనలేనియుక్కుమెఱయ.

తే. అట్టిబల్మిని సోఁకురాయుండు నీప, డంతఁ జెఱఁగొని యునిచె నే నెంత మంచి
బుద్ధిఁ జెప్పిన వినక యబ్బురపుఁగినుకఁ, గెరలి వడిఁ దన్ని వెడల నూకించె నిందు. 72

ఆ. అనుచుఁ గినుక నిగుడ నప్పుడె యొకిమీఁదు, దంతుతోడఁ గడలి దరియ నరిగి
కట్ట గట్టఁ దివురుపట్టునఁ జెలఁగి యన్నీరుకుప్ప పొంగి నింగి ముట్టె. 73

క. అటు లుప్పొంగినఁ గని నాఁ గటిచాల్పేరింటివాలుఁగంటిమగఁడు మి
క్కుటమగుకొఱకొఱతోడన్, దటుకున వి ల్గొని లకోరి దగఁ బూనుటయున్. 74

క. గడగడ వడఁకుచు మున్నీ, రడరెడునెమ్మేను దాల్చి యన్నెఱజేజే
యడుగులపై నొరఁగెం దన, యను గసలును జిప్పప్రోవు నై కనఁబడగన్. 75

ఆ. అట్టు లొరఁగి లేచి యమ్మగరతనంబు, మ్రోల నిల్చి కేలు మోడ్చి పలికె
నప్ప యింతకినుక యొప్పునే మముబోటి, పలుచఁదనపువారిపట్ల మీకు. 76

క. సుడి వడి యడలుచు బన్నము, లెడ నూరక పొదమ వంత లెలయఁగఁ గడు లో
నుడుకుచు నుండెడివారల, యెడ దొరలకుఁ గినియఁ బోలునే యొకిమీఁడా. 77

క. మలద్రిమ్మరిమూఁకలతో, వలనుగ మీ రిందుఁ దరలి వచ్చుట గని లో
నలరి చెలంగితిఁ గా కెదఁ, దలఁతునె మీ కొక్కకీడు తపసులవిందా. 78

సీ. కల్లరిజంకరక్కసియుఁ సురులగొంగ కలువలదాయవంగడపుఁదొడవ
చాల్పుబాదులమన్నుఁదాల్పుతోల్బెక్కఁడ చెట్టుద్రిమ్మరిపోఁడ్లపట్టుఁగొమ్మ
పాలదిండిపిండుచిల్వలపుల్గురాయఁడ చాలుపేరింటి ప్రోయాలిమగఁడ
సేలక్రొన్ననఁబోఁడిసెయ్యంపుటల్లుఁడ చుట్టుచట్టలుమెట్టుమెట్టువాఁడ
తే. కడిఁదిజడదారిజన్నంపుఁగాపుకాఁడ, యింక నెన రొప్ప మాకప్పు లెల్ల సైఁచి
గట్లు చెట్లును దెప్పించి కట్ట గట్టి, వేగిరమ దాఁటి చెనుతొలివేల్పుఁ బొదువు. 79
క. అని చెప్పి యేళ్లరాయఁడు, మునుపటిరూపూని యుండె మురియుచు దొరయుక్
దనములకి దృశ్యగుల్మం, బనుమదువ్రపయి న్నిగుడ్చి యట నిఁకించెన్. 80
ఆ. అంతఁ బ్రొద్దుచూలియానతిఁ గడలకుఁ, దఱుల మోరమెకపుదాఁటు లేఁగి
గట్లు చెట్లు దెచ్చి కడలిపై వైచిన, నవి మునిఁగిపోయె నబ్బురముగ. 81
తే. మునిఁగిపోవుటఁ గని డెందమున నొకింత, కందియుం బూనుచోఁ రాచచందమామ
కడకుఁ గ్రమ్మఱ వచ్చి జక్కులఱేఁడు, నెరవు దైవార నిట్లని విన్నవించె. 82
క. ఎకిమీఁడా విను రావణు,నకుఁ జెల్లి యొసంగ మే లొనర్చుచుఁ దనలో
నొకరుండు మేటిమీ లే, రికిఁ జిక్కక నిచ్చనిచ్చఁ ద్రిమ్మరుచుండున్. 83
క. ఆచేఁప లిపుడు మీరలు, వైచినమల లెల్ల మ్రింగివైచెఁ జుమీ యో
రాచల్వఱేఁడ పదిలుఁడ, వై చెచ్చెర నడవఁ గట్ట నంపుము నలుసిన్. 84
చ. అనవుడు నేలఱేఁడు నెఱిఁ గందుచు నప్పుడె కట్టఁ గట్టఁ బె
ల్లున నలుఁ బూన్చి కోఁతుల నెలుంగులఁ గొండలు దెం డటంచుఁ బం
పిన నొగి వార లందఱును బెల్లు గనంబడఁ గ్రేళ్లు దాఁటుచున్
జని కద లెల్లఁ గ్రమ్ముకొని చట్టులు బిట్టు పెకల్చి వ్రేల్మిడిన్. 85
తే. ప్రొద్దునిసువును గాడుపుబొట్టియఁడును, వేల్పురాయనిమనుమఁడు వెనుకమూపు
మెకపుఱేఁడును మొదలగు మేటిమగలు, గ్రొత్తలా గొప్ప పెనుగట్టు లెత్తుకొనిరి. 86
తే. మఱియుఁ దక్కినమ్రానుద్రిమ్మరికడింది, మగలుఁ దమతమ పేర్మికిఁ దగినకొలఁది
గట్టు చెట్టును గొని తెచ్చి కడలియందు, వైచుచుండిరి యెకిమీఁడు సూచి మెచ్చ.
తే. అత్తెఱంగున మలమన్కిమొత్తములు గ,దంక దైవారఁ జెట్లఁ గొండలును దెచ్చి
వైవ నాలుగునాళ్ల కవ్వలఁటి యైన, నలుఁడు గడలికి నిండార నడవఁ గట్టె. 88
ఉ. కట్టుట కుబ్బి రాచసెల గాములరాయనిపట్టిఁ జూచి మీ
చెట్టుబిడారపుందొరలఁ జెచ్చెర మూఁకలతోడఁ గూడి యి
క్కట్టపయి న్నెఱి న్నదువఁగాఁ బనికొల్పుము పేర్మి నా నతం
డట్టులె పౌఁజులం బిలిచి యానతి యిచ్చినఁ బొంగి వ్రేల్మిడిన్. 89
సీ. కో యని యార్చుచుఁ గుప్పించి దాఁటుచు నేలలు వాడుచు నీల లిడుచు
మొరములు వైచుచు మింటికి న్నెగయుచుఁ జప్పట ల్చఱచుచుఁ గుప్ప వడుచు

నొండొరుఁ గడచుచు నుఱువులు సూపుచుఁ బొకర లాడుచుఁ బఱువు గొనుచు
నీటిపై నుఱుకుచు నేటుగా నీఁదుచుఁ గ్రమ్మఱ నడవకు దొమ్మిఁ జనుచుఁ
తే. బుడమి యీనినవడువున నెడ యొకింత, లేక యేకడఁ జూచిన లెక్క సేయ
రాక తేఁకువ నక్కోఁతిమూఁక యెలమి, నడిచి బడిబడి మున్నీరు గడచుచుండె.
తే. అంతఁ గోఁతులదొర తనచెంత రాఁగ, నంగదునిమీఁదఁ దమ్ముఁడు నాకసంబు
తూర్పుమనుమనిపైఁ దామఁ దేర్పి నెక్కి, పుడమికూఁతురిమేల్బంతి గడలి దాఁటె. 91
ఆ. దాఁటి మున్నె పోయి దరిడిగ్గి యున్నమూఁకలు విభీషణుండుఁ గలసి కొలువ
మేఁక దరలి దొర సువేలంబుచేరువ, పుడమిఁ జుట్టుముట్టి కదఁక నుండె. 92

సీ. అటువలె నుండుట దిటముగా వేగులవారలవలన రావణుఁ డెఱింగి
కోటలు కొమ్మలు కొత్తడమ్ములు పెద్ద గవఁకులు నరవడ్లు గట్టివఱచి
కొడుకుల దొరలఁ బ్రెగ్గడల బాదుగుల నొంటరులఁ దీర్పరుల దట్టముగఁ గూర్చి
లెక్క కెక్కువ లగురక్కసిమూఁకల బరవసం బొనరించి పత్తెఁగుల
తే. హెచ్చరికఁ జేసి పీట న్నెల్లెడలఁ గాపు, లిడి దురంబున కేత్తెఱఁ గదఁగుచుండె
నంత మూఁకలతో రాముఁ డచటఁ దరలి, లంకపైఁ బోరి కరిగెఁ జలంబు మెఱయ.
ఆ. అరిగి బాట్ల కెల్ల నావరి యిడ వారు, గట్లఁ జెట్లఁ బూని కదఁగి రనికి
విండ్లఁ గైదువులను వెసఁ బూని రాకాసి, దొరలు వారితోడఁ దొడరి రపుడు. 94
తే. అపుడు కనికరముల గని యైనరాముఁ, డంగదుని డాయఁ బిల్చి నీ వగ్గరాసు
రక్కసులఱేనికడ కేగి యొక్కమాట, గట్టిగాఁ జెప్పి రమ్మని యిట్టులనియె. 95
క. మ్రుచ్చుఁదనంబున సీతం, దెచ్చితి వింక నైన మేలు తెఱఁ గూనక నీ
వచ్చిగురుఁబోఁడిఁ గ్రమ్మర, నిచ్చి కొలం బెల్లఁ బ్రోచి యిడుకొను మనుమీ. 96
క. మూఁకలు చుట్టలు కొడుకులుఁ, జా కుందు తెఱఁగు గనుము సరగ నటంచుం
డాకొని యెఱిఁగింపు మటు. గ్గాకుండిన దుర మొనర్పఁగా ర మ్మనుమీ. 97
ఆ. అనిన వేల్పుఱేనిమనుమఁ డుల్లములోనఁ, బొంగి యపుడె తరలి నింగి నరిగి
పొలసుదిండిమిన్న గొలువున్న బలుహజా, రంబులోన నిలిచె దంబు మీఱ. 98

చ. నిలిచినఁ జూచి రక్కసులు నివ్వెఱ యూనుచు బొబ్బరించుచు
న్వెలవెలఁ బోవుచుం గడలు నింగియుఁ జూచుచు నౌర మున్ను లా
వెలయఁగ లంకఁ గాల్చి తము నేఁచినకోఁతియె నేఁడు గ్రమ్మఱం
గలనికి వచ్చె నంచును బికాపిక లై కఱతెంచి రందఱున్. 99
ఆ. అట్లు వఱచువారిఁ బొల్లైముగా మరలించి సోఁకుఱేఁడు గొంచు గాని
కినుకతోడ నతనిఁ గనుఁగొని బొమముడు, లదర నిట్టు లనుచు నుదరి పలికె. 100
ఉ. ఓరి పెదంగు ప్రాన్ననికియొంటరి కాన తలంకు మాలి యి
ట్లూరక బల్లిదంపుఁబొలయోరెపుమూఁకలలోని కెట్టుగాఁ

జేరితి వెవ్వఁ డంపె నిను జేడ్పడఁ జేయఁ దలంచి యింక నీ
యూరును బేరుఁ జెప్పుకొను మున్నటు లన్నియు నంత నయ్యెడిన్. 101

క. మొన్న నొకకోఁతి యొక్కటి, మున్నరక న్వచ్చి తోఁక మొదలికి ముట్టన్
మిన్నక కాల్పించుక మఱి, సన్నకసన్నం దొలంగి చనియెం జుమ్మీ. 102

క. ఆమ్మాట నీవు సెవులఁ ది,గమ్ముగ విన్నావొ లేదొ రక్కసిబంటు
ల్గ్రిమ్ముకొని వానిఁ జేసిన, యమ్ములుచపను ల్దలంప నచ్చెదవు గదా. 103

ఆ. అనిన వానిఁ జూచి యంగదుఁ డిట్లని, పలికె నించుకైన నలుకు లేక
యోరిబెరసుపాలసుటోరెంపుజేఁడ నా,పలుకు వినర వింతతలఁపు మాని. 104

క. నినుఁ బెక్కేఁడులు చెఱ నని,చినయయ్యర్జునుని వేయుచేతులు వరుసం
దునిమినబలియునిఁ గడు నుక్కున గులిచిన నేలజేనికూరిమిబంటన్. 105

ఆ. నిన్నుఁ దోఁకఁ జుట్టి మున్నీటఁ బలుమాఱు, ముంచి కనికరంబు మించి మరల
విడిచినట్టివానికొడుక నంగదుఁ డను,వాఁడ జేఁడు పనుప వచ్చినాఁడ. 106

క. మారాయఁడు నను నీపైఁ, గూరిమిచే బుద్ధి దెలుపుకొఱకై పనిచెన్
నేరుపరి వగుచుఁ దద్దయుఁ, జేరిక వెలయంగ నతనిఁ జేరి బ్రతుకుమీ. 107

చ. మొఱకుఁదనంబు పూని జగము ల్వలుచంవములం గలంచి యే
డ్తెఱఁ దెఱగంటిముద్దియలఁ దెచ్చి కడిందిగఁ బ్రోల నందఱిం
జెఱ నిడినట్లుకాఁ దలఁచి చే టొనగూడు నటన్నమాట లో
నెఱుఁగక నేలకాన్పు నిటు లేటికిఁ దెచ్చితి వీవు వెంగలీ. 108

తే. జగములకు నెల్లఁ దల్లి యై పొగడు గన్న, మన్నుకాన్పును నీవును గన్నతల్లి
కైవడిని జూచుకొనవలెఁ గాక యిట్టు, లమిని జెఱ పట్టి యునుచుట తగవె చెపుమ.

క. ఏనుఁగులు న్గుఱ్ఱములు, స్సానికములు మేలిపుండసపుదొడవులు నా
జేసికిఁ బన్నుగ సీతం, గానుక యిడి బ్రతుకు మట్లు గా కున్నయెడన్. 110

క. నాడెంపుంబోటరి వై, పే డెత్తక మొఱసి రాచబెబ్బులితోఁ బో
రాడుము పేలుపు లందఱుఁ, జూడఁగ నాలమున నిలిచి స్రుక్కనికడిమిన్. 111

తే. ఇసుకప్రోవులఁ జుక్కలు నెన్న వచ్చుఁ, గాని మాజేసికడ నున్నకోనమన్కి
బంట్ల లెక్కింపఁ బోసఁగ దబ్బలియు రింక,నిన్నుఁ గనుఁగొన్న బొంటితో నిల్వనీరు.

తే. మొన్న నీలంక గాలిచి చన్నకోఁతి
మిన్నయును నేను వారిలో సన్నగాండ్ర
మనుచు నిటువంటికోఱగానిపనుల కనుచుఁ
జుమ్ము మము నిద్వరను జేఁడు నోఁపుజేఁడ. 113

క. వెంగలి వై రాపాలఁతిం, దొంగిలి తెచ్చితివి చేటుఁద్రోవ నయో నీ
వంగడ మద్దొరములునుల,యుంగలమునఁ బడకమున్నె యిడు మీఁక నయినన్. 114

క. చెడుగుఁదనంబునఁ బలుమఱుఁ, గడయొడయలఁ దఱిమినట్లు గా దాజేనిం
దొడరి కడతేర వాఁతని, కడిమి యొకింతైన నీకుఁ గన రాదు గదా. 115

ఆ. పుడుకతాల్పువిల్లు దునిమెఁ దాటకఁ జంపె, ఖరుని దెర్చె వాలిఁ గడవఁ బనిచెఁ
గల్లజింకఁ జిదిమె గండ్రగొడ్డలితాల్పు, గరువ మడఁచె నతనికడిమి యసదె. 116

తే. అనుడు సంజాదుదిండిరాయండు వాని, కిట్టు లని పల్కె వినరోరి చెట్టునట్టు
మెకపుముసికాఁడ రామునిమేటితనము, సెప్పెదవు వేనవేలు నాచెంత నిలిచి. 117

ఆ. రాముఁ డేమి వేల్పురాయనికంటెను, జమునికంటె నీర్లసామికంటె
మఱియుఁ జేవ కలుగుమఱియులేద్రిమ్మరి,దొరలకంటె బల్లిదుండె చెపుమ. 118

చ. చివికినవిల్లు ద్రుంచుటయుఁ జేడియ నొంచుటయున్ నెసుళ్ల నె
క్కువచల మారఁ జంపుటయుఁ గోఁతిని జింకను గీటడంచుటల్
తవిలి పెడంగుప్రాఁబుడమిదయ్యము గెల్చుటయుం దిటంబుగా
నివి యొకబంటుచెయ్వు లని యెన్నెద వేమని యందు నిన్నిఁకన్. 119

ఆ. ఓరి కోఁచబంట యొక్కించుకేనియు, మగతనంబు లేక పగతుఁ జేరి
కొలుచుచుండి వాలికొడుకు నంచిటువలెఁ, జెప్పుకొనఁగ నీకు సిగ్గు గాదె. 120

తే. కొలఁది మీఱినమగఁటిమిఁ గొఱలువాలి,యెదుటఁ గొర లేక వడిఁ బొంచి యేసిట్టి
కూళ నొకబంటుగా నెన్ని కొలిచె దింకఁ,దొలఁగి చను కొల్వుమఱియొందుదొరలు లేరె.

క. జగములు వొగడఁగ నెగడిన, జగబంటసికొమరుఁ డయ్యు జతనమునఁ గటా
పగ దీఱుపనోపవు నీ,కుగతన మేమిటికిఁ దులువమూక ద్రిమ్మరిగా. 122

సీ. అన్న యన్కనికరం బెన్నక మీతండ్రి నడఁగించి యతఁ డేలుపుడమి యెల్లఁ
దలఁగక కైకొన్నతులువను బినతండ్రి యని డెందమున నమ్మి యతనిచెంత
మగరాచతన మూని తగుదు నంచు మెలంగె దకట యించుక యైన నఱ దలఁపక
పడుచువాఁడవు నిన్నుఁ బొడగన్న నామది గడిఁదంపుటక్కటికంబు వొడమె

తే. నహహా యింక నైనఁ జెడిపోక యద నెఱింగి,మమ్ముఁ గొలువుము సుగ్రీవు మడఁచి నీకుఁ
గొండద్రిమ్మరినాఁ డొనగూడఁ జేతు, నిప్పుడు వలసినసొమ్మెల్ల నెలమి నిడుదు. 123

ఆ. అనినఁ జుఱ్ఱుపేరినఁబోఁడిమిహరిమి, కొమరుఁ డలిగి యోరి కూళకాన
కానికఱవ లింక మానుర నీపాలి, దయ్యము ఱక చెఱుపఁ దలఁచినాఁడు. 124

సీ. అని పల్కి క్రమ్మఱఁ జనఁ జూచుచో దీవిజేఁడు జోదులఁ గన్గిఱిపి యదల్చు
టయు వార లక్కోఁతిపయిరులయెకిమీని బొదవి పద్దెఱఁగులఁ బోర నాతఁ
డంచఱఁ జిందఱవంచఱగా మోఁది కొండఱఁ జిదిమి సోఁకుదులసామి
గొలు వున్నబలుమేడ గూలఁ దన్ని కడింది నింగి నరిగి రాముని నెఱియదుగుఁ

తే. దాఁకరలఁ జేరి చాలుపుత్రలలతులువ, తెఱఁగెఱిఁగింప నీర్నైదుతేర్లజేని
కొమరుఁ డెవనల్గి లంకపైఁ గొమ్మమెకము,పోఁజు నప్పుడె వడి లగ్గఁ బట్ట బనిచె.

క. పనిచినఁ జని యొక్కమ్మడిఁ, బెనఁకువతమిఁ గోనమునికిబిరుదంబులు శే
వున నార్చి కోట లెక్కినఁ, గనుఁగొని రక్కసులు వారిఁ గదిసిరి కడఁకన్. 126

చ. కదిసి పెడందబల్లెములఁ గైదువులన్ జముదాడ్ల వంకుల
న్గదియల నీఁటెల న్సురెలఁ గోలల గొడ్డసులం బొరింబొరి
న్బెదరుచు బుక్క లెమ్ములును నెత్తురు నంజుడు గ్రొవ్వు ప్రేవులున్
బ్రిదిలి కడింది గాఁ బుడమిఁ జేర్కొన మోఁదిరి కోఁతిబంటులన్. 227

ఉ. వారును గట్లుఁ జెట్లుఁ గొని వార్వము లేనుఁగు లందలంబులుం
దేరులు బొక్కసంబులును తేదగుకైదువులున్ సిడంబులున్
దేరగుకాశ లెల్లలును బిట్టుగఁ దుత్తుమురై పడం గడున్
బోరొనరించి యక్కజపుఁబెంపునఁ గూల్చిరి ప్రాఁతవేల్పులన్. 123

సీ. అపు డింద్రజిత్తుతో నంగదుఁడును బ్రహస్తునితోడ సుగ్రీవుఁడును నికుంభు
తో నీలుఁడును గుంభుతో ధూమ్రుఁడును నంతకునితోఁ బనసుఁడుఁ దపనునితోడ
నలుఁడును జంభుతో లలి వేగదర్శియు సారణుతోడ వృషభుఁడు జంబు
మాలితో గాడుపుచూలియు మకరాక్షులతోడుత జాంబవంతుఁడును ద్రిశిరు

తే. తోడ శరభుఁ డకంపనుతోడఁ గుముదుఁ,డును మహోదరుతోడ నేటుగ సుషేణుఁ
డును విరూపాక్షుతోడ రాముని యనుంగు, తోఁడఁబుట్టువు నేక్తైఱఁ దొడరమఱియు.

తే. పేరు గలజోదు లొండొరు ల్దారసిల్లి, మిక్కుటంబుగ నార్పులు మిన్ను ముట్ట
బిట్ట గవలుచుఁ దరలక పెనఁగఁ దొడఁగి,రయ్యెడలఁ గోఁతిదొరలుగయ్యంబునందు.

చ. కఱచియుఁ గాళ్లఁ దాఁచియును గట్టులు చెట్టులు బిట్టు వైచియుం
జఱచియుఁ గ్రుద్దియుం బిడుగు సర్లక తోఁకలఁ జుట్టి కొట్టియున్
మఱిమఱి యేనుఁ గేనుఁగుల మావుల లొట్టియలం గడిందిగా
నుఱు మొనరించి హెచ్చరిక నూల్కొనఁ దేపలు పిండి సేయుచున్. 131

క. క్రమ్ముకొని సోఁకుజోదుల, నెమ్మేనులు పగిలి మెదడు నెత్తురు గ్రొవ్వున్
దుమ్మునఁ గండలు దొరుఁగఁగ, నిమ్ములఁ జెలరేఁగి మోఁది రేచినకడిమిన్. 132

క. మోఁదిల నప్పాలబోనపు,జోదులు పెండియును వాఁడిసురియల గుదెలం
గైదువుల దినరసంబులఁ, బొదుకొని కలంచి మోటుపఱిచిరి వారిన్. 133

తే. అత్తెఱంగున నిరువాగునందుఁ గలుగు, జోదులును బంట్లు దార్కొని స్రుక్కు లేని
బలిమిఁ బోరొనరింపుచు గెలుపుతలఁపు, లంతకంతకు నగ్గలం బగుచు నిగుడ. 134

సీ. మోరలు బోరలు మూఁపులు వీఁపులు గౌనులు పీఁకలు కాళ్ల వేళ్ల
చేతులు వాతులు చెక్కులు ముక్కులు ప్రక్కలు పిక్కలు బుఱలు దరులు
పొట్టలు చట్టలు బొమ్మలు దుమ్ములు మోవులు ప్రేవులు మొలలు దలలు
గుండెలు గండలు గోళ్లును గిళ్లను దొడలును మెడలు తుత్తుమురు గాఁగ

తే. హత్తుకొని మొత్తుకాడి పెన్నెత్తు రోలుకఁ, జూచువారల కెంతయు సొబగు మీఱ
బూరుగులపోల్కిఁ బొలిచి రవ్వపడు నేల, బూచిగములును బాదులఁ బొదలియాడ.

తే. అంతఁ బడమటికడలి నీరాడుమేను, లూను దేవర గ్రుంకిన నుబ్బి రేయి
ద్రిమ్మరులు సెట్టుద్రిమ్మరితెగలఁ బొదివి, పులుదెఱంగుల నొంప నబ్బలియు రలిగి.

ఉ. కొందఱ నేలతోఁ జవియఁ గొట్టియుఁ గొందఱఁ గూలమట్టియుం
గొంద ఱబొందులు ల్వగుల గ్రుచ్చియుఁ గొందఱ నోళ్లఁ వ్రచ్చియుం
గొందఱఁ దోఁకత్రాళ్లి జియఁ గుత్తుకలం దవిలించి లాగియుం
జిందఱవందరై పడఁగఁ జివ్వకడ న్మడియించి రంతటన్. 137

తే. అందుఁ బొలియక చిక్కి నగ్ననట్టిపోఁడు, దొరలతోఁ గూడి యింద్రజితుండు దీవి
కరిగి గాదుప్రసంగడీఁ దలర నొక్క, దండ వేల్మి యొనరింప దానివలన 138

క. అక్కజపువిల్లుఁ గైదువ, లెక్కుడుమెకములును నేరు లెల్లుంలు మలుపు
లెక్కెములు దొనలు బేరులు, జక్కితెగలఁ బొడమటయు వెసం గొని యనికిన్.

తే. మరల నడచెంచి మిన్నంటి మబ్బుతెగల, నడుమ నెవ్వారికిని గనఁబడక యుండి
రాగవునిదండువయి వాఁడు రవళి నంప,వాన గురియుంప వారలార్వక కలంగి.

ఆ. పొదలఁ దూఱువారుఁ బుట్టలమాటున, నీఁగువారుఁ బఱవు లెత్తువారుఁ
దైల్వువారు బొబ్బరించువారును గేలఁ, బోరలువారు నైరి పొంపుదరిగి. 141

తే. అట్టు లెడుపులఁ గుంజెడు చెట్టునట్టు, మెకపుబంటులఁ గని యడ లీమ్మఱ రాచ
పచ్చకన్నులమెకము రావణునితోడఁ, బుట్టువును డాయఁ బిల్చి తా నిట్టు లనియె.

క. జగనులు సెడిపోవుతఱి, న్మొగులతెగ ల్మింట దట్టముగఁ గ్రమ్ముక వా
న గురియుచందమునం జీ, ల్కుగము ల్గురిసెడి నిజేమిగోరము చెపుమా. 143

ఉత్సాహ. అనిన నాతఁ డిట్టు లనియె నయ్య వినుము సోఁకురా
యనియనుంగుఁగొమరుఁ డగ్గి నలరఁ జేసి మేటితే
ర్లను గడింది యేనుఁగులును లొట్టియలును మావులుం
దొనలు విండ్లు నరనికరన దొరకినం జెలంగుచున్. 144

మత్తకోకిల —

నీరుతాలుపుచాల్పులోపల నెమ్మిఁదూఱి మెఱుంగువాల్
నారసంబులు దండుపై జడనంబుగాఁ బఱగించు చే
వారికిం గన రాక యుక్కున వ్రాలి క్రాలుచునున్నవాఁ
డారయం గడు బల్లిదుం డితఁ డన్ని నేలలరాయఁడా. 145

పంచచామరము.—

అనం గొఱంత లేకికిన్క నక్కడింబిజోదు గ్ర
న్ననం బెడంగువింట వాలునారసంబు లూని యే
పునం జెలంగి నింగి యెల్లఁ బొల్పరం గడంగి యే
సినన్ లకోరి యొక్కటైనఁ జెంద దయ్యె వానిపైన్. 146

తే. అందులకుఁ జాల సందియం బంది తేఁడు, వీనిఁ దెగటార్చి రం డని వేగ గఱఁడు
వృషభుఁ డంగదుఁ డీఁదయర్థి దివినుంగు,నలుఁడు మొదలుగ బలియురఁ బిలిచి పనిచె.
క. పనిచిన నబ్బిరుదుమగ, ల్వేను తెరవ్వన నెగసి యుద్ధవిడిఁ జనుచో న
చ్చెనఁటితో లివేల్పు గదుఁ బె, ల్లునఁ బైపైఁ జిలికివాల్ములుపులు నిగుడ్చెన్. 148
భుజంగప్రయాతము.—
నిగుడ్చం బోర ప్లేక నే శ్రేవది యవ్వా
ల్మగల్ గ్రమ్మఱ న్వ్రాలి మట్టేనిమెట్టుల్
జిగు ల్వ్యాఁతగా నిల్చి చేడ్పాటుల న్బి
ట్టుగాఁ గుందుచోఁ సోఁకుడుమ్దుల్వ యూలోన్. 149
తోటకము.—
కొంచక నాల్కలు గోయుచు మంటల్, నించుచు నింగియు నేలయు నెల్లన్
ముంచుక యుస్సున మ్రోఁగుచు వాఁడి, న్మించినపాములమేల్చిలు కేసెన్. 150
తే. ఏమఁటయుఁ బాఁపగములు పెక్కేసి యగుచుఁ, గ్రమ్మి రాముని నాళసితమ్ముగట్టి
సెల్లమూఁకల బిగఁ బట్టి యడిచఁ బుడమిఁ, బ్రేళ్ళి యాందఱు నొగి సొమ్మసిల్లి రపుడు
ఆ. పగ యడంగె నంచు మిగుల దొపముఁగోన, నలరి వేల్పురాచ గెలుపుకాఁడు
గీవి కేఁగి గెలుపుతెఱఁ గెల్లఁ దండ్రికిఁ, దెలియఁ జెప్పి యెలమి సేయఁ జేసె.
క. అంత నచ్చట రాముఁడు గొంతపడికిఁ, గన్నుగవ విచ్చి తోఁబుట్టు వున్న తెఱఁగుఁ
జూచి తద్దయు వనటల స్రుక్కుచున్న, యెడల నాటేసిచెంతకుఁ గడిఁది మీఱ.153
సీ. విన్ను గోరాకూళికెలఁదినీ ర్నినిచిన పసిఁడిజాళీచెంబుపస పొసఁగ
మేపూఁతవెలిబూదిమిసిమి యంటి వెలుంగు సిద్దంపుటలఁతిజన్నిదము లమర
నునుగోళ్లతెలిచాయ నెనసి తస్కలు గుల్కు పటికంపుసరములు బాళి మీఱఁ
బూపతామరవిందుఁ బోల్ప నీడై తగు గడితంపుసిడుదకెంజడలు వఱల
తే. వానకొనతఱిమబ్బు జేర్వలను దోఁడు, మీన నాడెంపుటిట్టితో గ్గా నెసంగ
నోర జగములయెకిమీని పేరు సారె, గొణుగుచును వచ్చె బంగారుపుఁగూటితపసి.154
తే. వచ్చి యన్వేఁడివేలుపుపంగడంపు, జేలమొలత్రాటిసిందుపుంజేటి తాల్పు
మ్రోల సిల్చి కరంబు ప్రేముడి దలిర్ప, నెరవుతోఁ బల్కెఁ గేలుఁదామరలు మోగిచి.
కమలవిలసితము. జగముల మొదయఁడచదువుల మూఁడున్, దగిలినకడఁకవాదలనిను జేతేల్
ముగురకు మొదలకుముదుకఁడ వంచున్, బొగడెదుఁ గద గొనబుగఁ బలుమాఱున్.
స్వాగతము. మేర లేనిపలుమేనులఁ బేరుల్, సారెఁ బూను నెఱజాణలమిన్నం
గోరి నిచ్చలును గొల్తురు నిన్నుం, బోర మైనమునితో జడదారుల్. 157
స్రగ్విణి. చీమలుందోమలుం జెట్టులుంగట్టలుం, బాములుం బుల్గులుంబాదులుంజేఁపలుం
గాములు న్వేల్పులుం గల్గుమేతాల్పులు, న్వేమఱుం బన్నిదా నీవె కా నెన్నుదున్.
తే. వాసిదయ్యము నీవె వెన్నేసి యైన, నలుఁ జేతులఁ గన్ను లజ్జలును గలిగి
యలర లొడితెడుమగవాఁడ వగుచు నేల, యెల్ల నాఁగుమపని మిక్కు టెన్నఁగదవె.

తే. తలఁప నివ్వరిముంటిచందమున మిగులఁ, గొంచెమై కప్పుమొగులలో మించుఁదీవ
పోల్కి మెఱయుచుఁ బచ్చనై పొలుచు తేజు, నీవ కద నిక్కముగ మేటి నేలఱేఁడ.

దండకము.—

అరిదిబిరుదా నీవు రాయంచ తేజీవజీరుండవై చుట్టువాల్దాల్పవై మెట్టువిల్వేల్పవై
శీవితో ముజ్జగం బెల్లఁ బుట్టించుచుం బ్రోచుచుం ద్రుంచుచున్ నీవె జాబిల్లివై
ప్రొద్దవై యుద్దిగా రేవగల్లు న్నెఱిం జేయుచుం దుంకటెక్కెంబురాయండవై
పుష్నియంబు గ్గాల ల్నిచ్చలుం బంచి మెక్కింపుచుం దూర్పునాడేలుమన్నీఁడవై
వానజేఁ బంట లొందింపుచున్ జంటనెమ్మోముల న్దంట వై వంటకర్జంబు సాగించు
చున్ వెండియున్ జేయఁగాఁ గల్గుకర్జంబు లెన్నైననుఁ బల్లూఁపులం బూని కావిం
పుచున్ మాటికిన్ బూటకం బారఁ బేరాటల న్బొల్తు వంచోరి నీమాట ప్రాబాస
వాళ్ళేటు లేర్పాటుగాఁ జాటఁగాఁ జేటగా వీరుల న్నాటి యేనాఁటికిం బాయ
దోసామి నీ కేఁద లా పగ్గి నెమ్మోము రేరాయడుం బ్రొద్దుఁగన్నుల్ మొగల్త్రోవ
నాడెంపుమే న్వేల్పుప్రో లజ్జు క్రొందమ్మిపూనట్టు కుఱ్ఱాడు డెందంబు జేజే ల్బు
జంబుల్ నిరాబారులు న్వింద్రుక ల్నల్వయా ల్నెల్క ప్రాఁబల్కుచాల్త్తల్లి కీల్గం
టు ప్రాబల్కు లూర్పుంగము ల్పాద్రము ల్బొజ్జ మన్నజ్జకెందామర ల్వేల్పువెజ్జు
ల్పిరుందు ల్కడ లీవులై యొప్పునీచొప్పు గావింపఁగా నన్నియు న్నీవయై యుం
దు వాం డెవ్వియు న్నీవు గా కున్న దెచ్చోటులన్ లేదుగా పాముగా బమ్మ
గ్రుడ్డుంగము ల్నీమెయిన్ మేడిపండ్లుంబలెం బ్రోవులై యుండుఁ బో తండ్రి నీ
వెప్పుడుం దుల్వలం గాల్వఁగా సాదులం బ్రోది గావింపఁగాఁ గోరి వేవేలవేసంబు
లెంతేనియుం న్వేడబం బొప్పఁగాఁ బూని రాణింతు వెట్లన్న ము న్నీనుమే నూని
మున్నీరు సొత్తెంచి పెన్నిక్కుచాత్తెక్కలిం జక్కఁ జక్కాడి నెత్తమ్మిపూఁజూలి
నుబ్బింపవా ప్రాఁతజేజేలు దేజారఁగాఁ జేరి పేజాడలం జిడ్డునీర్వామి వే తర్చుచో
మేటితాఁబేటిమే యెత్తి మవ్వంపుఁగవ్వంపుఁగ ట్టూని వేల్పుంగమిం గావవా దేవరా
క్రొవ్వి మ న్నంతయుం గొంచు బల్వాఁపరాముక్కుకుం బ్రాఁకుబంగారపుంగంటిరే
ద్రిమ్మరిం జన్నపుంబందివై చెంది వైళంబ వాల్గోమ్మునం గ్రుమ్మవా గట్టిగాఁ గన్న
తొల్బొట్టెనిం బట్టి యిట్టట్టుగా బిట్టు దట్టింపుచుం జెట్టలం జెట్టుబల్గట్టువారక్కసు
న్వ్రక్కసుబైన పేరుక్కుతో నుక్కుగంబంబునం బుట్టి గిట్టింపవా పొట్టివై నేల
మూఁడజ్జలే వేఁడి పేరన్ జగంబాఁగి చాగంపుఁదొల్వేలుపుం గ్రిందికి న్మట్టవా మెందు
నిండారఁగా జామదగ్న్యుండవై గండ్రగొడ్డంట ముయ్యేడుమా ర్లేచి గయ్యాళిరా
పిండులం జెండుచెండాడవా దేవరా యిప్పు డిచ్చాలుపున్ గుత్తుక ల్గల్గుప్రాపేలుపుం
గూలుపం గోరి యీరైదుబుఱ్ఱెక్కు రాకల్వసంగాతికిం గూనవై పుట్టి యున్నాఁడ
వీ విట్టు లోఁ దెల్వి యొక్కింతయు న్లేక క్రుక్కంగ నిం కేల నీజక్కియై యు
క్కునం గేరునప్పెక్కురాకెక్కఱేనిం దలంపంగఁ గర్జంబు లెన్నేనియుం జక్కనై

సాగు: బొమ్మంచు నెయ్యంబులోఁ జెప్పి శేషేనిరాజారి యొందేనియుం బోవ రా
చూలి దా నప్పు డాగూఁడు కాన్పుందొరం గూర్మి డెందంబున న్నిల్పుడున్. 161

చ. గడితపుఁజెక్కుగాడ్పుల జగంబు లగడ్పడి తాఱుమాఱుగాఁ
గడలిగము ల్కడుం దొనఁకి కట్టడికట్టలు దాఁటి పాఱఁగాఁ
బుడమి గలంగ వేవలలు పూనెడుపాము దలంకి పాఱఁగాఁ
దడయక వచ్చె వేలుపులదారికి పాములవేటకాఁ డొగిన్. 162

క. వచ్చినఁ బొడగాంచి పెనల్, విచ్చుకొని కడుం దలంకి విషదారిగము
ల్వెచ్చున్నొగయి కడలకు, విచ్చలవిడిఁ బఱచెఁ గట్లు వీడెం బజకున్. 163

ఆ. అపుడు పుల్గురాయఁ డర్మిలిఁ బుడమికి, డిగ్గి నేలఁబేనిడొంవ మలరఁ
జేసి మరల మింటఁ జెచ్చెరఁ బఱతెంచె, నెలమితోడ మూఁక లెల్లఁ బొదలె. 164

ఆ. అంతఁ బొడుపుఁదిప్ప నంతయుఁ గడఁకతో, జక్కఁదాయపడగసామియబ్బ
వాడమటయును బొంగి యడవిద్రిమ్మరిజోదు, లార్పు లెసఁగ లంక కరిగి రనికి. 165

క. అరిగినఁ గని వేగులవా, రరుదారఁగ దీవిఱేనియందకుఁ జని వా
విరి నత్తెఱఁ గెఱిఁగించినఁ, గరము వగం బొందె నతఁడు కళవళ మొదవన్. 166

ఆ. ప్రెగడపెందు నెల్లఁ బిలిపించి వింటిరే, యిట్టికడిఁది మీర లింద్రజిత్తు
చేతిచిలువత్రాళ్లఁ జెయు వేది పోలసిన, కోఁతిబంట్లు మరలఁ గూడి రనికి. 167

సీ. అని పల్కి ధూమ్రాక్షుఁ డనువాని దురమున కనిచిన నతఁడు లా వదర మూఁక
లేనుఁగు ల్గుఱ్ఱము లెడపక తోడ రా నక్కజంబుగఁ బైఁడి యరద మెక్కి
యడవిద్రిమ్మరులపై నడచిన నిరువాగువారును దాఁకొని వాఁడి మీఱఁ
బోరాడు నెడ నేచి పోలదిండిబంటులు కొండద్రిమ్మరిబంట్ల నండగొనఁగ

తే. బల్లెములఁ గ్రుమ్మి మావుల బఱపి నఱికి యేనుఁగులఁ దోలి మట్టించి యినుపగుదెల
మోఁది నెఱకులు వాలుటమ్ములఁ బగిల్చి, బిట్టు నొప్పింప నజ్జగజెట్టు లలిగి. 168

లయగ్రాహి.—

గట్టులును జట్టులును జెట్టులును బట్టుకొని నెట్టుకొని రక్కసులఁ జుట్టుకొని ఱొమ్ముల్
మట్టియును దోఁకలను గట్టియును మాత్తడలు పెట్టియును దట్టమగు గట్టిపగ మీఱన్
బొట్టలును జట్టలును బిట్టు పగిలించి పలునెట్టులను నొంచి జముపట్టునకుఁ బోవన్
జెట్టి కడు నేనుఁగుల లొట్టియలఁ దట్టువలఁ జెట్టువలఁ గొట్టుటయుఁ గట్టలుకతోడన్.

క. నలుపు గలతొవరుకన్నుల, పొలమేపరి కొమ్మమెకపుఁబోటరులపయిన్
జెలఁగి యరవంబు పఱపుచుఁ, జలముగ నెదిరించి యంపజడి యొనరించెన్. 170

క. ఒనరింపఁ బిచ్చలింపక, మునుకొని యయ్యడవిమనికి మొనగాం డ్రతనిం
జెనసి పెనుగట్లుఁ జెట్లును, జెను పొదవఁగ రువ్వుటయును జేదక వాఁడున్. 171

తే. తేడు వడిఁ జొన్ప యిఁకఁ గడతేరఁ డనుచు, వాఁడితూపులు దఱుచుగా వానిమీఁద
వేయుటయు ద్రుక్కి కోఁతుల సేయ లేక, పఱవఁ జూచినఁ గని గాడ్పుపట్టి గినిసి.

తే. ఉరువు మీఱఁగ మానిమ్రా నొకటి వెఱికి, రక్కసుని వైవ బెదరక యుష్కాతునియ
బలిమిమై నది యొకదొడ్డపాఱవాతి,తూపునఁ గడంగి నడుమనె తునియ వైచె.

ఆ. వైచుటయును జింకవార్వపుజోదుబి,డ్డండు వెండియును గడంగి వాని
తేరుగడపువాఁడుఁ జేరును గట్టిము, ల్చదియ నొక్క పెద్దచట్టు వయిచె. 174

క. అటుల నరదంబు వోయిన, దిటము సెడక పుడమి కుఱికి దిగ్గన నయ్యో
క్కటిజో దొకపెనుబడియం, దటుకున నక్కోఁతిమిన్నతల నో నడిచెన్. 175

తే. అందులకుఁ జాల సెదలోన నలుక పూని, జబ్బ లుబ్బఁగ నక్కోఁతిబొబ్బమెకము
కొండకొనతున్క పేగ నొక్కటి పగిల్చి, వానితలమీఁదఁ జవియంగ వైచి చంపె.

తే. అట్లు ధూమ్రాక్షుఁ డని నీల్గినట్టి తెఱఁగు, సోఁకురాయఁడు విని కద్ద సోలి తెలిసి
వడి నకంపనుఁ డనియెడువానిఁ బిలిచి, యచ్చెనంటులఁ దునిమి రమ్మనుచుఁ బలికె.

క. పనిచిన నతఁ డెన్నిక మీఱిన పోఁజులఁ గూడుకొని నెఱిఁ దురమునకున్
జన నచ్చెట్టున్ ద్రిమ్మరి,మొనగాఁడులు కాలవాన మొగిఁ గురియుటయున్. 178

క. మిక్కుట మగుకొఱకొఱ న, య్యక్కిఁవ్రుఁ దరదంబు పఱపి యుఱుపడిఁ దూపు
ల్పెక్కు నిగుడ్చుచు మూఁకల, నొక్కటఁ బురికొల్ప వార లుక్క దలిర్పన్. 179

సీ. తేరులు పఱపి యేడ్తెఱఁ దూపు లడరించి పడి గలమూవుల వయిచి నఱికి
యాముటేనుఁగులఁ బాయక డీకొలిపి వ్రగ్గఁ ద్రొక్కించి యినుపపెట్టెదడ్ల నడిచి
వంకుల జముదాళ్ల వాల్బిస్లెములఁ గ్రుమ్మి పయికొని పెద్దయీఁటియలఁ బొడిచి
గండ్రగొడ్డండ్ల నుక్కఱఁ జెండుబెండాడి మొనలకైదువుల బొమ్మలు వగిల్చి

తే. మిగుల నొప్పింపఁ గనలి మ్రానొకపుబిసుదు,లొక్క మొగి వాండ్రఁ బోనీక చిక్కఁబట్టి
పొడిచియడిచియుఁదాఁచియుఁబుడమివయిచి, మట్టిగ్రుద్దియుఁగఱచియుమడపిరపుడు.

ఆ. గండు మీఱ నయ్యకంపనుఁ డఱిమఱిఁ, దూపు లేసి కోఁతిదొరలఁ గలఁచి
కనుపుగొట్టుచున్నఁ గనుఁగొని జగముల, యుసురుకందు లోన నులుకు నిగుడ. 181

ఆ. మోటమద్ది యొకటి మురిఁ బెకలించి య,మ్మేటిసోఁకుజోదుమీఁద వయిచి
నుదమదంబు చేసి కొదుకక సింగపు,రొద యొనర్చె మూఁక లాదవి పొగడ. 182

క. అంతట నప్పని యారే,న్గొంతుకలగయాళివేల్పుగొంగ విని మదిం
బంతము నిగుడఁగ నెంతయు, వంత మహాకాయు నసికి వడిఁ బుచ్చుటయున్.

సీ. బలుహజ్జమెకపుదాఁటులు సిల్కదట్టంపుటామడిసీరున చేల యసలు గొనఁగఁ
దత్తడిడెక్కగ్రుద్దలిప్రక్కలింకల నెగసినదుమ్ము మిన్నెల్లఁ గప్ప
మెండుమీటెడుబండికండులయొఱపునఁ జిలువలయేకిమీఁదు దలలు ముసువఁ
గాలరిపోఁజువెక్కసపుటార్పుల జంట చవువంచకదలుచు బెవ్వడుపడఁగఁ

తే. గఱకుటడిదంపుబెడిదంపుమెఱుఁగుగములు,మిగులఁ జూపఱచూడ్కిమిఱిట్లుగొలుపఁ
బొసఁగఁ బదినూఱ్లతత్తడు లూనినట్టి, పసిఁడితేరెక్కి పోరికి బయలువెడలె. 184

ఆ. వెడలి కోఁతితుటుము వొడరిన బిఱబిఱ, కొండు మొనలు జెరసి గండు మెఱయఁ
బోరుచున్న యెడలఁ బొలవింఁడిపోటుసు, లడవి నెలవు బంట్లఁ గడిమి నలమి. 185

చ. ములుకులఁ జిమ్మియుం గుదెల మోఁదియు నీఁటెలఁ గ్రుమ్మి కత్తులం
జెలఁగియు మావులం బఱపి చెండియు మోములు గాళ్ల డొక్కలుం
దలలును జేతులుం దొడ లెద లైదలున్ నడుముల్ పిఱుందులు
న్నలి యొనరించి క్రొమ్మెదడు నంజుడు నల్లయి నుల్లఁ జేసినన్. 286

ఆ. ఇవముసూడుకొలపుటెకిమానిబంటు ల, క్కజపుమగతనంబు గడలుకొనఁగ
నార్చి ఱేని కెలమిఁ గూర్చుచుఁ దూఱి యా, సోఁకమూఁక నెల్లఁ జొట్టుముట్టి.

ఆ. తేరితోడఁ దేరు తేజితోఁ దేజి యే, నుఁగుతోడ నేన్గు ద్రుంగఁ గొట్టి
బంట్లఁ బద్దెఱఁగులఁ బరిమార్చి వైచినఁ, జూచి దొడ్డయొడలిసోఁకు దలఁగి. 188

చ. అరదము దోలి వింట గొనయంబు దవిల్చి మెఱుంగుటమ్ము ల
బ్బురముగఁ బూన్చి యయ్యెఱియబంటులనిద్దపుమేను లెల్ల వా
విరి నలియంగ నేసి గొడివెల్ జెరయించిన సైఁప నోప క
బ్బిరుదుమగల్ వడిం బరువు పెట్టఁ దొడంగిన నంగదుం డొగిన్. 189

క. నిలుఁడు నిలుఁ డనుచు వారలఁ, బోలుపుగఁ జెనఁకుపసు మగుడఁ బురికొల్పుచు న
త్తులఁ పలోలిపేల్పుఁ బైకొని, బలితపుమ్రా నొకటి మీఁదఁ బడ వైచుటయున్. 190

క. నొప్పివడి వాఁడు దద్దయు, నుప్పర మద్రువంగ నార్చి యొకవాలుందూ
పప్పాలముద్రిమ్మరిపయి, న్గప్పిన నడరింప సొమ్మగొని యుండు నెడన్. 191

సీ. గుబ్బలి ద్రిమ్మరి ల్గొందఱు చెట్టులఁ బదుకులఁ బూని యగ్గదుసునల్ల
ద్రావుడుబిరుదుపైఁ బోవ నాతఁడు శతవలి నైదుములఁకులం బనసు నేడు
తూపుల వృషభుని దొమ్మిదిచిల్కుల నలి గవాక్షుని నూఱునారసములఁ
గ్రోధను నీరైదుకోలలఁ బృఘుని మూఁడమ్ముల గజుఁ బదియాఱుపదుల

తే. బలులకోరులఁ దక్కనపాలముమసికి, బంట్ల నొక్కొక్క చిలుకునఁ బడలువడఁగఁ
జేసి యార్చిన నంత జేజేలజేని, యనుఁగుమనుమఁడు తెప్పఱి కినుకతోడ. 192

క. మామిడిచెట్టొక్కటి పె, ల్లా పడరఁగఁ జెఱికి యాచెనఁటియరదమ్ము
న్మావులు విల్లును దుమురై, పోవఁగ వైచిన నతండు వాలివాఁసబిగిన్. 193

చ. పుడమికి దాఁటి బల్గుదియఁ బుచ్చుక నెవ్వఁడిఁ దారబోదపైఁ
గడఁగిన నాతఁడు న్గదియఁ గైకొని పైకొనె నట్టు లిద్వరుం
జెడనికడంకతోఁ గొదమసింగములట్ల నెదిర్చి పోరలు
న్దొడలును వీఁపులుం దలలు నొవ్వఁ గడిందిగ మోఁదు లాడుచున్. 194

సీ. విడుచుచుం బట్టుచుం బొడుచుచు నడుచుచుఁ దన్నుచు గ్రుద్దుచు దాఁటుకొనుచు
నొగయుచు మొగియుచు నేలఁ ద్రెళ్ళుచుఁ గ్రిందుమీఁదై పెనఁగుచుఁ బాదుకొనుచు

నార్చుచుఁ బేర్వాడి యదలింపుచుఁ గదంక నెఱపుచు బుజములు చఱచుకొనుచు
నీసడింపుచుఁ గన్ను లెఱ్ఱఁజేయుచు బుసకొట్టుచుఁ బకపక బిట్టు నగుచు

తే. నెత్తురును దుమ్ము మేనుల నత్తుకొనఁగఁ, బెక్కుదెఱఁగులఁ బోరుచో నుక్కు మెఱసి
వాలికఱ్ఱఁడు పిడికిట వాని నెత్తి, బీటలుగ గ్రుద్ది పడ వైచి బిఁటుకుమార్చె. 195

క. అత్తఱి నీల్గక చిక్కిన, నెత్తురుద్రావ్వడులవలన నెవ్వడిఁ జాల్పన్
గుత్తుకలరక్కసుఁడు విని, మెత్తంబా టూని లోన మిఁకుల నడలుచున్. 196

క. నేస్తంబు మెఱయ నపుడె ప్రహస్తుని రావించి బలియుఁడా యిపు డెవలోఁ
గస్తి విడఁ బుడమికానుపు, గేస్తుని గీటడఁచి రమ్మొగిని నీ వనుచున్. 197

సీ. విసువాలితేజీలఁ జెనయుమావులతోడ మొగిలుచెన్నారయు నేనుఁగులతోడ
గట్లతో నుద్దియౌ క్రాలుతేరులతోడ బలిమిసూపెడుపోటుబంట్లతోడ
ముజ్జగంబు పదంక మ్రోఁగుదేరులతోడఁ గొమరారుబిరుదుటెక్కెములతోడ
జొంపంపుఁదెలిముత్తియంపుటెల్లులతోడఁ దులకించుచికిలికైదువులతోడ

తే. మేలిరతనంపుఁబనిపల్లకీలతోడఁ, దోర మగుపైఁడికాశెలతోడఁ దఱుల
మొకపుమెకములపై హెచ్చరికల వెడలె, నప్పు డిరుదెగమూఁకలు నసికిఁ దొడరి.

చ. చిలుకుల గట్లఁ గైదువులఁ జెట్టుల ద్రుడ్ల నొడస్ల నజ్జుగాఁ
దలకొని మొత్తులాడి బెడిదమ్ముగ నెత్తురు టేఱులై చనం
జలమునఁ బోరుచో మలహజారపుజోదులు సోఁకుమూఁకలన్
బొలుపఱఁ జేసి యాంజమునిప్రోలికిఁ గావలి యన్న నత్తఱిన్. 199

సీ. అలుకతోడఁ బ్రహస్తుఁ డమ్ములజడి గురియించి పోఁజుల నెల్ల నొంచుచున్నఁ
గనుఁగొని నీలుఁ డక్కఱుకురక్కసువిల్లుఁ దేరును మావులఁ దేరు నడపు
వానిని నొకతాడిమ్రానునఁ జదిపినఁ బుడమికి దాఁటి యప్పొలసుదిండి
తూపుల నాబిరుదునొసలు నొప్పింపఁ గనలి యక్కోఁతిసింగంబుఁ బెద్ద

తే. పడు కొకటి దెచ్చి నడునెత్తి పగులవైచి, వానిఁ బోకార్చి నెమ్మది పఱల బూచి
గముల కామెత లొసఁగె నక్కస మెసంగి, రావణుఁడు దద్ద యొఱలి బీరమ్ము హెచ్చ.

క. పడవాళ్లఁ బిలిచి మూఁకల, వడి దురమున కేఁగుదేర వలె నని నేమం
బడర నెఱిఁగింపుఁ డని పడి, కడ లద్రువఁగ బేరి ప్రేయఁగాఁ జేయుటయున్. 201

ఆ. తేరు లందలములు దేజీలు నేనుఁగు, ల్మొదలు గలుగువాని ముఱి యెలర్ప
నెక్కి యక్కజముగ రక్కసినెఱజోదు, లెలమిఁ జేరి మ్రోల నిలిచి రంత. 202

సీ. వెల లేనిరతనంపుబలుదొడవులు వెట్టి తోరంపుఁజికిలికైదువులు గట్టి
పొసఁగ నౌదలల పొన్నుమిడికమ్ములఁ బూని డాకాల గండపెండర మమర్చి
తళతళ మెఱయుపుత్తడిపుట్టములు దాల్చి కేల మున్మొనవాలు గీలుకొల్పి
కమ్మకస్తురి సిరిగందంబు మెయిఁ బూసి యెద వేల్పుమ్రానుపూవుటెత్తు లునిచి

తే. పసిఁడిబెత్తులవాండ్రు రుదసలఁ గ్రమ్మి, హెచ్చరికల బరాబరు లెనసి సేయ
పొడుపుఁగుబ్బలిపైఁ బ్రొద్దు గడఁకె నెక్కు, కరణి నవ్వేలుపులగొంగ యరద మెక్కె.

సీ. జగములదిగుల నిచ్చలపుమేలిమిగట్టు కుఱ్ఱవేల్పులకలగుండుగండ
ప్రావేల్పుమన్నీఁడ బమ్మదేవరమెప్ప సెలతాల్పుకొండ పూనినబలియుఁడ
జేజేలదొరపాలిచిచ్చుఱపిడుగ వెగ్గలపుదురంబుల గెలుపుకాఁడ
కడిదివాల్మగఁడ బంగరుదీవిరాయఁడ టక్కరియెకిమీండ్రముక్కుఁగొయ్య
తే. గొనకుటచ్చరననఁబోండ్లనసుపుకాఁడ, కడమ యొదవనికీవుల నదటుఱేఁడ
గెలువు గెలువు మటంచు నగ్గించుబిరుదు,పద్యములు బట్లు సదువుచు బలసి చనఁగ.

సీ. బేరులు డోళ్లు తప్పెటలు కాళెలు పిల్లఁగ్రోవులు తుదుములు కీవి మెఱయఁ
బడిగలు ముత్యాలగొడుగులు జల్లులు నాలపట్టములు సొంపారి మెఱయఁ
బసిఁడిపక్కెరలబాబాలు మానికపుఁజౌ డోలిలమేనుఁగు లోలిఁ జెలఁగ
విచ్చుఁగైదువులు బల్వాండ్లు సీఁటియ లూని యార్చుచుఁ బోటుబంట్లగలింపఁ
తే. బుడమి పఱియలువాఱ నల్లడలు నద్రువఁ, జెనుదుమారంబు మిన్నెల్ల బిట్టు గప్ప
జగము లదఁగింపఁ గడఁగెనుజమునిమాడ్కిఁ,బొంపు రాణింప వడి నాలమునకు దరలె.

తే. తరలి రాచూలిదండుపైఁ దారసిల్లి, మూఁక నొండెత విడియించి వీఁకఁ దానె
యని యొనర్పఁగఁ దొడఁగిన నదవిగీము,బంట్లు మ్రాఁకులుఁబనుకులుఁబట్టుకొనుచు.

క. దురమునకు మొనయుటయు నతఁ, డరుదుగ వాల్మొలుకు లేసి యందఱఁ గ్రొన్నె
త్తుర జొత్తిల్లం జేయుచు, నరదము వడిఁ జొన్పి తఱిమి యార్చుచు రాఁగన్.

చ. కనుఁగొని ప్రొద్దుకట్టుఁ దలుక న్నల యొక్కటి రెండు చేతులం
గొని కద లన్నియుం బగులఁ గూఁకలు పెట్టుచు వానిమీఁద గు
ప్పిన నవి నుగ్గుగాఁ బసిఁడిపింజ లమర్చినతూపులిట్టలం
దునిమి పిసాళిరక్కసుఁడు తోడనె వేల్పులు పిచ్చలింపఁగన్. 208

ఆ. బొమ్మ గాఁడి పాఱ నమ్ముల నేసిన, సొమ్మ వోయి మేటిసొమ్మమొకపు
బిరుదు రాగిజుట్టుపిట్టతాలుపువాలుఁ, గోలఁ గొంచగట్టువోలె వ్రాలె. 209

సీ. వ్రాలినఁ జూచి గవయుఁడు గవాక్షుండు జ్యోతిర్ముఖుఁడు సుదంష్ట్రుఁడు నలుండు
గజుఁడును వృషభుండు గనలుచు నొక్కటఁ జెనుమెట్టు లఱనిపై మొనసి వైవ
నదుమనే వాఁ డవి వెదఁదవాతిలకోరిగుంపునఁ దునిమి యెద్దురి నొకొక్క
చిలుకున వడి సొమ్మసిలఁ జేసి తోడనే మూఁకల నెల్లఁ జీకాకుపడఁగఁ
తే. దూఱ నేసిన గాసిలి పాఱి వార, లురువడిని వ్రాలి రామునిమఱువు సేరి
బొబ్బరించిన నప్ కెల్లఁ బోవఁ బఱచి, యప్పుడు రాచూలి సరగ విల్లందికొనుడు. 210

క. అన్నకు మున్నుగ బలితపు, మున్నరక న్లక్ష్మణుండు మొగిఁ దొలిజేజే
మిన్నకుఱు నదరుచోఁ గని, విన్నుమునుమఁ దతనిఁ బ్రోచి వెసఁ దా ఇదిరెన్. 211

ఆ. ఎదిరి తేరిమీఁది కెగసిన నరచేత, వాఁడు వ్రేయ నొచ్చి వాఁడి సెడక
మరలి వాని నడిచి మంటికి దాఁటిన, వేల్పుగొంగ సోలె వేల్పు లలర. 212

తే. సోలి మెల్లనఁ దెలిసి యాసోఁకుఱేఁడు, కోఁతిరాయనిఁ బిడికిట గ్రుద్దుటయును
బొలసుమేపరు లార్వ నప్పోఁటుకాఁడు, కడకఁ దిగఁద్రోచి చయ్యన పుడమి వ్రాలె.

తే. అంత నీలునిపైఁ బఱియల్లజోదు, తేప వోనిచ్చి బలువాలునారసములు
నినుప నవి యొడ్డుకొని వానినెత్తితోడవు, మానికములూడనవ్వాడిమగఁడుదాఁచె.

క. తాఁచిన మో మెఱవాఱఁగఁ, జూచుచు నిఁగలపుమలికి సోఁకుడుమన్నీఁ
డాచెట్టుంద్రిమ్మరిపై, వైచిన నొడ లెల్లఁ గమరి పడి సొమ్మసిలెన్. 215

తే. అట్టు లాతఁడు పడిన బిట్టార్చుకొనుచుఁ, దేరు లక్ష్మణుపైఁ దోలి దీవిరాయఁ
డేను జెడిదంపువాల్తూపు లేయ నతఁడు, మెఱుఁగుటమ్ముల నవి తోన నఱికివైచి 216

క. తఱి చగుచుఁ బింజపింజయుఁ, గఱచుక మిఱుఁగుఱులు సెదరఁ గమిఱితలచా
త్తెఱఁగున నడరెడుచిలుకలఁ, గిరిగొనఁ బఱపుటయు వాఁడు గిజగిజపడుచున్. 2.7

తే. మున్ను నెత్తమ్మివాలిచేఁ గొన్నయట్టి, సత్తి యనుతూపు నిగుడింప సరగ ఱొమ్ము
దూఱుటయు సొమ్మసిలి రాముతోడఁబుట్టు, వొఱగెఁ బుడమికిఁ గోఁతులువెఱచిపఱవ.

క. అత్తెఱఁగున సైదో దని, నత్తమిలినఁ జూచి రాముఁ డలుక నిగుడఁగా
నత్తొలివేలుపుఁగలుపల,మిత్తురు డాకొని కడుంక మీఱఁగ బలికెన్. 219

ఆ. ఓరి రవళికాఁడ యోడక మిగుల నా, కెగ్గు చేసి తింక నెందుఁ దూఱఁ
గలవు నలువ వచ్చి కావఁ బూనిన నిన్నుఁ, జూడిఁగి పోవనీక మడఁపువాఁడ. 120

తే. అనినఁ దద్దయు నలికి యీరయిదుతలల,రక్కసుఁడు రాగవుని కప్డు ఒక్కఁ డైన
గాలికొమరునిపైఁ జెక్కువాలుతూపు, లేసె నేసినఁ గినిసి యవ్వాసిఱేఁడు. 221

సీ. బలితంపుఁగ్రొవ్వాఁడిములుకులు సింగాణి గూరిచి యరి సెదికొనకు లాగి
పొలదిండిఱేనిమావులు దేరు కైదువు లరదంబు సాగింపునతఁడు సిడము
గొత్తలంబును మ్రగ్గఁగా నేసి వెండియుఁ బిడుగుల కెన యైనవెడఁదతూపు
కొని ఱొమ్ము పగిలించి కొంకఁ జేసి కడంక నరచందమామవాలమ్ము పఱపి

తే. బొమిడికంబులు పదియును బుడమిఁ గూల్చి,బన్న మొందింప జెగడి యప్పొలసుండు
వేల్పొకని తేరిపైఁ బడి పాఱి చనదు, దీవి సొచ్చెను రాకాసితెగలు వొగుల. 222

తే. అంత రాముఁడు దన మొనయందు సొమ్మ, సిలినజోదుల మందులవలన మనుపు
కొని వెలుఁగుచుండె వేల్పులగొంగ యటులఁ,బాఱి చని దీవిఁ గొలువుండిపంతమెలయ

క. మానిసిదిండులఁ గనుఁగొని, పూనికతోఁ గడవచెవ్వులపోటరి నిపుడే
వే నిదుర దెలిపి పోరికి, లే నెత్తుఁ డటంచు నర్మిలిం బనుచుటయున్. 224

క. ఆఱేముటి వారలు నని మే, నెఱుఁగక నిదురలను నూర్పుటేఁదలు గొఱలం
గుఱువెట్టుచుఁ గొండవలె, న్వెఱఁ గొప్పఁగ నున్నతుండపేనులజోదున్. 225

క. కనుఁగొని పలుదెఱఁగుల డా, గొని లేపఁగ నతఁడు గుదుసుకొని పెన్మలలా
గునఁ దరలక యుండిన బో, రన బూరలు దేసులును గరంబు చెలంగన్. 226

తే. గొల్లుగాఁ గూఁక లిడుచు గగ్గోలు సేసి, లేవ కుండిన విసికి యూలెంక లినుప
ద్రుద్దగుదియలఁ బిడికిళ్ల రోఁకటులను, మొత్తి బలితంపుఁజెట్టపై నెత్తి మఱియు.

క. కఱచియుఁ జఱచియుఁ గాదుల, నిఱికియు గట్టముల నాముకేనుంగులఁ బైఁ
బఱపియుఁ దాఁచియు మీసలు, పెఱికియుం జూనియలఁ గాఁచి బిట్టు చిఱికియున్.

ఆ. మేలుకొలుపుచున్న మెల్లనే యించుక, పొరలి చిన్నవల్లి పొడిచె నంచు
లేచి కూరుచుండి లెంకలఁ జూచి మీ, రేమి వచ్చినార లిచట కనుడు. 229

క. వా రందఱు దరిఁ జేరి జో, హారులు గావించి దేవియానతి యెల్లం
జేరిమిని దెలిపి సంతస, మారఁగ నమ్మేటిమగని కాఁకలి దీఱన్. 230

తే. మేర మీఱినగొఱియల మేఁకగముల, గొఱియపోతుల నఱికి ప్రోగులుగ నిడ్డ
వెగ్గలపుఁబచ్చినంజుళ్లు వెల్లిసిల్ల, దోరహత్తుగ నిడఁ గడుపార మెసఁగి. 231

ఆ. అపుడె తరలి యాతఁ డన్నకడకు వచ్చి, మ్రొక్కు లిడినఁ జూచి పెక్కుచంద
ములఁ బొసంగ నాడి పొలదిండిరాయఁ డ, ప్పోటుగానిఁ గయ్యమునకుఁ బనిచె.

చ. పనిచిన జంగ సాఁచి యొకపాటియె కోటలు దాఁటి యేడ్తెఱం
జనుటయు వానిఁ జూచి పెనుసత్తియొ మిత్తియొ వచ్చె నంచు ప్రా
న్నసికిపఱీసు లెల్ల నిసుమ త్పైరయ స్వడిఁ బాఱె బాగుగా
వినుచనంపుబంగడపువెన్నెలరాయనిముఖ్య సేనల్. 233

తే. ఓడనుఁ దటంచు నయ్యోకిమీఁదు వారి, మగుడఁ బోరికిఁ బుఱికొల్ప మగటిమంబు
మెఱయఁ గెంగేల విలు గొని పఱలుచుండె, నప్పు డాఁకకుఁ సుఁడు నోలమాసగొనక.

తే. కొడమబెబ్బులి వే లేచిపడువుమీఁద, దాడి వెడలు తెఱఁగునఁ దఱుల మోర
మెకపుబంటులపైఁ జేర్మిమీఱ మొనల, వాలు ద్రిప్పుచు నడరిన వాంద్రు జెగడి.

క. బలుగాలిఁ దూలుమబ్బులె, గలచాడ్పునఁ బఱచుచున్నఁ గనుఁగొని రోహో
నిలుఁడు నిలుం డనుచు న్వే, ల్పులదొరమునుమందు మరలఁ బుఱికొల్పుటయున్.

మ. అసికిం గోల్తలఁ జేయు వా ర్నడుచుచో నక్కుంభకర్ణుండు డా
కొని కైముష్టినకై దువ న్మెదదులున్ గ్రొవ్వాం గళాసంబుల
న్బుసుకల్ నంజుడుఁ బ్రేవు లెమ్ములు నరంబు ల్గుండెలు న్పోవులై
తనర న్నెత్తురు లేఱులై పఱవ ప్రందం జేసి పెల్లార్చుచున్. 237

తే. ఒక్కవ్రేటున నూర్గు వేలోలిఁ గూల, వ్రేయుచును గాళ్లఁ జమరుచు వాయిదెఱచి
మ్రింగుచును గౌఁగిటను బిగియంగ నొత్తి, నలియఁ జేయుచు నున్న బిట్టలుకతోడ.

క. చలినట్టుపట్టి బలుగు, బ్బలి యొక్కటి దెచ్చి వానిపై వ్రేయుడు న
త్తులువ మొనవాలుచే న, బ్బలియునియెద పొడిచి సొమ్మసాలుగఁ జేసెన్. 239

సీ. అది చూచి నీలుండు గొదుకక యొకపెద్ద మల వానిపై వ్రేయ నలిగి నూఱు
తునియలై పడ దాని దూకొని పిడికిట నాతండు వొడిచిన నపుడె మఱి వృ
షభుఁడు గవాక్షుండు శరభుఁడు నలుఁడును గంధమాదనుఁడును గడఁగి గొప్ప
పడుకులు మ్రాఁకులు నెడపక వైచి నొప్పించినఁ దలఁక కబ్బిరుదుమగఁడు
తే. వారి నేవ్వరి సొమ్మ వోవంగఁ బొడచి, చూడ్కి కగపడ్డకోఁతుల జుణుఁగనీక
మ్రింగఁ జాగినఁ దద్దయు మిడికి పవలు, నేయువేలుపుపట్టి యచ్చెనఁటిఁ బొదివి. 240

క. గుబ్బటికొమ్మొక్కటి గడు నిబ్బరమునఁ జెఱికి యాతని నైవ్వచిన వాఁ
డుబ్బు నెడక మల ద్రిప్పురి, జెబ్బుటిపయి మొనలువాలు పేర్మిక్ వైచెన్. 241

తే. వైవ గాడుపుకుఱ్ఱఁ దవ్వాలు నడుమఁ, బట్టుకొని కిన్కఁ మ్రోఁకాలఁ బెట్టి విఱిచె
నంపులకుఁ జాల రక్కసుఁ దలిగి తమ్మి, నంటుకొమరుని సొమ్మ గొనంగ నడఁచె. 242

ఆ. అడిచి యతని మూఁపునం దిడుకొని డీవి, కరుగుచున్న మంచియత్తకొమ్మ
మెకపుమిన్న దెలిసి మెల్లన వానిపే, నులుసు ముక్కుఁ గొఱికి యొలమి నరిగె. 243

క. అఱిగినఁ గనుఁగొని రక్కసుఁ, డరు దందుచు మేను రోసి యప్పుడె యనికిన్
మరలి యొక యినుపద్రుద్దునఁ, బరిగొని యక్కొన తెంకిబంట్లఁ జదుముచున్. 244

సీ. కడఁకమై వే నారికెడపుబొండములట్లు జెట్టివంబుగఁ దల ల్వీలుకొనుచుఁ
దులకించునించుగోలల తెఱఁగున నంతసము మీఱఁ జేతులు నములుకొనుచుఁ
దియ్యని క్రొవ్విరి తేనియచాడ్పున గొదకొని నెత్తురు ల్గ్రోలుకొనుచు
బలితంపుజున్నుబిళ్లలచందమునఁ గ్రొవ్వ మెదడును నోరూర మ్రింగికొనుచు
తే. మొనసి తనవారుఁ జెఱవారు నని తలఁపక, యబ్బురంబుగఁ దన కగ్గమైనవారి
నేచి కుత్తుకబొఱియలో వైచికొనుచు, మాటెచటలేనికడిమిఁ ద్రిమ్మరుచు నుండె.

తే. అపుడు రాముఁడు వానిపై నడరి వింటి, నారి మొఱయించి కఱుకువాల్నారసములు
పెక్కు వఱపినఁ దలఁక కబ్బిరుదు గేల, ద్రుడ్డు ద్రిప్పుచు రాచచందురునిఁ దొడరె.

చ. తొడరిన వెండియుం గినుకతో నెకిమీఁదు మెఱుంగుటమ్ము ల
గ్గడునరిసోఁకుమిన్న మెయి గాఁడఁగ నేసిన నొచ్చియుం జలం
బడరఁగ నాతఁ డొత్తుకొని యార్చుచు రాఁ గని గాడ్పుతూపు నె
వ్వడిఁ బరఁగించి చేయి దెగవైచెఁ గడిందిగ రాముఁ డత్తఱిన్. 247

సీ. తెగ వ్రేయ వాఁ డెడఁ బొగిలి రెండవచేత నొకమ్రాను గొని వచ్చుచున్నఁ జూచి
రామాలి వేలుపురాచిల్కు నిగిడించి యాచెయ్యి దెగవైచి యపుడె సాము
నెలముల్కి వోయి నిచ్చలముగాఁ బఱఁగించి కాళ్లు రెండును ద్రుంచి కలువదాయ
కూనతూపేసి బల్గుబ్బలిచివరతో దిను సైనయప్పొలదిండిమేలు
తే. బలియాదల పుడమిపైఁ బడఁగ నేసె, నేయుటయు రక్కసులు గొంద ఱేఁగి వరుస
కుత్తుకల రేయి ద్రిమ్మరి కత్తెఱంగు, గదిసి వినిపింప గుండియ ల్వెదరి యతఁడు. 248

తే. పలువెఱంగుల నైదోడుబంటుతనము, లెన్నుకొని నేలఁ బొరలుచు నేడ్చి యేడ్చి
సొమ్మసిలి కొంతవడికి దిటమ్ము మెఱయఁ, జెలసి కూర్చుండి తద్దయుఁ జల మెలర్ప.

సీ. దేవాంతకుండు త్రిశిరుండు నతికాయుఁడును నరాంతకుఁడు నాఁ దనరు కూర్మి
పట్టులఁ బగ మహాపార్శ్వ మహోదరుఁ డో డిసి యనికిఁ బోఁ దోలుటయును
వార లాఱుగురును మేర మీఱినమూఁక తోఁ జని కోఁతులఁ దొడరు నెడల
నిరువెఱంగులవారు నెరసి యొక్కన ప్రేటు లాడుచోఁ జెలరేఁగి యడవిద్రిమ్మ

తే. రులు గడిందిగ రేద్రిమ్మరులును జుట్టు, ముట్టి పలుచందములఁ బడఁ గొట్టి దక్కి
నంపురాయనివీడున కంపి వైవఁ, జూచి యష్టమేటిరాకాసిజోదు లలిగి. 250

ఆ. కైదువుల ద్రుద్దఁ దూపులఁ గడఁగి నఱికి, మోఁదిగ్రుచ్చియుఁ బలుచందములఁ గలంగఁ
జేసి మూఁకలఁ జీకాకు సేయుచున్నఁ, గాంచి యుత్తలి నెన లేనికడిమితోడ. 251

సీ. తెమ్మెరపట్టిఁడు త్రిశిరి దేవాంతకు నతికాయునిని దారయనుఁగుఁగొమరుఁ
డును మహోదరు నీలుఁడును వృషభుఁడు మహాపార్శ్వనిఁ దొడరి గుబ్బలులఁ జెట్లఁ
బడుకులఁ దఱుచుగాఁ బైబ్రేయ వాండ్రవి దప్పించుకొని బాటుతనము వెలయ
ద్రుద్ద నీఁటియలఁ గైదువులఁ దూపుల సురియల జముదాడుల నక్కడించి

తే. చెట్టుద్రిమ్మరిజోదుల బిట్టు నొప్పి, వెట్టుటయు వార లాసోఁకు జెట్టిమగల
దిట్టలై పట్టుకొని పడఁ గొట్టి జముని, పట్టుకకుఁ బంచి రిపువాగుపజలు వొగడ.

తే. అప్పు డతికాయుఁ డలుకతోఁ దిప్పద్రిమ్మ,రులఁ బటాపంచలుగఁ దోలి బలిమిమీఱఁ
బంతిలేదులయొకిమానిపట్టి దరియ, నరవ మొగిఁ జొన్పి యతని కిట్లనుచుఁ బలికె.

ఆ. రాచబిడ్డ వేల్పురాయని కైన నగ్గ, కదిసి పోర నలవి గాక యుండుఁ
గోఁతిమూఁకఁ గూర్చుకొని వచ్చి నీబోఁటి, సన్నగాఁడు లెదురఁ జాలు టెట్లు.

సీ. చిదికినప్రాఁతవి లీన్లుప్పుటయును బొలదిండికొర్రన్నసఁబోఁడిఁ జెందుటయును
లేడి నేయుటయుఁ జెల్మి యొనర్పఁ జేరిన చెలిముక్కసెవులును జిదుముటయును
తాటికి నుసురులు రాఁవించుటయును డాఁగి కోఁతి నొక్కమ్మునఁ గూల్చుటయును
ముదిమిచే లావెల్లఁ గొదవడ్డఖరుని ద్రుంపుటయు సీళ్ళకు నడ్డు వోయుటయును

తే మగతనంబులు గాఁగ నీమదిఁ దలంచు, కొని కరంబును దిక్కుమిక్కుటపుసూడు
దెచ్చుకొంటివి గద చెడుతెఱఁగు పూని, యకట నీ కింక నెందుఁ బోనగుఁ జెనంటి.

తే. బలిమి భరతుఁడు మునుప్రోలు వెడలఁద్రోయ, నడవులకుఁ జేరి యాలిఁ గోల్పడి తిరిగియిందుఁ
గాయకసరులు దిని బ్రతుకక గయాళి, పాలసుదిండులతోఁ బగ పూనఁ జనునె.

ఆ. నలువ కైనఁ గన్గొనఁగ రాక టక్కరి, వగుచు జోగితెగలయందు డాఁగి
కొలము గొనము రూపు గలుగక యుండునీ, కిట్టిరాచచిన్నె లేల యిపుడు. 257

క. మాతండ్రికతన మానిసి, వైతివి గా కూరఁ జేరు నంతకుమున్ నీ
కేతఱిఁ గలదు జగంబున, నీతెఱఁ గెవ్వాండెఱుంగు నిక్కము సెపుమా. 258

క. నీవార మనుచు నమ్మిక,తో వాలెము గొలుచువారిదోసఁగులపాలం
బో విడిచి నిరాబారులఁ, గావించుచెనంటి నీవె కద పరికింపన్. 259

సీ. కడలి సొచ్చినఁ గొండయడుగన డాఁగిన నేలలోఁ గూఱిన నెఱియుఁ గడచి
వేస మూసినఁ దక్కు వెలయఁ జే సాఁపినఁ బుడమి యెల్లను డిగ్గ విడిచి చనిన
నడవులఁ జేన విడుపక నాఁగలి పట్టిన మ్రానిలోపల నిఱికినఁ
దట్టువ నెక్కినఁ దద్దయు వీఁగిన మఱియును బల్లూపుల వఱలుచున్నఁ
తే. దలఁపు నీయందె నిలిపి నిచ్చలును వెదకుచుందుఁ గాక జుణింగి నిన్నెందు నైనఁ
బోవ నిత్తునె వినుము నాపొంత నింక, సాగ నేరవు సుమ్ము నీయాగడములు. 260

తే. అనిన రాముఁడు వానిపై నలిగి యోరి, పాలసుఁడ కాన కూరక బవరమునకుఁ
దొడరుదువు గాక కడు రిత్తనుడువు లేల, యనుచు విల్లూన లక్ష్మణుం డడ్డు దగిలి.

క. ఆపోఁకుజోదుఁ బైకొని, రోసంబున వింటినారి మ్రోయించి కడు
న్వాసిలతోరులు బడిబడి, నేసి కలంచుటయును వాఁడు హెచ్చుగుకియుకన్. 262

తే. పెక్కు నెఱతూపు లారాచబిరుదుమీఁద, ప్రేయ నతఁడవి యరతొగవిందుములికి
గములఁ దునుమాడివైచినఁ గనలి రక్కసుండు వెండియుఁ గఱకుతూపొందు సిమ్మె.

సీ. చిమ్మిన నక్కోలల యమ్ములఁ జని పెనుట్టొమ్ము గాఁడుటయును రాతమ్మిదాయ
తమ్ముఁ డొకించుక సొమ్మ వోయి కరంబు నుమ్మలించుచు లేచి యమ్మెఱుంగు
టమ్ము గ్రొన్నెత్తురు ల్నెమ్మెయిఁ బొరిఁబొరిఁ గ్రమ్మఁగఁ జెఱికి బీరమ్ము మెఱయఁ
దెమ్మెరతెలిచిల్కు నెమ్మది నారేయుద్రిమ్మరిబొమ్మ మెకమ్ముపైఁ ది
తే. రమ్ముగా నేయ వాఁడు గన్పొమ్మ లదర,ముమ్మరపుటల్కతోఁ జిల్వసొమ్ముములికి
గ్రమ్మఱ నిగుడ్ప నత్తూపు లెమ్మె నాక,సమ్మునం దంటి పెనఁగె జగమ్ము బెగడ. 264

తే. ఆత్తెఱంగునఁ బెనఁగి యయ్యమ్ముదోయి,బూది యై రాలుటయు సోఁకుజోదుగుదియ
తాల్పుతూపేసె నేసిన దాని నపుడె, రాకొమరుఁ డీఁదతూపేసి క్రమ్మఱించె.

క. మఱియుఁ జలంబున నిరువురు, గుఱి యొప్పఁగఁ బెక్కువాలుఁగోలలు పైపైఁ
బఱపుచు నేడ్తెఱఁ బోరఁదు, లట నెవలోఁ గినిసి రాముతమ్ముఁడు గడిమిన్. 266

సీ. నలువతూపరివోసి బంమిమై నద్దోసకాంరిరక్కసు మేలిగానిమీఁద
నేసిన నది మంట లెగయుచు మిడుఁగురు ల్సెదర నొక్కుమ్మడిఁ గదియ వచ్చు
చున్నఁ గన్గొని వాఁడు గ్రన్ననం దూలంగ ద్రుష్టల బటువ్వకైదువుల నడివ
ముల మరల్చినఁ బోక మొనసి నాడెంపుబొమిడికముతోఁ గూడఁ బుడమిఁ బడఁగ
తే. వానితల ద్రుంచెఁ ద్రుంచినఁ గోనమునికి,బిరుదు లందఱు బొబ్బలు పెట్టుకొనుచుఁ
జెలఁగి యాడిరి మింట జేజేలు రాచ,పట్టిఁ దద్దయు నగ్గించి పల్కి రంత. 267

తే. కలనఁ బొలియక చిక్కినపొలసుదిండి,బంట్లు గొందఱు నెవ్వడిఁ బఱచి దీవి
ఱేని కత్తెఱఁ గెఱిఁగింప మాన రాని, వ్రంతఁ గొడుకులఁ దఱచి లో వగచుచుండె.

ఆ. అప్పు డింద్రజితుఁడు నభ్రదేశములోన, వగపు చూచి యగ్గివలన బమ్మ
తూపుఁ గాంచి సరగ దురమున కరుదెంచి, చదల నంటి కోఁతిపదువుఁ గూల్చె. 269

క. బలుములుకు లేసి కాళ్లుం, దలలుం జేతులును దొడలు నడుములు బెనుతి
ట్టలుగాఁ దున్మచుఁ బలువురఁ, బొలియించి కడిందిలావు వొదవఁగ మఱియున్.

సీ. క్రొవ్వాఁడిచికిలిములుకులు వింటఁ దొడిగి జ్యోతిర్ముఖు నాఱింట ద్వివిదు మూఁట
నెలుఁగులదొరఁ బదియేనింట నలుని నీ రైదింట వేల్పురాయనిమనుమనిఁ
బ్రొద్దుచూలిని వృషభుని నీలు గజు ముప్పదేసింటఁ బనసుని నెనిమిదింట
మైందు నేడిట గంధమాదను రెండుతొమ్మిదులఁ దక్కినకొమ్మమెకపుబంట్ల

తే. నెల్ల నొండొంట నేలపైఁ గ్రెళ్లఁ జేసి, నలువతూపున రాచజాబిలులఁ దద్ద
సొమ్మఁ గొనఁ జేసి బిట్టార్చి నెమ్మితోడ, లంక కరుదెంచి తండ్రి కెలమి యొనర్చె.

తే. అప్పు డెలుఁగులరాయనియానతిఁ గొని, గాడ్పుకొమరుఁడు మందులగట్టు దెచ్చి
కోఁతిమూఁకల మనిపె రాకొదమసింగములును వేగముగా సొమ్మ దెలిసి రంత.

క. చెయువులసాకిరికుఱ్ఱఁడు, సెయిబోయి మొగిడ్చి రాచసింగములోడన్
దయివారు పేర్కొ నిట్టు లనియె వలద్రిమ్మరికొలంపునెల లలరారన్. 273

చ. ఒదయఁడ నాదువిన్నపము లొప్పుగ నిప్డు దెవం దలంపుమీ
తడయక కుంభకర్ణుఁడు మొదల్గలనాడెపుజోదు లందఱున్
మడియుటఁ జేసి రావణుఁడు మార్కొని యింక దురం బొనర్పఁగా
వెడలఁడు లంకఁ గాల్చుటకు వే పనుపందగుఁ గోఁతిమూఁకలన్. 274

ఆ. అనిన నట్లు సేయు మని రాముఁ డానతి, యిడిన వేడివేల్పుకొడుకు ప్రొద్దు
గ్రుంక నిచ్చి యెల్లకొమ్మమెకంబులఁ, గడఁది మీఱ లంకఁ గాల్ప ననిచె. 275

ఉ. అంచిన వార లొక్కమొగి నార్పుల నెల్లకడల్ పడంకఁగాఁ
గొంచక చేతులం గొఱవికోలలు పట్టుక యేఁగి వే పటా
పంచలు గాఁగఁ జెన్గవనిపట్టులఁ గావలియున్నవాండ్రఁ బో
దంచి కలంచి ప్రోలటు గడంకఁ దరిర్పఁగఁ జొచ్చి వేఁడిమిన్. 276

క. అగపడ్డరేయిద్రిమ్మరి, తెగలం బోసీక పట్టి తెగటార్చుచు ము
జ్జగములకుం దిగు లొదవఁగ, నొగి చెక్కుడు మెకపుగొంగ యులివు లొసఁగుచున్.

తే. వాడవాడలఁ గ్రమ్ముక మేడలందు, మోసలలయందు నగ్రాణములను మిద్దె
టెండ్లఁ జవికలయం దెల్ల నింగలంపుఁ, గొఱవు లడరించి పెస రవుల్ కొల్పుటయును.

క. పొగయును మంటలు సదలున, కెగయఁగ మిణుఁగురులు సెపర నేడ్తెఱ నపు డా
దుగ మొగములవే ల్పాగు, బ్బుగ దరికొని కాల్పఁ దొడఁగెఁ బ్రో లెల్లెడలన్.

సీ. కొలుచులు మానికంబులు మంచిగందముల్ కోకలుఁ జమరులుఁ గుందనంబు
వెండియుఁ గైదువుపిండులు పల్లకీ లందలమ్ములు పైఁడిచందువాలు

గద్దియ లుయ్యాల లిద్దియ ల్మేడలు చప్పరంబులు మొగసాల లిండ్లు
తలుపులు గవనికట్టులు తెలె ల్చెంబులు పక్కెల ల్త్రోవలు నక్కెనెలవు

తే. లేఁగులపట్లుమొదలగు నెల్లవియును, మొగిసి సతనాలుకలు సాఁచి రగులఁగొనుచు
దంటమోములదేవర దనిరి దీఱ, బుగులుకొని మెక్కెఁ దద్ద యబ్బురము గాఁగ. 280

సీ. అప్పుడు గడ లేనియలజడిఁ బడి తల ల్విడిమూద వడిఁ బర్వు లిడెడివారు
కూనల ముదుసళ్ళఁ గానక నెమకుచు నగ్గి కగ్గం బయి మ్రగ్గువార
లిఁక నేమి సేయుద మెక్కడ కేఁగుద మని చాల వగపుతో నడలువారు
ముంగిళ్ళ సంకుల మూలలఁ గొంకుల నెడ లేక మాటల నెనయువారు

తే. పొగయు సెగలును దమ్ము వే పొదివికొనిన, దట్ట మగుచిచ్చులోపలఁ జుట్టువలుగఁ
ద్రెళ్లువారును రావణుఁ దిట్టువారు నగుచు రక్కసు లిడుమల నడలి రొకట. 281

ఆ. అట్లు ప్రోలు గాల్చి యడవిద్రిమ్మరు లెల్లఁ, గోటగవఁకులందుఁ గూడి సోఁకు
మగని నెచటఁ గన్న మడియుంచుచున్నచో, జంటపదిబుజములబంటు గినిసి. 282

తే. కుంభకర్ణునికొడుకులఁ గుంభుఁడును ని,కుంభుఁ డనువాండ్రఁ బిలిచి యాకోఁతిపమ్ఱఁ
దునిమి రం డని పనుప నత్తులువలొంటి, వేల్పుఁగొమరులు మగఁటిమి విప్పమీఱ.

క. మీసలు దువ్వుచు నడుగని, రోసంబునఁ దేరు లెక్కి ప్రోద లయినరా
కాసివజీరులఁ గొండఱ, బాసట గొని నద్దెఱఁగుల పోఁజులు గొలువన్. 284

క. ఓలిమెయి: కల్లడాలుమె, కా లిట్టులమీఁద నడరుకైవడి నపుడే
యాలమునకుఁ జనుటయుఁ దొలి, వేలుపు లాకోఁతిగముల వెసఁ గని కినుకన్. 285

ఆ. ఓరికోఁతికూళలార కాఱడవులఁ, దూఱి కాయగసరు లేరుక తిని
బ్రదుక లేక రాచగుదియలోఁ బొత్తూని, పొలసుదిండ్ల నెదిరి పోరఁ దగునె 286

ఆ. ఆలి నప్పగించి యంతటఁ బోక మి, మ్మప్పగింపఁ దెచ్చె నఱ దలంచి
రాచవాని నమ్మరా దమ్మమాట మీ, రెఱుఁగ రైతి రింక నేమి గలదు. 287

సీ. చివచివ నెగఁబ్రాఁకఁ జెఱుతమ్రాఁకులు గావు పొగరుటేనుఁగుగున్న తెగలు గాని
కూడి యాడుకొనంగ లేడిమూనలు గావు వడి గలమేటితత్తడులు గాని
చెలఁగి గంతు లిడంగఁ బొలముగుట్టలు గావు తలరుపుత్తడియరదములు గాని
యంటికి దాఁటులు గొన నూటవాఁగులు గావు కఱకునంజుడువిండిగములు గాని

తే. పొదలి యాలింపఁ బులుఁగును న్రొదలు గావు, కడఁదిసింగాణిజెడఁగుసప్పుడులుగాని
కోఁతు లెచ్చట జగడంపుఁజేఁత లెచటఁ, బగ్గె లటు పెట్టి తిన్నంగఁ బాఱి చనుఁడు

సీ. అని పల్కి కేవ్వన నార్చి యొక్కమ్మడిఁ గదలి యొండొరు మీఱి పొదఁడుపొదఁడు
బలిమిమైఁ బొదవుఁడు పట్టుఁడు కొట్టుఁ డం చేద్దెఱ దొడరి యయ్యెఱచిదిండ్లు
సబిడీల వంకుల జముదాళ్లతోఁ జేవ ద్రుడ్డుల గటువుకైదువుల నడిచ
ముల బల్లెముల నీఁటియల సెలగత్తుల, గుదియలఁ దూపుల గొడ్డటలను

తే. జెంకుబెండాడి కండలు గుండియలును, గ్రొవ్వు నెత్తురు మెదడు ప్రేగులు నరమ్ము
లెమ్ములును నేలఁ బొరలంగఁ గొమ్మమెకపుఁ, బిండు నొంచిరి జేజేలు బెగడి పఱవ.

ఉ. అప్పుడు లిప్పద్రిమ్మరిగయాళులు సెట్టులు గట్టుఁ జట్టులుం
గుప్పలు గాఁగ రువ్వియును గ్రద్దియు దాఁచియు గోళ్ల వ్రచ్చియుం
డెప్పర మైనయిక్కలఁ గడిందిగ రక్కసిబంట్ల నొక్కనిన్
దప్పి చనంగనీక గుజతాలుపుప్రోలికిఁ దోలి రోలిగన్. 290

క. మఱియుఁ బ్రజంఘునిఁ గ్రోధను, నుఱుమాడె న్వాలికొడుకు నూల్కొని కడిమిన్
వెఱ వొప్ప శోణితాక్షునిఁ, బరిమార్చెన్ ద్వివిదుఁ డెల్లపాఁజులు వొగడన్. 291

ఆ. అట్టు లదరుచున్నచెట్టుద్రిమ్మరులపైఁ, గినిసి కుంభుఁ డనికి మొనసి పెద్ద
కొండవంటివింట గొనయ మెక్కించి న,ల్గడలు నద్రువ బొబ్బ యిడి కడంగి. 292

క. గాలికవణంపుమేపుదు, చాలుపులం బోలి శరకసంబున నొఱపూ
న్మైలియపరంజిపింజల, వాలాయుంధాపు లుఱక వామిగ నేసెన్. 293

క. ఏయుంట గనుఁగొని ద్వివిదుఁడు, పాయనికోసమున నొక్కపడు శావేల్పుం
దాయపయిం బడ వైచుట, కై యెత్తిన వాఁడు దోనె యది దునుమాడెన్. 294

క. తునుమాడి యొక్కసెఱతూ, పున నాశని బోర యుచ్చిపో నేసినఁ గ్ర
న్నన నేల నొఱగె నటు లాఱ, గినతోఁబుట్టువును జూచి కినుక దలిర్పన్. 295

తే. మైందుఁ దురువడి నొకపెద్దమ్రాఁకు వెఱికి, పొలసుమేపరి నేయ నప్పొటుకాఁడు
వెయ్యి పోఁకినగాదుపునెయ్యునట్లు, మండి యొకకోల్తనాతనిఁ బండఁబెట్టె. 296

క. మామలపాటు గనుంగొని, తా మనిలోఁ గుంది గట్లదాయకొమరుఁ డెం
తో మగఁటిమి నెదురుకు వాఁ,డా మెసఁగఁగ బలుములుకుల నాతని నొంచెన్.

తే. అంతఁ గొందఱు కోఁతిబం ట్లత్తెఱంగు, రాముకడ కేఁగి తెలుప నారాచమిన్న
మోరతెల్పుమెకఁపుజేము మొదలుగల్గు, బల్లిదుల నేర్చి పోరికిఁ బనుపుటయును.

క మ్రాఁకులుఁ బడుకులుఁ గైకొని, పేఁకం జని వారు మిగుల వెఱఁ గొప్పఁ గడుం
గూఁక లొసంగుచు నతనిన్, దాఁకిన నబ్బిరుదుమగఁడు దరిలినకడిమిన్. 299

తే. వారి నందఱ బెడిదంపువాఁడి వార, నముల నోవేసి కలిమిన జగముకన్ను
కొమరుఁ డాకుంభకర్ణునికొడుకు దొదరి, మలలుఁ జెట్టులుఁ బడుకులుఁ జెలఁగి వైచె.

తే. వైచుటయుఁ వాఁడు నడుమన వాని నెల్లఁ, దునిమి వేండ్రంపుమొనవాఁడితూపుగములు
కోఁతిరాయనిపైఁ జెల్లు గురియ నతఁడు, వానిసింగాణి ముఱియలుగా నొనర్చె. 301

సీ. అందుల కలిగి వాఁ డరదంబు డిగి పడిఁ, బఱతెంచి సుగ్రీవుఁ బట్టుకొనిన
నిరువురు నపు డాముటేనుఁగుగున్నల పోలికఁ దార్కొని పొంపు గదుర
పదుగులతాఁకునఁ బుడమి గ్రక్కదల నార్పులఁ దమ్మికానుపుగ్రుడ్డు వగుల
గఢితంపుదుమ్ములఁ గడలిపట్టు గలంగ నూర్పుల మొగుళ్లజా ళ్లాడిగి పఱవ

తే. బలుదెఱంగులఁ బోరుచోఁ గలువదాయ, పట్టి యారక్కసునిఁ జిక్కఁ బట్టి యొమ్ము
మట్టి పిడికిటఁ బొడిచిన నిట్టు నట్టుఁ, గదలనేరక యుసురులు వదలి చనియె. 302

క. అంత నికుంభుం డొంతయుఁ, బంతంబున నినుపకట్లబల్లుదియఁ గడుకన్
వింతగఁ ద్రిప్పుకొనుచు హను, మంతు నెదిరి యతనిఁ బోర మసలక మోఁదెన్.

ఆ. మోఁదుటయును గాడ్పుగాదిలికుఱ్ఱని, యక్కు సోఁకి గుదియ ముక్క లయ్యె
నపుడు సోఁకుబాటు వలమి పట్టుక నల్ల, గ్రక్కఁ బొడిచె నదరి యుక్కుజోదు

చ. పొడిచిన మొగ్గి యప్పొలసుబోనపుమేటిమగండు బీర మే
ర్పడ వడి లేచి కోఁతిదొరఁ బట్టుక బిట్టు గలంప నాతఁ డ
గ్గడుసరిరక్కసుం బొదివి కాలును గేలుఁ గదల్పనీక బ
ల్విడిఁ బడఁ ద్రోచి త్రొక్కి సరవిం దల ద్రుంచెఁ బలం జెలర్పఁగన్. 305

క. అయ్యెడఁ గొందఱు రక్కసు, లొయ్యనఁ బఱతెంచి సోఁకుటొడయనిఁ గని య
క్కయ్యంపుఁదెఱఁగు సెప్పిన, నయ్యొకిమీఁ దుఱక యదలి యాఱికిమకన్. 396

తే. ఖరునికొడుకైన మకరాక్షుఁ గదియఁ బిలిచి, నీవు నీమూఁకతోఁ గూడి కేవి నేఁగి
నేఁడు రాచూలులను గోనసెలవుబాట్లఁ, జెనసి వైళంబ రూపఱఁ జేసి రమ్ము. 307

క. అని పనిచిన మూఁకలతోఁ, బనివిని యజ్జోదు కోఁతిపోఁజులపై డా
కొని కినుక విగుడఁ దూపుల, పెనుజడి యొనరింప వారుఁ బెం పలరారన్. 308

తే. కొలఁది మీఱిన మ్రాఁకలు మలలు తాలుఁ, బూని యడఁచిన రక్కసపోటరులును
వైదువులు విడ్లు వైకొని కడిసి రట్టు, విరుదెఱంగులమూఁకలు నెలమి జెరసి. 309

క. మేనులు నలినలి గాఁగం, బీనుఁగు పెంటలుగఁ గడిమిఁ జెనఁగెడునెడ న
క్కోనబిడారపుబంటులు, మానక రాకాసితెగల మడియించుటయున్. 310

సీ. కన్నుల నిప్పుకల్ గ్రమ్ముచు మువ్వన్నె మెక మిఱ్ఱిఁ గదియుపోలికల మొసలి
కన్నులరాకాసిమిన్న కోనమెకంపు గుంపులఁ దార్కొని యంపవాన
గురిసి యీఁటెలఁ గ్రుచ్చి గుదియల మోఁది యడిదముల గొడ్డండ్లఁ జదియ నఱికి
సురియలఁ బొడిచి నజ్జుగ నొదక్కెల్లను జెండాడి చీకాకు చేసి కలఁచి

తే. బారిసమిరిన విలువక పాఱి వార, లిపము మేపరికోలపుజక్కవలసూఁడు
మఱువు సేరిరి సేరిన మఱక మొఱకు, రక్కసుఁడు దోనె యరిగి సీరాముఁ దొడరి.

క. నెఱజోద పసుచు నిసుఁ బల్కఱు బిరుదులు సెప్పుకొందురు మఱి నేఁ డొరకన్
బఱపక నిల్చి దురంబున, గుఱుతుగ నీలావు సూపుకొను మెకిమీఁడా. 312

క. కుఱకుఱతోలివేల్పులఁ గొం, దఱఁ గూలిచి నిక్కెదేమొ తాటోట నినుం
బిఱువీక పట్టుకొని రూ, పఱఁ జేసెదఁ దండ్రి నాఁటిపగ దీఱంగన్. 313

సీ. టక్కరివై పొంచి నిక్కుడు నొకకోలఁ, గూల ద్రెయఁగ నల్లవాలి గాఁడు
మగఁటిమి సూపె నెమ్మది గెల్పు చేకొన వేఱొడి ముదిసేలవేల్పు గాఁడు

దప్పునఁ బోదసూపి తటుకునఁ బుడమిపైఁ ద్రెళ్లింప రాకాసి తెఱవ గాఁడు
వెఱ పొకింతయు లేక తటిమి పీఁచ మడంపఁ బో టెఱుఁగని జింకపోతు గాఁడు
తే. ఖరుఁడు గాఁడు విరాధుండు గాఁడు పట్టి, నోరు మాలినయాకబంధుఁడు గాఁడు
వీఁడు మకరాక్షుఁ డిపుడు నీవాఁడి యెల్ల, మలపి పొలుపఱఁ జేయువాల్మగఁడుసుమ్ము.
ఆ. అనుచుఁ బెక్కుతూపు లడరించి కెండియుఁ, గొలఁది మించువాఁడిములుకు లేయ
రాగవుండు పులుఁగురాయఁడు ముక్కునఁ, బాఁపగములు దునుముపగిదిఁ దునిమె.
క. తునిమిన నత్తోలివేలుఁపు, మొనగాఁ డగ్గలపుఁగిన్క ములుకుల పెనుమం
చొనరింప రాచతామర, యనుఁ గమ్ముఁ జేయుగముల నది విరియించెన్. 316

సీ. విరియించి యొకదొడ్డవెడఁదచిల్కున వాని సింగాణిఁ దునియలు చేసి యైదు
తూపుల నరదంబుతోలువాని నడంచి యన్నియె ములుకుల నబ్బురముగఁ
దేరును మావులఁ దగటార్చి మఱియును నెఱిఁ గీలు నోనేయ నేయుదొరయు
నగ్గిచాదున మండి యరదంబు డిగి వాఁడు మొక్కలంబుగ డాసి మొనలవాలు
తే. వైవ నది నేలతాల్పుఁగల్వలయనుంగు, మూఁడునెఱనారసముల వమ్ముగ నొనర్చె
నంత రక్కసుఁ డెకిమీని నలమి పట్టి, బిగి యెలర్పుఁగఁ బిడికిట బిట్టు వాడిచె. 317
క. పొడిచినఁ దద్దయుఁ గొఱకొఱ, యదరఁగ రాచందమామ యగ్గములికి నె
వ్వడిఁ బూని యేయఁ బుడమిన్, బడి యత్తోలివేల్పు మేలుబంతి యడంగెన్. 318
క. కలన మకరాక్షుఁ డట్టుల, నిలిగినచందంబు సోఁకుటేలికతోడన్
బొలిదిండులు గొందఱు సని, తెలిపినఁ గడు నడలి యతఁడు దిటమున నంతన్.

తే. వేల్పురాగెల్పుకాని రావించి యిందుఁ, జేసుగలజోదు లందఱుఁ బోరఁ గూలి
రింక నీ వేఁగి దురమున నెల్లకోఁతి, పోరల రాచూలులను జంపి సరగ రమ్ము. 320
క. అని పలికి నెయ్యమున న, క్కునఁ జేర్చి యసికి వీడుకోల్పిన నతఁ డా
తనికిన్ మ్రొక్కియు మిహికుం, దనపుందె రెక్కె యుక్కు దపకొత్తంగన్. 321
సీ. కేల్గలమెకములగీపెట్టుటలును మావులసకిలింత లగ్గలపుఁదేర్ల
రొదలు కాలరులయార్పులు వాయిదంబుల మ్రోఁతలు నొక్కటై ముజ్జగంబు
బెగడింప నలుగులబెడిదంపుమెఱుఁగులు విన్నద్రిమ్మరులు చూడ్కి వెనుకకొత్త
బలుదుమారము సంద్రముల నెల్ల నింకింపఁ బడగ గాడ్పులు మబ్బుఁ బాఱఁ దఱుమఁ
తే. దే జడర నేఁగి యొకచెంతఁ దేరు డిగ్గి, పొలసుమేపరిగములు త న్నొప్పదివి చుట్టు
దట్టముగఁ గాచుకొనఁగ నెంతయుఁ గడంకనచటఁ దిగమూల లేర్పడ నరుగు నిలిపి.

సీ. కడిఁదిగాఁ జెఱరులపుడమి నగ్గి రవుల్చి తొవరుఁబుట్టములఁ గెంబువులఁ దాల్చి
కుదు రొప్పఁ బుఱియపైఁ గూర్చుండి మాసిసి నెత్తురు నంజూడు నేయి నున్న
లావాలు పాలు మేలగుతాడిపడకలు నెలమి నాలవతోలిపలుకునుడువు
లోలిమై గొదఁగుచు ప్రేలుచుటయు నందుఁ గల్లరిసత్తి యొకర్తు వొదవి

తే. కని గొలుపు మంచు నిలిచినఁ గని చెలంగి, దానితోఁ గూడ రిక్కలదారి కేఁగి
కారుమబ్బులు జడివాన గడఁగి కురియుఁ, బగిది నంపర కోఁతులపైనిఁ గురిసె. 323

చ. కురిసినఁ బ్రోవులై పుడమిఁ గూలెడువారు గొలంత లేనిపో
టరితన మేది యాఱముల డాఁగెడువారు నొడల్లు వ్రస్సి నె
త్తురుల మునుంగువా రసము దూలి పొరింబొరిఁ బాఱువారు వా
విరిఁ బలవించువారు నయి వేఁగిరి తద్దయుఁ గొండద్రిమ్మరుల్. 324

క. మిడుతలగడితము తొలుకరి, పిడుగులబెడిదంబు చిలువపిండులవడియున్
జడివానపెల్లు నదరఁగఁ, గడు బదలుఁగఁ జేసెఁ గోఁతిగమి నత్తూపుల్. 325

తే. అపుడు పనసుఁడు నీలుఁడు నంగదుండు గజుఁడు నలుఁడు గవాక్షుండు గాడ్పుకొడుకు
గంధమాదనుఁ డెలుఁగులగామిడియును, మొదలు గలజెట్టిమగలు నెమ్మదిఁ జెలంగి.

తే. మలలు మ్రాఁకులుఁ బడుకులు బలిమిఁ బెఱికి, నింగి యెల్లను గప్పుకొనంగ వైచి
గారడపురక్కసుని నెందుఁ గాన కుండి, రంత వాఁ డవి సరగ వ్రయ్యలుగ నేసి.

క. వారలమీఁదను బెడిదపు, నారసములు పెక్కు వఱపి నజ్జుగఁ జేయన్
బీరము సెడి రాచకొలపుఁ, బైరులయెకిమీనిమఱువుపట్టి తలఁకుచున్. 328

తే. అపుడు రాముఁడు సోఁకుదయ్యంబువలనఁ, బొలసుమేపరి తెఱఁ గెల్లఁ దెలిసి కొండ
నత్తమిలు మేటిదేవరయమ్ము దొడిగి, యేయుటయు నత్తి రూపఱి పోయె మింట.

ఆ. పోవఁ దడవు స్రుక్కి రావణుతొలిపట్టి, తేరితోడఁ బుడమిఁ ద్రెళ్లి నిబ్బ
రంబు పాదుకొల్పి రాచూలిబంటులఁ, గనుపుగొట్టుకొనుచుఁ గదఁగి మఱియు. 330

తే. గంధమాదను మైందుని గవయు ద్వివిదు, నలుని నీలుని శతవలిఁ గలఁచె రెండు
తొమ్ముదులు నేడు పండ్రెండుబమ్మలెక్క, తొమ్మిదియుఁ నైదుమూఁడునుదూపులేసి.

సీ. అత్తఱి వానిపై నంగదుం డొకపెను పడుకును గేసరి కడిమిమ్రాను
సంపాతి తాడియు శరభుఁడు దిన్నెయు నలుఁడు మట్టియుఁ నెలుంగులయొడయఁడు
కోఁతులదొరయు బలొక్కండలు దక్కిన బంటు లెల్లను జెట్లు పడుకుగములు
తొలివేల్పుపేని సైదోడు ద్రుద్దును లక్ష్మణుఁడు మూఁడుతూపులు నూఱునార

తే. సములు రాముఁడు నడరింప సరగ వాని, నెల్ల నుఱుముగఁ జేసి యాబల్లిదుండు
వారి నందఱఁ బెక్కుక్రొవ్వాఁడిములికి, మొత్తములచేతఁ దప్పయు మొక్కపఱిచి.

క. మరలి నింకుభిళకుం జని, తిరముగ నం దంటరానిదేవర యలరన్
విరివిగ వ్రేలిమి యొక్కటి, కర మరుదుగ నేమ మూని కావించుతఱిన్. 333

తే. ముజ్జగంబుల నప్పాగ ముంచుకొసినఁ, గనుఁగొని విభీషణుఁడు రాచకలువపేనిఁ
జేరి దేవర విను మింద్రజిత్తుఁ డిపుడు, వ్రేల్మి యొక్కటి నెమ్మిఁ గావింపఁ దొడఁగె.

క. అది నిండెనేని వానిం, బుపడి ముక్కంటి యైన బవరంబున నె
మ్మది గెలువఁ జాల కుండెడు, నది గావున వ్రేల్మి సెఱుప నంపుము మూఁకన్.

తే. అనుచుఁ జెప్పిన రాఘవుం డపుడె కూర్మిఁ, దోడఁబుట్టువుఁ బాహులతోడఁ గూర్చి
వాని దెగటార్చి రక్కసుని వాలుతూపు, గములఁ బెక్కుడి యనిచినఁ గదలి యరిగి.

తే. రక్కసుఁడు వ్రేల్మి యొనరించుచక్కదరియు, నెడల నచ్చటఁగా పున్న యొఱచిలెండి
మూఁక లాకొన ద్రిమ్మరిమూఁకతోడ, నెమరుకొనుటయు నిరువాగు గదిసి యపుడు.

క. పెల్లుగ నడఁచుచుఁ బొడుచుచుఁ, గొల్లగఁ గూఁక లిడుకొనుచు గుదియల నురలన్
బల్లెములఁ గిట్టఁ బడుకుల, నల్ల వారలి పాఱఁ బో రొనర్చిరి కడిమిన్. 338

క. అత్తఱి గుబ్బలిద్రిమ్మరి, మొత్తంబులు సోఁకుమూఁకమొనలను నెల్ల
న్నుత్తుమురు సేసి మగఁటిమి, హత్తుకొనఁగ జమునివీటి కనిచె న్వేగన్. 339

ఆ. అనిచి సోఁకుఱేనియనుఁగుమేపుట్టువుఁ, బొదివికొనిన వాఁడు నుదరి లేచి
వ్రేల్మి వోవఁ బెట్టి వ్రేల్మిడిఁ దేకొక్కు, కడిఁదిమగతనంబు గడలుకొనఁగ. 340

సీ. ప్రోఁకఁ గూల్చుఁ గడఁగుపునుకదాలుపుమాడ్కి జగ మదంపఁగఁ లూనుజమునికరణి
నుసిరికమ్రానిపై నొఱగెడుసిసుగుల ట్లదవిపైఁ బేర్చుకార్చిచ్చుపగిది
జింకలపై దాడి సేయుఁ బెబ్బులిపోల్కి ననఁదోటఁ బెరయుపెన్గాడ్పునోజఁ
దమ్మికొలను జొచ్చుకొమ్ముటేనుఁగుకైవడి బాములఁ దోల్పక్కిసామిజాడఁ

తే. గోఁతిమూఁకలమీఁద డాకొని కడంకఁ, గుత్తుకలు ద్రుంచి చేతులు గోసి తొడలు
నఱికి చట్టలు చీఱి కండలు పెకల్చి, బొజ్జలు వగిల్చి మేనులు నజ్జు సేసి. 341

ఆ. పాఱఁ దఱిమి రాచపట్టిపై నరదంబు, పఱపి కఱచు మీఱఁ గఱకునార
సముల ద్రొమ్ము గాఁడి చన నేయుటయు నాతఁ, డలుకతోడ వాని నడ్డగించి. 342

తే. మేడివేల్పున కైన నగువాఁడిములుకు, నొకటి సింగాణిఁ గూర్చి యేయుడుఁ గడింది
మీఱ నది వాని పెన్రొమ్ము దూఱి చనిన, నల్లలోఁ దోఁగి కడు సొమ్మసిల్లి తెలిసి. 343

మ. కెరలం బాఱెడుకిన్కఁ గన్గవ కెంపుం గెంపారఁ గెంపారున
క్షురపుంబీరములో వెదఁ దసెఱతూపు ల్సింగిణిం గూర్చి వా
విరి నార్పు ల్నిగుడంగ రాకొమరుపై వే చిమ్మి నొప్పింప న
ద్దొరయుం గ్రమ్మఱ వాని నొంచె బలువాల్తూపు ల్మెయిం గ్రుచ్చుచున్. 344

క. చేవయు బీరముఁ దేజును, లావును గొఱగొఱయు నిచ్చలంపుఁ జలంబున్
ఠేవయు నెనగా నిరువురుఁ, గావించిరి పోరు వేల్పుగము లగ్గింపన్. 345

మ. తొలిజేజేగమికాఁడు సిమ్ము మొనవాల్తూపు ల్వడి న్రాచరే
వెలుఁగున్ వ్రచ్చు నకందు వ్రేయుమలుకు ల్వే వ్రచ్చు రేద్రిమ్మరిన్
జాలక న్రక్కసుఁ డేయుఁ జిల్కు లెడఁ ద్రుంచు న్రాముతోఁబుట్టు వా
బలియుం డేయ నెఱుంగుటమ్ము లప మొప్పం ద్రుంచు వాఁ డుమ్మిడిన్. 346

తే. నిలుచుటయు వంగుటయుఁ దోనఁ జిలుకు దివిచి
తొడుగుటయుం జేయుటయుఁ గనఁబడఁగ రాక

చూపఱకు నెల్ల నచ్చెరు వై పరఁగఁగ
విండ్ల మ్రోఁతల నార్పుల విన్ను వగుల. 347

ఆ. కదలియూకసంబు పుడమియుఁ దఱుచుగ, నంపవెల్లి పొదువఁ బొంపు మీఱి
యంధకుండు కొండయల్లుఁడుఁ దార్కొని, యదరునట్లు ప్రేటు లాడు నెడల. 348

మ. కదలెం బంటవలంతి మి న్నదరెఁ జుక్కల్ రాలె జేజేగముల్
సెదరె న్నంద్రము లింకె ముజ్జగములుం బిట్టూఁగె నేనుంగు లె
న్మిదియుం గ్రుంగెఁ గడ ల్వడంకె నెలయుం నిస్సానికంబుం గడం
క దిగం ద్రావిరి పాఁపరాయఁడు దలంగం బాటె నప్పోరునన్. 339

మ అపు డానంజుడుదిండిరాచకొమరుం దబ్రంపుబీరంబు దే
టపడ న్వేఁడివెలుంగువంగడపుఁ బ్రోడ న్దాఁకి పెల్లార్చి వే
లుపుమూఁకల్ చెరఁ డొందె పర్వ లిడ వాల్తూపు ల్మేయి న్నింప గా
టపురోసంబున నక్కడిందిదొరబిడ్డం డుక్కు రాణింపఁగన్ 352

సీ అరచందమామతూ పడవెంచి విలు ద్రుంచి యొకకోల నెద నెత్తు రురల జేసి
తీవంచములుకుల మావుల నొప్పించి యైదుచిల్కుల సిడం బవయఁ జేసి
మఱియొక్కయమ్మున గుఱి మీఱ నరదంబు దోల్వానితలఁ ద్రుంచి తొడరి దొబ్బ
యిదుటయుం వాఁడు నేర్పడరారఁ దానె తేర్నడపుకొంచుఁ గడంగి వెడఁదవార

తే. సమ్ము లాతనిమెయి గ్రుచ్చి సరవి నొక్క, వాఁడితూపు విభీషణుఁ గాఁడ జేసి
గాలికొమరునిఁ బెక్కింటఁ దూలపుచ్చి, నలువగ్రుడ్డుపనఁటులు వగులఁగ నార్చె.

క. అచ్చినఁ గని రాకొమరుఁడు, పెచ్చినరోసమున నైదుపెనుదూపు లరిం
గూర్చి తొలినేల్పుబోరయ, యేర్చి నిగుడ్చుటయుఁ నాతఁ డేపఱ సోలెన్. 352

ఆ. సోలి యపుడె తెలిసి సోఁకుజో డెంతయు, నులికి గాడ్పుబిండిములికి వైవ
రాచమిన్న పుల్గునాతూపు వఱిగించి, తోనె చెలఁగి దానిఁ దుమురు చేసె. 353

క. వేలుపులగొంగ వలజెస, యేలికతూ పేయ రాచయేనుఁగు సతతే
జీలవజీర్మెప్రట్టువు, కోల వడిం బఱపి యాలకోరియుఁ ద్రుంచెన్. 354

తే. అత్తెఱంగున నిరువురు హత్తి గెలుపు, తలఁపు లంతంత కెక్కువై తనరి కడిమిఁ
బోరుచో నేలతాలుపుబొబ్బమెకము, మేటిరాకాసి యేనుఁగుమీఁదఁ గినిసి. 355

సీ. మలదాయ యొసఁగినబలితంపువాల్తూపు, వెస దొన వెడలించి వింటఁ దొడిగి
తెగ నిండఁ దిగిచి యే త్తెర సల్లద్రావుడు, తలకట్టుపయిఁ జూడ్కి నిలిపి రాముఁ
డెపుడును గమఁ బున్నియపుఁగొటారంబేని యతనిదేవేరి సీతమ గడింది
గరితయయేని జగంబుల కిది మేలు కనియేని యిమ్ములిక్క పఱచి చెనఁటి

తే. తొలసుమేపరిగమికానిఁ బొలియఁజేయుఁ,గాత యని వైవ నది బిట్టు గ్రాలుకొనుచు
వేయుచీఁకటిగొంగలవెలుఁగు గలిగి, కెమ్మిఁ జని వానితల ద్రుంచి నేలఁ గూల్చె.

తే. అపుడు రామునిపయి వేల్పు లలరువాన, గురిసి యగ్గించి చేరులు కరము మొరయఁ
జేసి రచ్చర లాడిరి చెలఁగి మింట, దెసలు పదియును దద్దయుఁ దేజ గాంచె. 357

క. ఆలక్ష్మణుఁడును రాముని, పాలికి వడి నేఁగి మ్రొక్కి బవరముచందం
బోలి నెఱిఁగింప నద్దొర, వేలాగుల నతని మెచ్చి వేడ్కలఁ బొదలెన్. 358

తే. అంత నక్కడ దీవిరాయనికిఁ గొంద, ఱరచి మేపరిపోటరు లింద్రజిత్తుఁ
డీల్గి చనిన తెఱం గెల్ల నెఱుఁగఁ జేయ, నాతఁ డమ్మాట విని గుండె లవిసి చెదర. 359

తే పిడుగు పడ్డతెఱంగునఁ బుడమిఁ ద్రెళ్లి, సొమ్మగొని కొంతవడికి లో నుమ్మలికల
వెచ్చ నూర్చుచుఁ దెప్పిలి వెల్లివిరియ, వేఁడికన్నీరు గొనగోళ్ల దోఁచుకొనుచు.

ఆ. మిక్కుటంపుజాలిఁ బెక్కుతెఱంగుల, వెక్కివెక్కి యేడ్చి స్రుక్కిసొక్కి
పోఁసుదిండి తీవరులు బుజ్జగింప నతఁడు గొంతదిట మెదం గుదిర్చి. 361

క. తేరుల వేగల మెకములు, వారువములు కాలురులును వావిరి గొలువన్
బేరులు బూరలు గాళెలు, బోరుకలఁగ నపుడె తరలి పోరికిఁ జనియెన్. 362

క. చని రామునిమూఁకలఁ బైఁ, గొని మెకములఱేఁడు లేడిగుంపులపై డా
కొని పారిసమరు తెఱఁగున, మనుకొని పోసీక పొడిచి మోఁదఁ దొడంగెన్. 363

వ. మఱియుం బెరయ విరియుచుం గెరలి పోరెలు సబ్బురంపుఁగోఱికోఱలం గొఱలి యొఱల పఱలుకఱుకు చుఱుకుటడిదంబులు వెఱికి యుఱికి నఱికి నెఱఁకు లుఱక చుఱు కలరం గిఱికొల్పుచు గెలుపుబలుపు లిగురొత్త హత్తిమొత్తంబులఁ గ్రొత్తనెలగత్తిమొత్తంబులం దుత్తుమురుగా మొత్తి నెత్తురులం జొత్తిలం జేయుచుఁ బాయని పేరమ్మున గ్రుమ్మి క్రొమ్మెఱుంగుటమ్ము లుమ్మడి యొమ్ము లురులం జిమ్మి యిమ్ముల సొమ్ము గొన నొనర్చుచుఁ బేర్చి యార్చి బల్గొనయేర్పు కార్చిచ్చువడువున నదరి తొడలు మెడలు నడుములుం బొడుములుగ జెడిసంపుటినుకబడియల బడలువడ నడఁచుచు నిండారుగండు మిండుకొన నండగొనక దిండుకలగ్రంద గొడ్డండ్ల గుండెలకండలు గొండలుగఁ జెండుచెండాడుచు మిటారంపుటారులం బటాలుపటాలనఁ దుటారం బదర నదచి హుటాహుటిం బటాపంచలుగఁ దఱుముచు మేటిపోటరితనంబు వాటిల నూటిగ నీఁటియలు నాటుకొల్పి యుసురు లెడల మీటుచుఁ బట్టుగుచుట్టువాల్వెట్టులం బొట్టలుఁ జట్టలుం బిట్టు పగిల్చి యిట్టట్టు సేయుచు వీఁకం దోకొని బాఁకులఁ జేగరొఁకలి తాఁకులఁ గాక దీఱఁ జదిపి ప్రోకలు వెట్టుచు వంకులఁ గొంకు లేనిబింకంబు లింకించుచుఁ బల్లెంబుల నుల్లంబులు జల్లని యుల్లంబోవ మొల్లం బగు పెల్లు సూపి త్రెళ్లింపుచు నురియల గొఱియలంబలె సిఱియ నెఱియఁ బఱియలుగఁ గ్రుమ్ముచు మారి మసంగిన తెఱంగునం బారిసమరి యొక్కఁడు దానయై యొక్కొక్క మెఱుంగుటమ్మునఁ బెక్కండ్ర నుక్కడంచి వేయువేఱ గంధమాదను నైదుకోలల ద్వివిదు నాఱునారసంబుల వినతు నేడుచిలుకుల మైందునిఁ జొవంచగిట్టల గజు నెనిమిదికోలలఁ గుముదు నైదమ్ముల

శరభు నెనుబదేనుతూపుల నంగదు నెనిమిదిబల్లెంబుల హనుమంతు నిరువదిగఱికట్టియల గవాక్షుం బదిమఱుఁకుల నొప్పించి నని చినములు మోదుగులచందంబు నొందించె నంతఁ గాళ్లు దెగి త్రెళ్లువారును బొట్ట లురలి గిట్టువారును దొడలు విఱిగి యడలువారును జేతులు నలిగి బీతులు గొనువారును జబ్బలు వడి బొబ్బరించువారును గుత్తుకలు దెగి యుత్తమిల్లువారును బొమ్మలు నొచ్చి సొమ్మసిలువారును దఱులు వ్రస్సి యొఱలు వారును నడుములు వోయి యిఱుకలఁ గుడుచువారును విఱిగి సురుగువారును వ్రేఁగి లోఁగువారును గంది కుందువారును వ్రాలి కూలువారును నెఱచి పఱచు వారును నై పలుదొసంగుల నెసంగుచుండి రప్పుడు. 364

క. వెలుఁగులరాయనికొడు కొక, మల గొని యమ్మేటిసోఁకుమన్నియపై ని
మ్ములఁ జనుచో నెఱనుగఁటిమి, యలర విరూపాక్షుఁ డతని కడ్డము దాఁకెన్. 365

తే. తాఁకి జెడిదంపుములుకులు దఱుచు నింప, నక్కడిఁదిజోదు దా నవి లెక్కగొనక
వానితేరున మావులఁ బో నడంచి, యదరుటయుం వాఁడు జంగునఁ బుడమి కుఱికి.

ఆ. కోఁతిపేనిఁ బొదివికొనినపు డిరువురఁ, జెనసి బిట్టు పోరు సేయుచున్న
తొగలదాయకందు దూఱి యారక్కసు, బోర యవయఁ బొడిచి పొలియఁ జేసె.

ఆ. వానితోఁడఁబుట్టు వైనయున్మత్తుఁడ, క్కొమ్మమెకపుమిన్నఁ గ్రమ్మి పెక్కు
చందముల దురంబు సలిపిన నాతఁ డ, ద్దొసకారి నటులె తునిమివైచె. 368

క. వైచిన తెఱఁగు సుపార్శ్వుఁడు, సూచి కడుం గినిసి కోఁతిజోదులపైఁ బె
న్బూచివలెఁ దొడర నంగదుఁ, డేచినబీరమున వాని నెదిరించి వడిన్. 369

సీ. కొండ యొక్కటి వైచి గుఱ్ఱము ల్దేరును నుఱుముగాఁ జేసిన నుఱక వాఁడు
పదితూపు లంగదుపై నేసి మూఁడింట వేఁడివేలుపుకట్టి వాఁడి నెఱచి
మొగి గవాక్షుని నైదుములుకుల నొప్పించి యార్చిన వేల్పురాయనిమనుమఁడు
గినుకతో నొకద్రుడ్డు గొని వానియొమ్ము పగిల్చిన సోలి పేగిరమె తెలిసి

తే. వాఁడు గ్రమ్మఱఁ గొట్టును వాలికొడుకు, బోర వ్రేసిన నులికి యప్పోటుకాఁడు
పొలసుమేపరిఁ బిడికిటఁ బూని పొడువ, నల్ల గ్రక్కుచు నేలపైఁ ద్రెళ్లి యార్గె.

తే. అట్లు మొనగాండ్రు ముగురు నీఱగుటఁ జూచి, యక్కజంబుగ రావణుఁ డడవిమనికి
మెకపుబంటులపైఁ బగ మీఱఁ దేరు, పఱపి తఱిమిన వారలు వెఱచి పఱచి. 371

క. ఒదయనివరిఁ జేరిన నతఁ, డదరెడునెయ్యమున వారియలు కుడుపుచు ని
వ్వడి విలు సైకొని యానం, బుడుమేపరికొలపుమేటిజోదు నెదిర్చెన్. 372

క. ఎదిరించి కడలఁ బుడమియుఁ, జదలుఁ బొదువునట్టు లంపజడి నించుటయున్
బెదరక వాఁడును వేఁడిమి, గదురఁగ మొనవాఁడితూపుగములు నిగిడ్చెన్. 373

క. మంటలు మిడుఁగురు లెగయఁగ, మంటం గలపడకు బీతు మాటికి నిడుచున్
మింటం బర్వెను రాముని, వింటం బఱగించువాఁడిపదదలకోరుల్. 374

క. రక్కసులవేనితూపులఁ, జక్కాడుచున్ రాఘవుండు సరగున మరలన్
జక్కాడు రాముతూపుల, రక్కసిగమి కాఁడు నబ్బురం బలరారన్. 375

మ. విలునేర్పు ల్పవరంపువేడ్కలు గడు న్విప్పారుబీరంబులున్
బలుము ల్గింకలు గెల్పుకోర్కు లసము ల్పాతంబులుం జోకమైఁ
దలరం బంటవలంతియల్లఁడును బ్రాదయ్యంపువేల్పంతియున్
బలుచందంబులఁ బోరి రచ్చెరువు దోఁపం జేష్మతో నత్తఱిన్. 376

క. జేవురుకొండలపగిదిం, బూవులు బూరుగులచందమున నెత్తురుల
న్వావిరిఁ దోఁగి పెనంగిరి, రావణుఁడును రాఘవుఁడు దిరం బగుకడిమిన్. 377

తే. అట్లు నెఱజోదు లిర్వురు నదరి పెక్కు, కడిఁదితూపులఁ బోరాడు నెడల సోఁకు
మిన్న రాకాసిమూకకి యామున్నచేని,పై సిగిడ్చిన నది దద్ద పఱపు మీఱి. 373

చ. ఎలుఁగుమొగంబులు న్మఱియు నేనుఁగుమోములు దున్నమోములుం
జిలువమొగంబులుం గోదమసింగపుమోములు గాగిలంపుమో
ములు పసిదిండిపెన్మెకపుమోములు పుల్గుమొగంబులు న్మొద
ల్గలపలుమోము లూని పయిఁ గ్రమ్మినఁ గన్గొని నేలచేఁ డొగిన్. 379

క. చిచ్చఱతూపు పఱి గూరిచి, క్రచ్చఱ రక్కసునిబూటకపుముల్కి గడున్
జెచ్చెర నడఁగఁగ నేసెన్, హెచ్చరికలఁ జదల వేల్పు లెల్లం బొగడన్. 380

తే. మయుఁడు దబ్బఱ మీఱ నేమమునఁ జేసి, యిడినముల్కి గడంక నీరేనుఁగలల
తోడివేలుపు సిమ్మినఁ దోన వేల్పు,గాణతూపేసి దొరదానిఁ గ్రమ్మఱించె. 381

క. వెండియు మిడుగురు లుమియుచు, మండెడువాల్తూపుగముల మాఁసిచేదున్
దండి పొలదిండిరాయఁడు, నడగొనక పోరుచుండె రక్కజ మొదవన్. 382

ఆ. అపుడు పడమనుండి యరుదెంచుసింగపు,గోదమపోలె. జెలఁగి కొమ్మమెకపు
పాఁజునడుమనుండి పఱతెంచి లక్ష్మణుఁ, దరుదు మీఱ సోఁకుదొరను దాఁకె 383

ఆ. తేరు గడపువాని దిగ్గన నొకకోలఁ, ద్రెళ్ళ నేసి యొంట విల్లు దునిమి
పడగ యొంట నేలఁ బడ నేసి యైదుపె, న్గోల లతనియెదను గ్రుచ్చి యార్చె

వ. విభీషణుండును జెడిదంపు దుడ్డున నరదపుమావుల నుఱుము చేసిన నప్పొలదిండియొద యఁడు కొండపైనుండి కుప్పించుకొదమసింగంబు తెఱంగునఁ బుడమి కుఱికి మిక్కుటంపుఁగినుక నవ్విభీషణుపై మయుం డిచ్చినసత్తి నిగుడించిన. 385

తే. అది జగంబుల నేర్చుచు నదరునగ్గి,కరణి మంటలు మిడుఁగురు ల్గదలుకొనఁగ
వచ్చుచో మర్వ సేసినవాని దునుచు, కొనుటె తగ పని లక్ష్మణుఁ డనువు మీఱి.

తే. తనవెనుక నవ్విభీషణుఁ దలఁగ దిగిచి, తూఱి యాసత్తిపైఁ బెక్కుతూపు లేయ
సరకుగొన కది నిగిడి యబ్బిరుదుమగని,బొమ్ము గాఁడినఁ ద్రెళ్ళి వే సొమ్మసిల్లె. 387

క. అప్పుడు రావణుఁ డెంతయు, నుప్పొంగుచు పేసిమీఁద నురువడి బెరయన్
దిప్పలఁ గ్రొక్కారుతూపులు, గుప్పించి కలంప మిగులఁ గొఱకొఱ నతఁడున్. 388

తే. వేఁడి సూపెడుకటుక్రొవ్వాఁడితూపుగములు దద్దయు నెఱఁకులు గాఁడ నేసి
విరులమోదుగుతెఱఁగు గావించుటయును, విఱిగి రక్కసిదొర కుసు ల్వీడి చెదర.

క. కడ లేనివెఱపు మదిలోఁ, గడలుకొనం బ్రాఁతవేల్పుగములు గలంగన్
పడిఁ బాఱె లంకఁ జొచ్చెన్, గడు రాముని రూపుఁ దలఁచి కళవళపడుచున్. 390

తే. అంత నచ్చట రాచూలి వంత బెరయఁ, దోడఁబుట్టువుఁ గాఁడినతూఁపు వెఱికి
వైచి క్రొవ్వేఁడికన్నీరు వఱవ వాఱఁ, బలుదెఱంగుల నిట్లని పలువరించె. 391

క. అహహా సయిదోడ నీ విటు, రహి సెడి యాలంపుఁబుడమి వ్రాలి కడు న్లోఁ
గి హుళిక్కి నిదుర వోయెదు, తహతహ డెందంబులోనఁ దల మయ్యెఁ గదే. 392

క. అడవులఁ బసుబార్గేఁదులు, గొడిసెల కొడిగట్టి సాఁకుకొంటివి సుమ్మా
బడలిక నిపు డిజ్జగడపుఁబుడమిం బవళించి నిదుర వోయితొ తండ్రీ. 393

తే. అప్పపసుపున నడవుల కరుగునప్పు, డప్పగించె సుమిత్ర నెయ్యమున మాకుఁ
జెల్ల దో యిందు నిను డించి యెల్లి యరిగి, యప్పుడంతుక కిక నేమి చెప్పువాఁడ.

క. పేదఱిక ముడుపునవలా, గాదిలిసైదోడుతోడఁ గనుఁగొన నెపుడున్
మాదిరి యగునీనెమ్మొగ, మీఁదెస సొం పెడలి యుంట కెటు లోర్వ నగున్. 395

ఆ. అబ్బపాటు గాంచి యడవుల కరుదెంచి, తెఱవ గోలుపోయి తిరుగుచున్న
నిట్టికీడు నొందె కట్టడివయ్యుంబు, నకట యింక నేమి యనఁగఁబోలు. 396

ఆ. నేల యేలుకొనెడుజోలి య దేటికి, నేలచూలిమీఁద నేల యాస
మేల్గొనంబు లూని మెలఁగుముద్దులరాచకూన యింక నీవు లేనియెడల. 397

క. అని పలికి యంత కంతకుఁ, బెనగొను నుమ్మలికతోడ బిట్టడలుచు న
వ్వినుతరతనపువంగడపుం, బెనురాయఁడు నేల వ్రాలి పెం పెడలంగన్. 398

ఉ. దాయను గెల్చు టెంకఁ గలదా యను రాచకొలంపుఁగల్వవిం
దా యను నాడెమైనబిరుదా యను రక్కసికార్మొగుళ్లయాఁ
దా యను బీర మూన వలదా యనుఁ బిల్చిన నాఁకిండరా
దా యను బన్న మొందితిఁగదా యను నీకును నంగదా యనున్. 399

ఉ. డాయ నదేల రావు బెగడా యను నెక్కటిచివ్వగెల్పుకాఁ
డా యను ముద్దురాకొమరుఁడా యను మేలిగొనంబు లూనుప్రో
డా యను సోయగంపుమరుఁడా యను నెన్నికఁ గన్న నేలఱేఁ
డా యను మేటిజెట్టిమగఁడా యనుఁ బల్కుర తమ్ముఁడా యనున్. 400

తే. అనుచు నొరలెడుదొరను గన్గొని సుషేణుఁ,డిట్టు లని పల్కె నక్కటా యెపుడు నిబ్బ
రంపుగబ్బలి వనఁ దగి పెంపుఁ గన్న, నీకు నడలంగఁ బాడియే నేలఱేఁడ. 401

ఆ. ఇంతవ్రంతఁ గుంద నేల సీతమ్ముని,యొడల నిప్పు డుసురు లున్న వెన్న
గాడ్పుచూలిఁ బనిచి క్రన్ననఁ దెప్పింపు, మద నెఱింగి మందు లెదఁ జెలంగి. 402

సీ. అని హనుమంతుఁ గన్గొని మేల్చురద నీవు గ్రన్నన నీయుప్పుకడలి దాఁటి
చేసినకడఁకతోఁ జెల్లుదీవియు జిడ్డుకడలియుఁ గడచి రొక్కపుటొడయని
కడఁ జని ద్రోణ మన్గట్టును జాబిలిగుబ్బలియును హత్తి కొఱ్ఱ నంను
సావర్ణ్యకరణియు సంధానకరణియు సంజీవకరణి విశల్యకరణి
తే. యనఁగఁ బరఁగి నద్దెఱఁగుల నలరుమందు,లరసి దొరకించుకొని తమ్మియఱుఁగు దూర్పు
మలను బొడమకతొల్తనె మరలి వచ్చి,లక్ష్మణుని మన్చి యసముఁ దెల్లముగఁ గనుము.

తే. అని సుషేణుఁడు దెల్పిన నలరి గాడ్పుకొమరుఁ డక్కర్జమున కియ్యకొనెను నెడల
వేలతేఁడును నతనిఁ బెన్నెనరు మీఱ, బుజ్జగించుచుఁ బయనంబుఁ బూన్చి పలికె.

క. రమ్మా పయ్యరకుఱ్ఱఁడ, పొమ్మా వెసఁ దూము పేరఁ బోలు పగుములకున్
దెమ్మా మందుల లక్ష్మణు, నిమ్మా క్రమ్మఱ జగంబు లెన్నఁగ మాకున్. 405

క. విను మనుమఁడ వినుమనుమఁడ, మనఁ దనవిననీకు నెందు నడ్డము గలదే
యని కౌఁగిట నిడుకొని దీ,వెన లెన్నేనియు నొసంగి వీడ్కొలుపుటయున్. 406

తే. ఏలికకు మ్రొక్కి గాడుపు నెదఁ దలంచి, కడిమి నాతండు వడి నుప్పుకడలి దాఁటి
కోన లేఱులు దీవులు గుబ్బలులును, వరుసఁ గడచుచు వ్రేల్మిడి నరుగునెడల. 407

ఆ. త్రోవ నొండుచోట రావణుపంపునఁ, గాలనేమి యనెడుకడిఁదిరక్క
సుండు నుక్కు మీఱ జోగిరూపూని పె,న్నీసపుఁదోఁట యొకటి నిలిపి యుండు.

తే. జడలు రుదురక్కపేసలుఁ జాలఁ బూని,బూదిమెయి బూసి పులితోలుమీఁదఁ గూరు
చుండి ముక్కుచు గన్నులు నొనరమూసి,కొని యుఱక్కిగ నేమేమొ గొణగుచుండె.

క. అటు లున్నతపసి కాఁపిక్, దటుకునఁ బొడగాంచి సోఁకుదయ్యముకం ది
చ్చటఁ దోఁటయుఁ దపసియు నుం,డుట మును గన్గొనము నేఁ డెటు ల్పొదవెనొకో.

ఆ. తెరువు దప్పె నేమొ వెరవున నిజ్జడ, దారిచేవివలన దారిఁ దెలిసి
యరుగవలయు నంచు నతనిపజ్జకుఁ జని, యొలమిఁ గేలుదామరలు మొగిడ్చె. 411

క. తనమొరవుఁ జేరు నరిగెను,పసియు నెఱిఁగించి దప్పి వాయఁగ నీర్వేఁ
డిన నాటక్కరిజోగియుఁ, దనజారీలోనినీర్పు ద్రావు మటన్నన్. 412

తే. అలఁతినీ కృవి సాల నియ్యంద నిపుడు, గొలను నిల నుండెనేని కన్గొనఁగఁ జేసి
సేద దీఱినతఱిఁ ద్రోవ సెప్పుమయ్య, పుడమివేలుప నెయ్యంబు వొదల ననుడు. 431

ఉ. దబ్బఱజోగి డెందమునఁ దద్దయు నుబ్బుచుఁ బల్కెఁ గోఁతిరా
బొబ్బమెకంబ రాఘవుఁడు పూనినకర్జము మాకు వాలె ము
న్నిబ్బర మొప్పఁ జేయ నగు నీ కిపు డిచ్చెద నెల్లమందులుం
గొబ్బునఁ గొమ్ముఁ వేసరుచు గొందలవెంబడి నేఁగ నేటికిన్. 414

క అదె కొలను తూర్పుదెసఁ జె, న్నొందవెడు నట కేఁగి దూప యుడుగఁగఁ దెలినీ
ఱు దగం గ్రోలి యిట్టు రమ్మా, కదపడి కర్జంబు లెల్ల బాగగు ననుడున్. 415

తే. సంతసం బంది యక్కోఁతిచందమామ, వైర మేతెంచి యాచెలువంపుఁగోలను
సొచ్చి సీరాముచోఁదమి హెచ్చనొక్క, మొసలిపఱతెంచియకనిఁబొంపెసఁగఁ బట్టె.

తే. పట్టుటయుఁ జాపలేక యాజెట్టిమగఁడు, వఱుజూరూ పూని కుత్తుకబొఱియఁ జొచ్చి
లోనఁ దద్దయు మెయి వెంచి దానిపొట్ట, పఱియ లోనరించి డిగ్గన బయలువెడలె.

ఆ. అపుడు మొసలి వేల్పుటలివయ్యె తనతోంటి, కతయుఁ నచట నున్నకల్లతపసి
తెఱగు నతనితోడ నెఱిఁగించి పసిడితే, రెక్కి వేల్పుప్రోలి కేఁగె నంత. 418

క. కరువలికొమరుఁడు మది నబ్బుర మందుచుఁ గల్లతపసిఁగజకుఁ జనిసెఁ
గర మరు దందుచు వాఁడు, స్వైర వొప్పఁగఁ గొమ్మమెకపునెల కిట్లనియెన్. 419

ఆ. బ్రదుకుమందు తెల్లఁ గొదుగక యొసఁగెద నిప్పు డొజ్జపూజ యిమ్ము మాకుఁ
గోఁతితేద యనినఁ గొఱకొఱ నతఁ డీవె, కొమ్ము పూజ యనుచు గొమ్ము గ్రుద్దె.

తే. గ్రుద్దుటయుఁ వాఁడు వాల్గాని తద్దఁ గినుకఁ, దన్ను వ్రేసిన నక్కోఁతిమిన్నసోఁకు
బిరుసుఁ బడఁ దన్ని యఱచేత బిట్టుపఱచి, స్రుక్కఁ జేసిన వాఁ డొకపక్కి యగుచు.

క. ముక్కునఁ జీఱియు గోళ్ల, న్రక్కియు నొప్పింప నడవినట్టువడీరుం
డక్కూకఁ గ్రద్ద గ్రుద్దియు, ఱెక్కలు దునుమాడియు న్నెఱినిఁ గుందించెన్. 422

ఆ. అంత వాఁడు సింగమై యార్చి కోఱలఁ, గ్రుచ్చి గోళ్ల వ్రచ్చి కోఁతిఱేని
బిట్టు నొంప నతఁడు పిడికిట వొడిచి పెల్లడుప నచ్చెనంటి యుక్కుదక్కి. 423

తే. వేఁడివేలుపుకుఱ్ఱఁడై వేగ వచ్చి, గామ్పుకొమరుఁడ యిపుడు లక్ష్మణుఁడు బ్రతికె
మందులకుఁ బోవవలవదు మరలి రమ్ము, ఱేనియానతి యిది యని పూని పలికె. 424

సీ. పలికిన విని జకల్గలకోఁతిమిన్నమే పుట్టు విచ్చటి కిప్డు ప్రొద్దుకొమరుఁ
డేటికి వచ్చు నం చెద నెంచి కాకుంటఁ దెలిసి యుక్కుశర నపాలసుదిండి
బోర బల్పిడికిటఁ బొడిచిన నెత్తురుల్ గ్రక్కుచుఁ గూలి వాఁ డక్కుజాబు
గా కతకృరగుఁ డై కఱకుటమ్ములు పెక్కు నిగుడింపఁ దోఁక నన్నియును నఱంచి

తే. కోఁతిరాయఁడు పఱచియు గ్రుద్ది కఱచి, తాఁచి చీఱియుఁ బుదమిపై వైచి త్రొక్కి
పొగరుటేనుఁగు నెత్తమ్మిపువ్వు ద్రెంచు,చందమున వానితల ద్రుంచి పరగఁ జనియె.

క. చని ద్రోణము గన్గొని చ,య్యన మందులు వెదుకొనిన నది యించుకయుం
దమ సరకుగొనక యుండినఁ, గినుక నతఁడు మలయె పెల్లగించెఁ గడిమిన్. 426

ఆ. పెల్లగించి గట్టు పెంపారఁ దెచ్చుచు,నున్నయెకల నచట మున్ను గాచి
యున్నవారువంపుటొడలికేడేలు పెక్కండ్రు దాఁకుటయును వాండ్రఁ జిదిమి.

క. తెమ్మెరపడి నిబ్బలియుఁడు, గ్రమ్మఱి వచ్చునెడ నుప్పుకడలికడను బీ
ర మ్మొదవ మాల్యవంతుఁడు, నెమ్మదిఁ దార్కొనిన లావు నిగుడ నతండున్. 428

ఆ. ఒడలు వెంచి తుంగమడువు సొచ్చి కలంచు, వామువేస్గపోల్కి నదరి మూఁకఁ
జిదిమివైచి వానిఁ జిలువజగంబున, కనిచి కడలి దాఁటి యలవు మెఱయ. 429

ఆ. ఆకసమున వచ్చునప్పు డమ్మందుల, మలవెలుంగు ప్రాఁకువెలుఁగటంచు
నువరి చూచి రాముఁ డొలియుచు సింగిణిఁ, దూపు గూర్చి యేయఁ దొడఁగుటయును.

తే. ప్రొద్దుకొమరుఁ డెలుంగులపెద్ద సోఁకు, మిన్నయును వచ్చి పేఁద వి న్విన్నమనుమఁ
డెలమిఁ గొనివచ్చుమందులవెలుఁగుగాని, యదిజగమువిందువెలుఁగు గాదనుచుఁ దెలిపె.

ఆ. క్రమ్మఱించి రంతఁ గ్రన్నన మందుల, గట్టు దెచ్చి నిలిపి గాలిచూలి
గేలు మోడ్చి యున్న నేలతాలుపుమిన్న, గారవమున నతనిఁ గౌఁగిలించె. 432

సీ. అప్పు డారాచూలియానతిఁ గాంచి సుషేణుఁ డమ్మెట్టుపైఁ జేరి మందు
లారసి కొనితెచ్చి నేరుపుతోఁ బరఁగింప లక్ష్మణుఁ డుబ్బరంపుఁదేజ
గదుర గొబ్బున లేచె గానుఁబట్టియుఁ గ్రమ్మఱ నబ్బలుగట్టు మొదలి
పట్టున నిడి వచ్చి పటువలంతిజేనికి మ్రొక్కి లిడిన మన్నించి యతఁడు

తే. దమ్ముఁడునుఁ దాను నెమ్మితోఁ గొమ్మమెకపు
మొత్తములఁ గూడి పోరికి మొనయుచుండె
నంత నత్తెఱఁగంతయు నాలకించి
దీవిరాయఁడు డద్దయుఁ దిగులు పూని. 433

క. మగఁటిమి దిగఁ ద్రోచి కదుక్, వగచుచు నెస నొజ్జచేరువకుఁ జని చేతు
ల్మోగిచి తనగోడవ లన్నియు, నగపఱిచిన నాతఁ డిట్టు లని వాక్రుచ్చెన్. 434

తే. రక్కసులఱేడ నీ కిటుల్ స్రుక్క నేల, దురములోపల మార్తురఁ దొడరి గెలుచు
దాడ సెన్నెసిఁ గల నెద జంపు మాలి, చెయువుదొరలనిప్రేలిమి సేయుమొకటి. 435

క. అది నిండెనేని నిన్నని, గదియంగా నెఱచు జేసికన్నులదొరయుం
గొదగక నీ వాప్రేలిమి, పదిలముగ నొనర్చు మెల్లపనులుం బాఁకన్. 436

ఆ. అనుచు దానిచంద మంతయు నెఱిగించి, సుక్కురుండు పనుప సోకుఱేఁడు
మరల దీవి కరిగి మఱి మీఱికోటలు, గట్టి సేసి మూఁకఁగాపు పెట్టె. 437

సీ. అపుడె మేటిపజీనుఁ డగుమిందునాల్కరక్కసుని బిల్చి కరంబు గారవించి
బలియుండ నీవు నీబోఁటులఁ దరలక నగడు గావు మటంచుఁ దగులుపఱిచి
నీటఁ గ్రుంకులు పెట్టి నేమంబుతోఁ గావికోకలు గందంబు గ్రొవ్విరులును
బూని పాఁపజగంబుబోఱియ సొచ్చి నెడంద తీనియ యలరించి దానియందు

తే. నగ్గి రవులించి యావాలు గుగ్గిలంబు జీడిపుడకలు కానుగుచిదుగు లగరు
నేయి తేనియఁ గల్లు పా ల్నెత్తురులును, గఱికపోఁచలు పూల్వెండ్రుకలును మఱియు.

క. ఎలుఁగులు కాకులు గ్రద్దలు, చిలువలు తాఁబేళ్లు మీలు జీకలు రాపు
ల్గులు గొఱియలు మొసపలు మేఁకలు పందులు తేళ్లు మొదలుగా వేల్చునెడన్.

క. అప్పొగ జగముల నెల్లం, గప్పినఁ గని కడవచెవ్వుల గామిడిసైదో
డప్పుడె రాముని కత్తెఱఁ, గొప్పఁగ విన్నప మొనర్చ నొదయఁద వేగన్. 440

క. అక్కజపుఁగోఁతిజోదులఁ, బెక్కండ్రం బిలిచి మీఁద బిఱబిఱఁ జని యా
రక్కసునిప్రేల్మి మానిచి, గ్రక్కున రం డనుచు సెలవు గావించుటయున్. 441

క. అవ్వాఁడిమగలుఁ దద్దయు, నెవ్వడి గొని లంకఁ జొచ్చి నెమ్మి నలరుచుం
గ్రొవ్వఱ రక్కసిమూఁకల, దవ్వుగఁ బోఁ దఱిమి చంపి తరలనికడిమిన్. 442

చ. తలుపులు గీములు న్వ్రాలుగఁ దన్ని కొటారుల నుగ్గు చేసి మే
డలు పడఁ ద్రోచి గేస్తుల నడంచి వెలంకుకల న్మసల్గఁ గం
దుల వెతలం గలంచి పువుఁదోఁటలు గాఁ గొనరించి యొంతయుం
జలము దలిర్పఁ బ్రోలు పలుచందములం జెడఁ గొట్టుపట్టులన్. 443

తే. ఎలమితోడ విభీషణునింటి యైన, సరమ దొలివేల్పుపగఁ దున్నజాడ వారి
కలరఁ జేసన్న నెఱిఁగింప నంగదుండు సరగఁ బఱతెంచి వాఁ డున్నయిరవు గాంచి.

క. తమవారిం బిలిచిన వైరి, తమ చని వా రంవఱుం బోలుసుమేపరి క
ల్గుమొగం దాఁచినపెనుతొఱయి మొగిం బడఁ దన్ని లోని కేఁగి కదంకన్. 3.45

తే. వేలుపులగొంగ యునిచినవ్రేల్మిసరకు, లెల్ల యొకపారె యగ్గిలోఁ జల్లివైచి
వాని బోడిచియు నడిచియుఁ బూని మీస, లూడఁ బెరికియుఁగదలకయున్న గినిసి

క. కదయక యంగదుఁ డపు డా, గదుసరితొలివేల్పులోసగరు దూఱిచలం
బడరఁగ మందోదరిక్రొమ్ముడి పట్టుక తెచ్చి వానిముందఱ నిలిపెన్. 447

చ. నిలిపిన నప్పొలంతి మగనిం దగఁ గన్గొని వాన యల్కయు
మ్మలికము బీతు నుల్లమున మాటికిఁ జేకొనఁ బల్కె నయ్యయో
పొలగవణాపువంగడపుఁబున్నమవెన్నెలతేఁడ నీచెలిం
బలువలు కొప్పు పట్టి పలుబాములఁ బెట్టఁగఁ జూడఁ బాడియే. 448

క. ఆలమునఁ బగరఁ గెలువఁగఁ, జాలక మగతనము దూలి చయ్యన నెంతో
తాలిమిఁ గైకొని హావ్రేలిమిఁ గావింప నెట్టివెర వొదవెనొకో. 449

క. నాకొమరుఁ డింద్రజిత్తుఁడు, లేకుండుటఁ జేటు వాటిలెం గాక యతం
డీకరణిఁ జూచుచుండునె, డాకొని పగతుల్గలంపఁ దక్కరి యగుచున్. 450

తే. అడవి నొడయని గికురించి పుడమికూఁతుఁ, దెచ్చుటను మాఱుగాఁ గోనద్రిమ్మరులు సె
లంగి యిటు లేపుచున్నఁ దలంక వకట, సిగ్గు బీరంబు మాలినచెనఁటి వీవు. 451

తే. కుడిచి కూర్చుండి క్రొవ్వునఁ బుడమిఁ జేని,పడఁతిఁ దెచ్చుట సిట్టిచేడ్పాటు వొదవె
నింక నీప్రేల్మ లన్నియు నింకఁ బెట్టి, యతని జెడిదంపుఁబులుతూపుటగ్గిఁ బడుము. 452

క. అనవుడు నానయుఁ గిన్కయుఁ, బెనఁగొనఁగా లేచి సోఁకుపెద్ద వెసన్ వా
ల్గొని యంగదు వ్రేసి నెలంతను విడిపించుకొని నగరునకుఁ బోఁ బనిచెన్. 453

తే. అప్పు డావ్రేటుచేఁ దారయనుఁగుకొడుకు, సొమ్మగొని నేల వ్రాలినఁ జూచి గాడ్పు
నిసుగు రావణుతలలఁ గ్రొన్నెత్తురులఁ, బోర బెడిదంపుఁబిడికిటఁ బూని పొడిచె.

తే. అంతలోపలఁ జెప్పిరి యంగదుండు, రక్కసునిఁ గేల నడిచిన స్రుక్కి వాఁడు
నిమదద్రుద్ధున నతనిఁ గుదించి వ్రేఁడి, యసిదమున సోఁకునయ్యుముకొమును నేసి.

తే. ఇనుపబడియను నలునిఁ జేయీఁటె ద్వివిదు, సత్తి శతవలి నేసియుఁ గత్తి గజునిఁ
గుఱుచరోఁకట నీలుని మఱియుఁ జెక్కు, కైదువుల నెల్ల నెఱమొనగాండ్ర నొంచె.

తే. వారుదాఁచియు గ్రుద్దియుఁ గేరి యడిచి కఱచి మోఁదియు వానిఁ బెంపఱఁగఁజేసి
మరలి బొబ్బలు వెట్టుచు మాఱు లేని, బీర మొప్పారఁ దమపేరు సేరి రపుడు. 457

క. గాలిసిసుఁ గెలమితో రా, చూలిం బొడగాంచి మిగుల జోఁత లొసఁగి తా
ర్వేలుపుప్రేలిమి నెఱిచిన, జోలి యొఱింగించి మదిని జొక్కు జ్జేసెన్. 458

క. రక్కసిపేఁడుం దద్దయు, స్రుక్కుచు లోనగరు సొచ్చి సొలయుచు పగలన్
బొక్కుడుఁబనవెలిఁ గనుఁగొని, యొక్కుడు చేడ్పాటు దోఁప నిట్లని పలికెన్. 459

తే. మగువ నీ కిట్టు పగలచేఁ బొగలఁ దగునె, జమిలినాల్కలతొడవులసామి యిపుడు
కనికరము దప్పెఁ గాఁబోలుఁ గాక కోఁతు, లెఱచిదిరితుల గెలుచుట యొందు గలదు.

తే. అలమున నేఁడు గట్టిగా నేలఁ బెలిఁ, గూల్చి పగ యెల్ల నుమ్మపుకుఁ గొంకు లేక
గాక యాతనిచేఁ గీడు గలిగెనేని, చిచ్చుఁ జొరు మీవు సెచ్చెర సీతఁ జంపి. 461

క. అనుటయు మందోదరి తన, పెనిమిటి కిట్లనియె జేడ పెనఁకువలో రా
ముని గెలుతు ననెడుతలఁపులు, సునఁబో విఁక నొంను మంచిజాడ మెదకుమా. 462

క. పరికింప నట్ల జేజే, దొరలం గెలిచినకడంకతోఁ దివిరెదు పో
దురమున నీ కారాచూ, లురతోడ న్నాయుకొని గెలుపరాదు సుమీ. 463

ఆ. వినుము తెలియ మొదట వెన్నుఁ డిజ్జగ మెల్లఁ, బ్రోచుకొఱకుఁ జెక్కురూపు లూని
తిరుగుచుండు నట్టిదేవర యారాచ, మానికంబు గాఁడె మదిఁ దలఁప. 464

సీ. మీనుమే నూని ప్రామిన్కు తెక్కలికాసిఁ జెండినబలియుఁ డితండె కాఁడె
తాఁబేటిమే యెత్తి తరిగొండ వీఁపునఁ దాల్చినమేటి యీతండె కాఁడె
బలుకొమ్ముపందియై పసిఁడికన్నులపొలదిండిఁ జీరినవేల్పితండె కాఁడె
మానిసిసింగ మై పూని బత్తునివెత ల్దలఁగఁ బ్రోచినవాఁ డితండె కాఁడె

తే. వడుగ గుచు నేల మూఁడజ్జ లడిగి బలిని, దఱిమిపైచిననిట్ట యీతండె కాఁడె
గండ్రగొడ్డలి తాలిచి కడఁగి గాచ, పిండు నడిచినప్రోడ యీతండె కాఁడె. 465

క. విను మిపుడు నిన్నుఁ దునుమఁగ, బనివడి యీరైదుతేర్లబల్లిదునకు లా
వెనయంగ రాముఁడై యే, పునఁ బొడమినవాఁ డితండు పొలదిండిదొరా. 466

క. కావున గొంకక నీ వా, దేవరదేవేరి నొసఁగి తెఱవి నడపికిన్
వే వెలువదు మనుపులతోఁ, జేవ దిగం బ్రోచి తపసిసింగము వగుచున్. 467

ఆ. మొదలిసిరియె పంటముగుదగాదిటపట్టి, యగుచుఁ బొడమె నట్టిజగముతాయిఁ
దెచ్చి యింతకీడు దెచ్చితి వింక న, మ్మగువ నడుగుకొనుము మనుపు మనుచు. 468

ఉ. కాలికిఁ గేలు సాఁచి యుడిగంబున మ్రొక్కుము రాచమిన్నయి
ల్లాలికి నాడె మైనజవరాలికి దోసపునీరుతాల్పు పెన్
గాలికి జోగికూటుపనిగారపుడెందపుఁదమ్మిజంటము
క్కాలికి మేరమీఱెనుజగంబులమేలికి నేలచూలికిన్. 469

ఆ. దీవిఱేఁడ మఱుఁగు సొచ్చను ముదిమియుఁ, గలుగకుండునట్లుగా నొనర్చె
నట్టు లగుటఁజేసి యకట నీతో సాద, సేరఁ బోల దేమి సేగుఁదాన. 470

తే. అనుచు గారాబురాణి నూరార్చుకొనుచు,రావణుఁడు వల్కెఁగటకటాపూవుఁబోఁడి
తోఁడఁబుట్టులఁ గొడుకుల దొరల బాట్లఁ,బోరిలోఁద్రోచి యిఁక నెమ్మిఁగోరఁజనునె.

క. మలగొంగ మొదలుగలవేల్పుల నందఱఁ బాఱఁ దఱిమి లోఁగనికడిమిన్
దలరుకొడు కింద్రజిత్తుఁడు, వాలిసినచో రాచకీవిపొలు పేమిటికిన్. 472

క. విడువక తపసుల నెల్లం, గడుఁ గలఁచితి మున్ను చలము గదురఁగ నిపు డా
జడదారులలోఁ దూఱినఁ, బడఁతీ కనుఁగొన్నవారు పకపక నగరే. 473

సీ. జముదాడి నుడుగక జముదాడి యుడిగించి గుడియ నేఱులఁబెఱిఁ గుడియఁ బెట్టి
వింట గాడుపుసొంపు వింట నంటఁగఁ జేసి గండ్రగొడ్డట నగ్గిఁ గం డడఁచి
మొసలకైదువ బూచిమొసలవానిఁ గలంచి తులువకత్తిని సోఁకుఁదులువ నొంచి
వంకి లిబ్బిదొరలా వంకిలి నొందించి కొంగవాలున గట్లగొంగ గెలిచి

తే. యెందు నెన లేనికడిమిఁ జెన్నొందె జగము, లెల్ల బలితంపుకీవుల నేలుచుండు
నట్టిమే నొకమానిసి నకట యెట్లు, గావు మని వేఁడుకొనువాఁడఁ దీవఁబోఁడి. 474

ఆ. ఇంత చెప్ప నేల యెఱుఁగుదు రాముఁడు,మొదలివెన్నుఁ డగుట మగుద యెపుడుఁ
జెడనిమేలు గోరి కడఁగితి నతనితో, జగడమునకు నింక వగవవలదు. 475

తే. ఇంతి యామీఁద మేచ్చన్నె లెడలి నీవు, దమ్మిచెలికాఁడు లేనినెత్తమ్మివోలెఁ
గలువరాయనిఁ బాసినకలువవోలె, నుండు మనుటయు సిబ్బితి నూఁకుండె. 476

సీ. అంతట సోఁకుఱేఁ డసమున మోసలఁ గేతెంచి జోదుల నెల్లఁ బిలిచి
పదిదెస లద్రువంగఁ బయనంపుబేరి ప్రేయించి మేల్రవణంబు లెలమిఁ దాల్చి
కరవాలు మొదలగుకైదువ ల్గొని పదియాఱుకుండలు జంటనూఱువేల
నూఱులగంటలుఁ నూఱుపదు ల్మేలి తత్తడు లెల్గుతోల్కత్తళంబు

తే. తిగసిడంబులు గలపైఁడితేరు గడఁక, నెక్కి యెల్లులు జల్లు లెల్లెడల మెఱయ
నరదము ల్మావు లేనుఁగు ల్బిరుదుమగలుఁ, గ్రమ్ముకొని రాఁగఁ బోరికిఁ గదలి చనియె.

ఆ. అపుడు ఖడ్గరోముఁ డగ్నివర్ణుఁడు సర్ప,రోముఁడును గడింది యామతోడ
వెలుఁగుచున్నయట్టివృశ్చికరోముఁడు, దరలి రతనిఁ గూడి కఱకు మీఱ. 478

క. అటు లేఁగినతొలివేలుపు,తుటుములఁ బొడఁగాంచి కోఁతిదొర లచటు మి
క్కుటమగుబీరముతో నొక్కొకటఁ దొడరి చెట్లుఁ జట్లుఁ గొండలుఁ గొనుచున్.

సీ. మొదలిశేషేబాటు లుదుటు మీఱఁగ వారిఁ బొదివి చేయూఁటెలఁ బొడిచి ద్రుద్ల
మోఁది వంకలఁ గ్రుమ్మి ములుకుల నొంచి బల్లెములఁ గూలిచి యడిదముల నఱికి
గుదియల సురియల గొడ్డండ్ల సబళీల సుడికైదువులఁ జెంపు సదలఁ జేసి
మావులఁ దోలి నెమ్మనిఁ జెందు బెండాడి బలుహజ్జమెకములఁ బఱపి తఱిమి
తే. నెత్తురుల హత్తుకొల్పిన నెరయఁ గినిసి, కోనద్రిమ్మరిబిరుదు లక్ష్మణశరేయు
ద్రిమ్మరులచుట్టు ముట్టి చలమ్ము మెఱయ, మలలు మ్రాఁకులుఁ బనుకులుఁ జెలఁగివైచి.

క. చఱచియుఁ గ్రుద్దియుఁ దాఁచియుఁ, గఱచియుఁ జీఱియుఁ గడిఁదిగాఁ ద్రోఁకల ను
క్కఱ మోఁదియు మట్టియు నం,దఱఁ బుడమిం గూల్చి రిపు దళకొత్తంగన్.

సీ. తలలు తాఁజేళ్లు చేతులు గాద్మ మేపరు లెముకలు మీలు గుబ్బములు తరఁగ
లరదము ల్కలమ్ములు నరము లెఱ్ఱలు మెండ్రుకలు నాఁచు దీవప్రేవులు నెగళ్లు
మొండెము ల్మాసఖలు కండలు కప్పలు మెద దస లేనుంగుపదువు దీవు
లెల్లులు నురువులు నల్ల నీళ్లు గయాళిబూచులయార్పు లబ్బురపుహొదలు
తే. గాఁగ మున్నీటి కుద్దియై కలనుపుడమి, దద్దఁ గన్పట్టె నపు డడిదంబుమెండ్రు
కలపాలసుడింపిక్రలకట్టు గాలిచూలి,పైఁ గడఁగిన నజ్జగంటుఁ గినిసి. 482

తే. వానిపైఁ ద్రేల్ప నుఱికిన వాఁడియలుఁగు,మెండ్రుకలు గాఁడుటయు నల్ల వెల్లివిరియ
సొమ్మ గొని కొంతసేపున కుమ్మలిక ద,నర్పఁ దప్పిరి యతఁడు పెల్లావు మెఱయ.

ఆ. కొండ యొకటి వెఱికి గొబ్బున వానిపై, వ్రేయ నది కడింది వెలయఁ బెక్క
తునియ లగుచు రాలెఁ దులువతోల్వేలుపు,మేలుబాలికఱను మేను సోఁకి. 484

క. అమ్మల వమ్మయి చనుట ది,రమ్ముగఁ బొడగాంచి కోఁతిరాయఁడు గడిమిం
గ్రమ్మఱ నొకగట్టారే, ద్రిమ్మరిపై నేసి జమునితెంకికిఁ బనిచెన్. 485

క. విసదారిమెండ్రుకలర,క్కసుఁ డస మెఱయంగఁ గోఁతిగములఁ దఱుమఁగా
వెసఁ గాంచి వాలిగాదిలి,సిసుఁ గాతనిఁ దాఁకి కేల నెవ్వడి నడిచెన్. 486

తే. అనుచుటయు వాఁడు మెండ్రుకపడగదాల్పు, చాల్పునెమ్మోముదొఱియవిసపుఁగడింది
యింగలపుమంట లౌకసుం బెల్లఁ బొదువ, నదరి కదు నార్చి యతని బిట్టదల నేసె.

క. అది సైరింపక యంగదుఁ, డెవ గొఱకొఱ నిగుడ వాని నేచినబలిమిం
బొదివి నదునెత్తి పిడికిట, నొడుఁగక పఱియలుగఁ, బొడిచి యుసురులఁ బాపెన్.

ఆ. నీలుఁ డంతఁ గఱకుతేలుమెండ్రుకలరా,కాసిబాటుఁ బొదివి కడిమి నొక్క
కడిమి వెఱికి వైచి మడిపె జేజేలు మి,న్నునఁ జెలంగి కన్గొనుచును బొగడ. 489

క. అపు డగ్గివన్నెతొలివే,లుపు దననెమ్మేనిమంటలు గడిందిగ గా
డుపుతండ్రిఁ బొదువఁ గోఁతిప,దుపుపై నరదంబు నెమ్మితోఁ బఱపుటయున్. 490

తే. కొదమపసిడిండిమెకము గన్గొన్న బుడుత,లేడిగమివోలెఁ బికపికలాడుకొనుచు
విఱిగి యమ్మూఁక రాముని వెనుకఁ జేరు,కొనినఁ గన్గొని యాతఁ డచ్చోనఁటి నెదిర.

క. ఎదిరిన వాఁ డరదము వడిఁ, గదియంగాఁ దోలి తూపుగము లద్దొరపైఁ
గుములుకొన సేసి పేఁడిమి, వెనచల్లిన నగ్గి రాచవెన్నెలపేఁడున్. 492

మ. ఒకఁ డ్రొవ్వాఁడిలకోరి సింగిణి నసు బొప్పారఁ గిల్గొల్పి వా
నికయం ద్రాలెడువిల్లు ద్రుంచి కడిమి న్వేత్వాలు సేకొన్న వే
లోకబల్లెంబునఁ జెండి ద్రుడ్డు గొని పై నుంకించి యెత్తెంచుచో
నెక లీన్మల్క యొకండు ప్రేసి తలఁ ద్రుంచె న్వేల్పు లగ్గింపఁగాన్. 493

ఉ. అతఁడి దీపటేఁడు ఒక మంతయుఁ గాల్పఁ గడంగుచున్న చిం
బోతుమామాయిజోదు నెనఁబోలుచుఁ గన్నుల నిప్పు లొల్కఁగా
వే తన తేరు రాచననవిల్తునిపజ్జను డాయఁ దోలి యా
రాతి కును ల్లోనంగిసదొరం గని బింక మెలర్ప నిట్లనున్. 494

ఆ. మన్ను టేఁడ కొంద అన్నువనంబును,వింఁడిబంట్లఁ బోరఁ జెండినాఁడ
నంచు నిక్కి జిపు డొకించుక నాలా వె,ఱుంగ నేర పెట్టివెంగలివాఁ. 495

ఉ. కలఁచితి పేల్పుటేని నుడిగంబులఁ బాన్చితి నగ్గి నజ్జముక్
గెలిచితి సోఁకుపెద్ద నడఁగించితి వల్లియత్రాడుఁదాల్పుఁ జి
క్కుఁ బెరయించితిం ఒరలుకట్లని గొట్టితిఁ జాగకాని బూ
చులదొరఁ దోలితి న్మిగల సొంపున నేలితి ముజ్జగంబులున్. 496

తే. ఎల్లజేలఁ గూడి జాబిల్లితాల్పు, గొలువు గూర్చుండునవ్వెండికొండఁ గేలఁ
బూలచెండు తెఱంగునఁ బూని చాల, మెప్పు లందితి నీక నొండు నెప్ప నేల. 497

తే. అలనున నేఁడు నిన్నుఁ జక్కాడి బూచి,గముల కామెతఁ బెట్టెదఁ గాక జాడిఁగి
పోవ నిత్తునె యనుడు నవ్వాలసుబిండిఁ, జూచి యనదుగ నవ్వి రాచూలి పలికె.

ఆ. పెక్కునోళ్ల నుఱక పెక్కుడెఱుంగుల, నఱచె దిట్టిపట్టికొఱకు లేల
మగతనంబు నెఱపి జగడం బొనర్పుము, సోఁకుటేఁడ యొందు నుక్కి చనక. 499

ఆ. నీకడింబిలావు నే నెఱుంగనె వాలి, తోఁకఁ జుట్టి కడలిఁ ద్రోయుటయును
కోఱను బెట్టి వేయిచేతులయొకిమీఁడు, విడుచుటయును జగము వెల్లివిరిసె. 500

క. అబ్బటువువాలుతాల్పున, గుబ్బలివిలుకాఁడు నంచగుఱ్ఱపుజోదుం
గొబ్బున నడ్డము వచ్చిన, నిబ్బరముగఁ బోర నేఁడు నినుఁ డాగటార్తున్. 501

ఆ. అనుచుఁ గఱుకుతూపు లదరంట నేసిన, మలికి వాఁడు వాఁడిములికిగములు
మన్నుటేనిమీఁద నెన్నేనిఁ బఱపి యీ,రైదుకడలు నర్రువ నేర్చి మఱియు.

శా. జేజేగొంగ పసిండిపింజలపసు జెన్నొందువాల్తూపు లా
రాజాబిల్లిమయి న్నిగుడ్చ నతఁడు న్రాకాసిమేల్పాలిపైఁ
జే బారం జెడిదంపునారసము లెంతేని న్వడి నైవ్వచి మే
న్గాఱుంబూనకు నందు లేక కదియ న్గాయంబులం జేసినన్. 503

క. మఱిఁ గొఱకొఱ నిగుడఁగ నప్పుడు మొగములజోదు పేనిపై నూఱ్ఱులకు
ల్పడ లద్రువ నేసి విరిచి, రథము తెఱఁ గొందఁ జేసి ప్రేల్చి డిగ్గించెన్. 504

తే. అందులకు నుల్కి యారాచచందమామ, నారి మొఱయించి బల్మి యొప్పార నంప
వాన నాపేయుద్రిమ్మరిపేరిమీఁదఁ, గురిసి నెఱఁకులు నొప్పించి కొంకఁ జేసె. 505

క. పొలదిండిపేడు చిమ్మెను, చిలుకులు రాగవ్రేఁడు నడుమఁ జెండాడు న్రా
సెల పఱపెను జెడిదప్రుఁదూఁపులు వెంటనె రక్కసుండు పొలుపఱఁ జేయున్. 506

తే. నల్లద్రావుడుజోదు దేయునారసములు, చిలువరూపులవిసప్రుటగ్గుల నిగిడ్చి
కొనుచుఁ బఱతెంచి పేరిమిక్కుటప్రుఁబుల్గు, రాచతూపులచేఁ దూలి వ్రాలుచుండు.

క. బలములు గెలుపుతలంపులు, నలుకలుఁ బంతములుఁ దలఁప నంతంతకు మి
క్కిలిగాఁ బోరఁ దొడంగిరి, తొలివేలుపుఱేఁడు రాచతోఁగ నెచ్చెలియున్. 508

తే. అపుడు జన్నంపుఁదిండిరాయనిపనుపునఁ, దేరు గొనివచ్చె మాతలి దీవిచేని
డాయ దరి నిల్చె నాతండు దానిమీఁదఁ, బ్రొద్దు తూఁడుపుమలయొక్క పోల్కి నెక్కె.

తే. అందు వెలుఁగొందువిల్లును బొండలంబు, దరకసంబులుఁ గైదువుల్ దాల్చి యరిది
తేజు వెలయంగ సోఁకుమందేటితాల్పు, నెదురుకొనె వేల్పుమూఁకలు చదల బెగడ.

క. గుబ్బలి గుబ్బలియుం బలు, బొబ్బమెకము బొబ్బమెకముఁ బులియుఁ న్బులియుం
గిబ్బయు గిబ్బయుఁ దద్దయు, నబ్బురముగఁ దొడరుకరణి నడరి రిరువురున్. 511

తే. అరదముల మ్రోఁత లదలుపుటార్పులరుల, చప్పుడులునొక్కయుమ్మడిఁ జదలఁ బొదలఁ
గఱకుమొనవాఁడిచిలుకులు పఱపి నెఱఁకు, లుచ్చిపో నేయుచుండిరి పెచ్చుపెరిఁగి.

క. గుఱి దప్పక కడు దవ్వుగఁ, బఱచుచుఁ జప్పుడులఁ జదలు పగిలించి మిడుం
గుఱు లుమియుచుఁ బడుమిడుతల, తఱిఁ జూనె న్వారిబల్లిదపుటంపగముల్. 513

తే. దొనలఁ దూపులు గొనుటయుఁ దొడరి నారి
లాగుటయు నేయుటయు గుఱి ల్నాటుటయును
గనఁబడకయుండునట్లుగాఁ బెనఁగి రెఱచి
దిండిరాయఁడు రెకిమీఁదు గండెసంగ. 514

క. కుడియెడమల సింగిణు లిం, పడరఁగఁ గైకొనుచు వెరవు లారఁగ నసము
ల్గడలుకొనఁ బోరొనర్చిరి, పడలనిబింకముల నక్కజం బెలయంగన్. 515

ఆ. పదియు నూఱు వేయు పదివేలు నూఱువే, ల్మొదలుగాఁగ బెక్కుములుకు లేసి
తొడలు మెడలు కాళ్ల నడుములు బోఁగలు, నలియ బ్రేటులాడి రలుకు మాలి. 516

తే. గాటముగఁ బింజపింజయుఁ గాఁడి పాఱఁ, దొడరి యిరువురు నడరించుతూపుగములు
కడలు పడియును సంద్రము లెడము లేక, కప్పుకొనియుండె నిం కేమి సెప్పవలయు.

తే. విల్లు దఱగంటివిల్గాఁగ వింటిమ్రోఁత, లుఱుములుగఁ గల్గుమెఱుఁగులు మెఱుఁగుదీవి
యలుగ నెఱరాచతొలిమబ్బు పొలసుదిండిఁ, గొండపై నంపజడివాన గురియుచుండె.

తే. వేలుపులసూడు వేలుపుఁగోల యేయ,నడుమఁ బోడిపోడి యొనరించెఁ బుడమితాల్పు
మరలఁ గోలివేల్పుమన్నీఁడు మావుమేని, వేల్పుటమ్మేయ నదియుఁ బోవ్రేసె ఱేఁడు.

క. రక్కసిమొనగాఁ డేపున, రక్కసిచిలు కడరఁజేయ రాముఁడు దానిన్
గ్రక్కున వెన్నునితూపున, నుక్కడఁచెన్ మింట వేల్పు లుబ్బుచు నార్వన్. 520

సీ. తొలివేల్పుతలకట్టు చిలువచి ల్కడరింపఁ బులుఁగురాతూపేసి మలపె ఱేఁడు
శూలదిండిమిన్న యుంగలపుటమ్మేయ రాముఁడు మొగుల్మొలికి నుక్కడఁచె దాని
జగములగొంగ యేసఁగకోలఁ బఱప రాయఁడు సిగపుగట్లఁ జెండి వైచె
మొఱకురక్కసుఁడు మున్మొనవాలు నిగుడింప దొర సత్తిచే దానిఁ దునుముసేసె

తే. బాతిమొగములసోఁకుమేల్బంతి పెక్కు, కఱకువారసముల ఱేని నెఱకు లగల
నేసి టెక్కెంబు గూల్చిన నీరసమున, నేలతాలుపు నెల వానిఁ దూల నేసె. 521

క. పదిగడ లద్రువఁగ నార్చుచుఁ, బదిమోములజోదు గలనఁ బదిలుం డగుచున్
బదివిండులు గైకొని యప్పుడి తేరులఱేనికొడుకు బడలఁగ నేసెన్. 522

క. ఒకసింగాణియె కొని క్రిన్క కడు నీఱంగఁ దూపుగము లేయుచుఁ బా
యక పెనఁగి వాని మానిసి,యెకిమీఁ డొకయుఁ గలంచి యేడ్తెర నూపెన్. 523

తే. మిడుఁగురులు తీఁగమంటలు మెఱుఁగు లడరు,వెలుగుకోలలు పఱపి యవ్వేల్పుసూడు
తేరు టెక్కెంబు మాతలి వారువములు, గనఁబడక యుండునట్లుగాఁ గప్పి మఱియు.

ఆ. కడిఁదివాఁడితూపు లొండయనిమేనున,యుండు గ్రుచ్చి తద్దఁ గుందఁ జేసె
నపు డగస్త్యుఁ డచటి కరుదెంచి ఱేని దీవించి యిట్టు లనియె వెరపు మీఱ. 525

క. కడిఁదిమొనగాఁడ మానిసి,యొడయ లూఁకట నీకుఁ జెప్పె యొదవదు జగముల్
బొడమం జేయఁగఁ బ్రోవఁగ, నుడిగింపఁగ నెపుడు నీవ యొడయఁడవు గదా.526

క. నీ తెఱఁ గరయఁగఁ దెమ్మెరి,మేఁతరివంగడపుఱేఁడు మినుసికవాఁడుం
దాతయు నాలనినాలియు, నేతురె యొక్కించుకైన నిక్కువ మొదవన్. 527

తే. ఇపుడు నీదొడ్డశన మీవె యెఱిఁగికొనుచు, నడరి మీవంగడంబున కొడయఁ డైన
వేయిచేతులసామిని వేడుకొనుము, తలఁపు లీడేరు నని తెల్పి తపసి చనిన. 528

తే. అంత రాచూలి దమ్మిప్రోయాలిమగనిఁ, బూజలొనరించి యొన లేనితేజుఁ గాంచి
మరలఁ బోరికి మొనసి విల్మోరయఁ జేయఁ,దడవ యీరేడు జగములు వడఁకఁ దొడఁగె.

ఆ. రాచపెద్ద యైనరాగవుఁ డప్పుడ, మ్మేటిసోఁకుజోదుమీఁద మూఁడు
తూపు లేసి నెన్నుదురు మూఁడుములుకుల, నల్ల దొరుఁగ నేసి పెల్లడంచె. 53)

క. ఇరునెమ్మొగములదేవర, కరణి న్మడి వడినపదిమొగంబులజోదు
ద్దొరటొమ్ము వేయిములుకులఁ, గర మరుదుగ గ్రుచ్చి నల్ల గారఁగఁ జేసెన్. 531

మ. విలునేర్పు న్గయిబల్మియు న్మెఱయఁగా వేంద్రంపుఁగ్రొవ్వాఁడిము
ల్కులు నారి న్బెనయించి రాగవుఁడు సోఁకుం బెద్దమే నెంతయు

న్నలియ న్వ్రేసి కడిందిదొంగళము కిన్కం జించి పెక్కమ్ములం
జల మొప్పారఁగ నెన్నొసల్గు పగిలించం దూలె వాఁ డెంతయున్. 532

ఆ. తూలి పెద్దకొండపోలికఁ దేరిపై, సోలియున్నఁ జూచి కాలకేతుఁ
డరద మప్పుడు సరగ దురమున కెడముగాఁ, దోలుకొని కడఁకతోడఁ జనియె. 533

తే. అంతఁ దెలి వొంది రావణుఁ డరదిఁ జూచి, యకట పగతుర నొగ్గ నిట్లరద మేల
తోలఁగఁ దెచ్చితి నీ వెల్లదురములందుఁ, జూడవైతివె నాలావుచొప్పు ముందు.

క. అని పలికి మరల నరదం, బనికిం దోలించి వీర మలరారఁగ రా
మునిఁ దొడరి మెఱుఁగుటమ్ముల, వియత్త్రిమ్మరు లడలఁ బెక్కువేలు నిగుడ్చెన్. 535

క. వేలుపుటరదముపైఁ దే,జీలపయి న్మఱియు రాచసింగముపై మే
ల్డాలుపయి న్మాతలిపై, హాలాహలదూపుగములు వావిఁ జొనిపెన్. 536

క. పాలపిండిపేరిబలుతూ,పులు దద్దయుఁ గప్పుకొనినఁ బొల్పుగ నెకిమీఁ
దలరెఁ దొలిమొగులనడుమ, న్వెలుఁగొందుచునుండు మేఁడివేలుపుపగిదిన్. 537

క. పలకాలి ముందటికి ద్రా,పలికాల్చాఁచుకొని నిలిచి బలిమి నపుడ ని
ప్పులు గ్రక్కుములుకు లారా, నెల రక్కసుమీఁదఁ బఱపి నెఱఁకులు సించెన్. 538

క. అప్పగిది గెలుపుకలఁపులు, దెప్పరమై పెరఁగొనం గడింది గనరా
క్లొప్పుగఁ బోరి నిమరుచు, ద్ప్రేయుఁ గానక గటుం గడంకల నంతన్. 539

చ. పఱమలు గూసెఁ దేరిపయి వారికి గ్రద్దలు వ్రాలె గుత్తము
ల్నెఱి సెడి కన్నెలంకలను సిగ్గు పొరిం బొరిఁ గ్రుమ్మరించె పే
మఱుఁ బయి నెత్తుప ల్గురిసె మబ్బులు రక్కసిమన్నె గాసికి
న్దఱుచుగఁ గీడ్తెఱంగులు గనంబడె నయ్యెడ వేల్పు లుబ్బఁగన్. 540

క. అవి సూచియు నారఁడు పఱు,లెవియక డెందంబులోన దిట మూనక రా
గవుఁ దొడరి పెక్కులాగుల, బవరం బొనరింపుచుండెఁ బదిలం డగుచున్. 541

వ. అప్పుడు. 542

సీ. కప్పుకత్తుకసామికంటిమంటలఁ బోలుతూపులు బుజములఁ దూఱ్చి తూఱ్చి
మిత్తికోఱలతోడ మేలమాడు మెఱుంగుఁగోలలు ఱొమ్మున గ్రుచ్చి గ్రుచ్చి
పిడుగుల కెన యగుబెడిదంపుములుకులు ప్రక్కల నఱిముఱిఁ బఱపి పఱపి
విసముఁ గ్రక్కిన పేటిపిడులకంటె వాల్చెనయు గిట్టలు మేనఁ జొనిపి చొనిపి

తే. మగతనంబులగని యనఁ దగినబంతి, మెదలపాలపిండి నెంతయుఁ బడలుపఱిచి
వారువంబులఁ గుంపించి లేప గడపు, ప్రోడఁ దూలించి మఱియు నప్పుడమితేఁడు.

క. ఆఱు క్రొన్నెలతూపుకట్టి, పఱపె పెస న్వారి తేరిపడగలు గూల్చె
న్నొఱఁ బఱపుబల్లెంబుల, గుఱి మీఱఁగఁ దలలు జేయుగొమ్ములు దునిమెన్. 544

క. తునిమినతలలుం జేతులు, మునుపున్న తెఱఁగున మరల మొలచె మొలచినఁ
గని రెండలుఁగులు దాఁకక, చనెనో తాఁకియును ద్రెంపఁ జాలక చనెనో. 545

ఆ. అనుచు సుదియంబు పెనఁగొన నించుక, దడవు నిలిచి చూచి తడఁక గఱకు
చిలుకు లేసి తలలు చేతులఁ ద్రుంచిన, నపుడె మరల మొలచె నచ్చెరముగ. 546

క. మొలచినఁ గదు వెఱఁ గందుచుఁ దొలుతటిచందమున నుఱియఁ దనిమోఁ దునిమినఁ
దలకీలు మలచినట్టుల, వలనుగఁ జేతులును దలలు వైరము మొలచెన్. 547

క. ఎడపక సింగిణిఁ దూపులు, దొడఁగి తలలఁ జేయిగములు దునుమ నొడయఁ డ
ప్పుడె తమ కడిఁదిగ నెండియుఁ, బొదము నవి జగంబు బీతు పూని వడంకన్. 548

క. తెగుతలలు మొలచుతలలుం, దిగువం బడుతలలు మొగిలు తెరువునకు వడి
న్నెగయుతల లప్పు డబ్బుర, మగుచుఁ జగమంత్రగాని మాటయపోలెన్. 549

క. వడిమొదుతలలుం జేతులు, నదరించులకోరిగములు నన్నన్న రెఱి
న్నుదువులపడఁతుకకైనన్, దదవ్వల నిదుడుకి నైనఁ దరమే యెన్నన్. 550

ఆ. తునిఁగి యెగయుతలలు దొరసి మున్నులుకులు, గేరి యాకుటాకి గ్రద్దగములఁ
జవలఁ గప్పుకొనినజగముచీకటి గ్రమ్మి, పవలు రేయిఁ దెలియఁబడక యుండె. 551

ఆ. అట్టు లేసి యేసి యలవును విసుకును, వెఱఁగుఁ బొదమి రాచవేల్పుహేఁడు
సేయఁ దెలియలేక చిన్నఁబోవుచు బిగి, యుడిగి మోము వంచి యూరకుండె. 552

సీ. అప్పుడు విభీషణుం డద్దొరఁ జూచి యిట్లని పల్కె సెకిమీఁద వినుము వీని
బొడ్డున వెన్నునిబొడ్డుబిడ్డనిమెప్పువలన వేల్పులబువ్వ గలిగియుండు
నది యింకిపోవఁ జేయక యున్న నిప్పాళ వాలియుఁడు నాఁగ నప్పుడమిఱేఁడు
నిచ్చుఱబ్బలైఁబుచే నది యింకించి మఱి నాటలొమ్మిదిమాస్ల తలలఁ

తే. జేయిగొమ్మలు దునిమినైచినఁ జెనంటి, పాలసుమీవరిజో దొకతలయు రెండు
చేతులును గల్గి నిలిచె జేజేలు మింట, మిగుల నలరుచు రాముని బొగడి రంత. 553

క. తనకట్టు పాతుసకఁ జెప్పెను వీఁ డని కినిసి యవ్విభీషణుపై న
త్తిని విసెర్చె రావణుం డది, దునియలుగా నొడయఁ డొక్కతూపున నేసెన్. 554

క. తల యొండు రెండు చేతులు, గలిగియు రక్కసుఁడు దొంటికంటె సనం బ
గ్గలమై పెనఁగొన రాముని, గెలసి పెనంగుచు లకోరు లేయుచు నుండెన్. 555

తే. అప్పుడు మాతలి భరతునియన్నఁ జూచి, నేలతాలుప యింక జా గేల వీనిఁ
దునుము మని తెల్పుటయు రాచతొలఁజేఁడు, బొమ్మయమ్మెప్పియటిగూర్చి నెమ్మి నేసె.

సీ. ఏసిన నలుకల యెద్దెఱఁ బడిపేలపేఁడివెలుంగులవెలుఁగు గలిగి
జగములు నెదుతటి నెగడెమునగ్గి చందానఁ దద్దయు మంట లీనుకొనుచు
నలవయ్యెరలును వేగ తొడఁగి యదవుకైవడి నబ్బురంపునెవ్వడి నెసంగి
కఱివేల్పునుడివాలుకంటె ముక్కంటిముమ్మొనలవాల్గంటెను మిఱువు మీఱి

తే. యెల్లపజలకు బలితంపుకెడవు దోఁప, నద్దిరడి నేగి రాకాసిపెద్దయొమ్మఁ
గాఁడి యుసురులు దొలఁగించి గాదువిండి.ప్రోలు గన్గొని క్రమ్మఱఁ బొదిని జొచ్చె.

సీ. అని తెల్పి వేలుపు లందఱుఁ దమతమ నెలవుల కరిగిన నేలఱేఁడు
గడు కూర్మి నమ్మున్న కామునుఁ గైకొని సోఁకురాయఁడు ప్రొద్దుచూలి గాలి
కొడుకు కంగదుఁడు నల్వకొమరుఁడు మొదలగువారలును దమ్ముఁడు వెరసి కొల్వ
నలరొందఁ బుష్పకం బనియెడు తే రెక్కి కోలఁకు లేఁతులుఁ బల్లియలు నడవులఁ
తే. బూవుఁబోఁడికిఁ జూపుచుఁ బ్రోవలంపఁ, బొసఁగ జడదారు లొసఁగెడు పూజ లెల్లఁ
గొనుచు సరగ నయోధ్యకుఁ జని తిరం బెసఁగఁ బజలఁ దన్పుచును దమనగరు సొచ్చె.

తే. సొచ్చి తల్లులు మువురికి జోత లొసఁగి, యొజ్జలకు మ్రొక్కి దీవన లొసరఁ గాంచి
తమ్ము లిరువురు నెఱఁగిన నెమ్మిఁ గౌఁగిలించి చుట్టలఁ జెలుల మన్నించె మిగుల.

తే. పుడమిబొట్టియ యత్తల కడర మ్రొక్కి, తోడికోడండ్ర నంగడిచేడియలను
నెనరు దైవారఁ గౌఁగిటఁ బెనచి జన్ని, కట్టుముత్తైదువులఁ దద్ద గారవించె. 587

సీ. అంతట రాఘవుఁ డొంతయు నెలమితో నొకమంచిప్రొద్దున నొజ్జ యగువ
సిష్ఠుండు ప్రెగడలుఁ జెలఁగి పసిఁడిపట్టియ నెన్నొసలఁ గట్టి కీవి మెఱయఁ
దల్లడాల్మైకపుగద్దియఁ గూరుచుండఁ బెట్టిన నిచ్చలపుదొరతనము పూని
పుడమివేల్పుల కెల్ల వొడుకులు నేలయు రొక్కంబుఁ దొడవులు జక్కఁగములుఁ
తే. బుట్టములు దెట్టెలుఁగ నిచ్చి చుట్టములకు, బట్టులకుఁ బేదలకుఁ గోరినట్టు లొసఁగి
యింపు సొంపుల వెలయంగ నెల్లరకును, బోనములు వెట్టి వేడ్కలఁ బొదలఁ జేసి.

తే. మఱియును సుగ్రీవుఁడును దివిమన్నెగాఁడు, గాలిచూలియు నీలుండు వాలికొడుకు
వెనుకచూపులమెకపుఱేఁడును మొదలగు, బల్లిదుల నెల్లఁ గూర్మి దైవారఁ బిలిచి.

ఆ. దొడ్డమాపికంబు దొడవులఁ జీరలుఁ, గలకములును మంచిగందపొడులఁ
దమ్ములములు నొసఁగి యుద్ధుల కనిచినఁ, జనిరి వారు సంతసమున మఱలి. 590

తే. అంత రాముఁడు వేడుక లలర నేల, జానకితోఁ గూడి నెమ్మదిఁ జొక్కి పెక్కు
జన్నములుఁ జేసి ప్రజల నిచ్చలును బాడి, యొసఁగఁ బ్రోచుచు జగ మెల్ల నేలుచుండె.

సీ. అని దిండిజడదారి చినుకుపూసల క్రొవ్వ మగటాలు వెన్నెల ల్తొగలఱేఁడు
గిబ్బదాల్దొర గుండుకబ్బంబు ప్రాయాలు ఓబ్బిగబ్బితయుబ్బు బొబ్బమెకము
విన్నకేళాకూళి వేల్పులబోనము దడవులపిమునుడు పుడుకుబోదుకు
తూఁడుమేపుడుపుల్లు దూర్పురాయనిజక్కి మొల్ల క్రొవ్వివియొత్తు జెల్లుపువ్వు
తే. నురువు లద్దంబు పాలు కప్పురపుఁబోది, నంకు రిక్కలు మంచు నీరింకుమొగులు
దనయసంబున కెన గాక పెనుపు డింప, వెలసె నమ్మున్న తాలుపువేల్పుఱేఁడు. 592

తే. అనుచుఁ దెఱఁగొంటి తెనుఁగు రామాయణంబు, శ్రీల రాయని గాదిలి సీసుఁగులోడఁ
దెలిపె నిది విన్న వ్రాసిన లలిఁ జదివిన పిరుఁదుఁగోర్కులుఁ బెన్నింబుఁ జెందుఁ బజల.

తే. తెనుఁగుచదువున బున్నియం బెనయ దనుచుఁ, గొంద ఱాడుదు రాడినఁ గొఱత యేమి
మను మరా యంచు నడిచిన నేటిబోయ, నెఱనిరాబారి యగుటయె గుఱుతుగాదె.

తే. పొత్తములఁ దొంటిపెద్దలు హత్తుకొలిపి,నట్టితెలుఁగున నుడువులం దన్నియెడల
గుఱి యరసి చూచి నెమ్మదిఁ గూర్చినాఁడ, నదియుం జెన్నుకుఁడు నెఱజాణ లెల్ల.

తే. పుడమి నీపొత్త మెప్పుడు ప్రొద్దు నెలయుఁ,జుక్కలును గల్గు నన్నాళ్లు పొలిది ప్రోద
లిండ్లఁ గోరినకోరిక లిడుచు నిడుమ, లుడుగఁ జేయుచుఁ దిరమయి యుండుఁగాత.

వ. అని పలికి. 597

సీ. పులికళాసము పాఁపప్రోఁగులు క్రొన్నెలపూవు విన్కొక్కిమ్ముడి పునుకసరులు
వెలిబూదిపూఁత ప్రోఁబలుకుటందియల హొన్నుగుబ్బలిసింగాణి గిబ్బమావు
కప్పుకుత్తుక పెట్టకన్ను ముమ్మొనవాలు కంకటికోడు లేజింకపిల్ల
జక్కరకీల్జడ చౌవంచమోములు పులికబోనమ్ము బల్యాచిదిండు

తే. దచ్చిచూపులు కొండప్రో లిచ్చ పంట,వలఁతియరదంబు సుద్రము బత్తలికయు
వన్నియగ మేన గట్టురాకన్నియయును, గలుగుజగములగండరగండ వేల్పు. 598

క. కొక్కును నట్టువపక్కియుఁ, నెక్కుడులుగ నమరుకొమరు లిరువురు మ్రోలన్
విక్కుచు నాడఁగ నెలమిన్, జొక్కెడు వేలుపులరాయ సోఁకుదురాయా. 599

వణవవృత్తము.—

జేజేరాయఁడు సిరిగేస్తుండుం, దేజుల్ మీఱఁగ దిట నూబత్తిన్
వేజోవారులు నెఱిఁ గావింపన్, బూజం జెందుచుఁ బొనరార్తేటీ. 600

గద్యము. ఇది శ్రీసుమమారమణ కరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధ సరసకవితాసామ్రాజ్య ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయ ప్రణీతంబయిన యచ్చతెలుఁగురామాయణ మహాకావ్యంబునందు యుద్ధకాండము సర్వమేకాశ్వాసము





చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.

## అచ్చతెనుఁగు రామాయణము

# ల ఘు టీ క

## పీ ఠి క

* 1. మన్కి = నివాసము మనికియొక్క రూపాంతరము, వెండికొండ = కైలాస పర్వతము, వేల్పుఱేఁడు = దేవతలకుప్రభువు (దేవేంద్రుఁడు), మరునయ = మన్మథుని తండ్రి (విష్ణువు), నల్వ = బ్రహ్మదేవుఁడు, వలిగుబ్బలిరాచకూఁతురు = పార్వతీదేవి, లేనెలదాల్పు = ఇందుధరుఁడు (శివుఁడు.) 3. గ్రుడ్డుకానుపుఱేఁడు = (1) శేషుఁడు. (2) గరుత్మంతుఁడు. జింకతాలుపరి = (1) చంద్రుఁడు. (2) ఈశ్వరుఁడు, నీరుపట్టువ = (1) (విష్ణుని) శంఖము (పాంచజన్యము). (2) కౌస్తుభరత్నము, పచ్చవార్వపుజోదు = (1) సూర్యుఁడు. (2) మన్మథుఁడు, చుట్టువాలు = చక్రాయుధము, నెవ్వపోఁగొట్టువాలు = లక్ష్మీదేవి. 6. పరవృత్తు = పరిచారికలు, అఁరువిల్దాల్పు = మన్మథుఁడు, పోరోఁగిరపునిరాబారి = నారదమహర్షి, మామమామ = విష్ణువు, ఆటగీములు = విహార సౌధములు, పల్కుననబోడి = సరస్వతీదేవి. 7. నేలతాలుపురాచ చూలిగాదిలికందు = పార్వతికొడుకు (వినాయకుఁడు), కడాని = బంగారు, అక్కటికము = కనికరము. 9. పదియరదములదొర = దశరథుఁడు, పుట్టఁబుట్టువుతపసి = వాల్మీకిమహర్షి. 10. కబ్బములు = కావ్యములు. 12. వేల్పులు = దేవతలు, కబ్బముకూరుపరులు = కవులు. 13. కప్పుకుత్తుకవాఁడు = నల్లనికంఠముగలవాఁడు, గిత్తతత్తడివాఁడు = వృషభము వాహనముగాఁ గలవాఁడు, విన్ను = ఆకాశము, మొరలకైదువ = త్రిశూలము, సంకుజిగి = శంఖపుకాంతి, వలకేలజింకవాఁడు = కుడిచేత జింకఁగలవాఁడు. 15. అపరంజిపూలు = బంగారుపువ్వులు, గట్టురాచూలి = పార్వతి, మానికము = మాణిక్యము. 17. అప్పనము = అర్పణము. వెరవరి = నేర్పరి. 19. గుఱి = లక్ష్యము. 21. జక్కులదొర = యక్షులప్రభువు (కుబేరుఁడు.) 22. తొలుపలుకు వారువంబులు = వేదములను గుఱ్ఱములు, తిగప్రోళ్లు = త్రిపురములు. 23. వెండిమల = కైలాసపర్వతము. 26. మొగిలిదారిసిగజేజే = ఆకాశము కేశములుగాఁ గలవేల్పు.

## బా ల కాం డ ము.

1. బలుకబ్బము - మహాకావ్యము, కలపుతిండి తపసి = నారదమహర్షి, తల్గకాపుతపసి = వాల్మీకిమహర్షి. 2. జడదారిరాయ = మునిశ్రేష్ఠ, జాగంబు =

---

* ఇందలియంకెలు పద్యసంఖ్యలఁ దెలుపును,

త్యాగంబు, తేజు = తేజస్సు, పెంపు = అతిశయము, వలతిఱనము = సామర్థ్యము, వెడందగ=విశదముగ, నలువపట్టి = బ్రహ్మదేవునికుమారుఁడగు నారదుఁడు, చిలువపట్టు= పుట్ట. 4. ఇరవు = ఉనికిపట్టు, ఇరునాల్గుకడలు=అష్టసంఖ్యాదిక్కులు, ప్రోలు=పట్టణము. 5. నలువప్రోలు = బ్రహ్మపట్టణము (సత్యలోకము), పెంజిలువప్రోలు = పాతాళము. వేలుపులప్రోలు=స్వర్గము. 6. ముత్తి = మోక్షము, సఱప్రోళ్లు = శతసంఖ్యాపట్టణములు. 7. మావులు = (1) గుఱ్ఱములు. (2) మామిడిచెట్లు. (మావి = మావులు.) కొమ్మలు = (1) కోటలశిఖరములు. (2) స్త్రీలు. సొమ్ములు = (1) పశువులు. (2) భూషణములు. 9. క్రొన్నెలరామేడలు = చంద్రకాంతశిలలచే నిర్మితములగు మేడలు, వేల్పులబువ్వ = చంద్రుఁడు, కందు = కళంకము, ఇఱ్ఱి = జింక. 10. కడాని = బంగారు, అగడ్త= కందకము. 12. వ్రేఁగు=భారము, కడమేనుఁగులు=దిగ్గజములు. 13. ప్రాఁతపల్కులు= వేదములు, నేలవేలుపులు=భూసురులు. 14. వెఱవక = భయపడక, పుడమిదాలుపుగమి హెచ్చు = రాకుమారులయౌన్నత్యము. 15. జన్నిగట్లు=బ్రాహ్మణులు, కలుములు = సంపదలు, అడుగుపుట్టువుపెద్దల్=శూద్రశ్రేష్ఠులు. 17. ఆటవెలఁదులగమి=వెలయాండ్ర సమూహము. 18. సాఁకు = సంరక్షించు. 20. తామేటిమేటి=శ్రేష్ఠమగుకూర్మము, చిల్వలసామి = ఆదిశేషువు, పుడమిచెలి=భూదేవి. 2 . చివ్వ=పోరు, గేస్తు=గృహస్థు, వెలుఁగురావంగడపు = సూర్యవంశపు, చలివెలుంగు = చంద్రుఁడు. 22. ఆండ్రు= భార్యలు, , ఎనలేని = సాటిలేని, నెమ్మి=ప్రేమ. 23. కటకటపడి=విచారించి.బాధపడు 24. విడిముడి = ఐశ్వర్యము, విత=వ్యథ. 25. ఇందు = ఇహలోకమునందు, అందు= పరలోకమునందు, పుడమివేలుపుపెద్దలు=భూసురశ్రేష్ఠులు. 26. ఒజ్జ=గురువు, ఎలమి = ప్రీతి, కర్జము = కార్యము. 27. బొట్టియలౌనగూడుతెఱంగు = కుమారులుగల్గువిధము. 28. నెవ్వడి = లేమి, వెండ్రుకయడుగులదొర = రోమపాదుఁడు, వ్రేల్ములు=హోమములు, పజలు=జనములు. 29. మనుఁబోఁతుకొమ్ముతపసి=ఋశ్యశృంగమహర్షి, కడంక = పూనిక. 31. కెంజడదారి = మునీశ్వరుఁడు, క్రేవ = దిక్కు. 32. వేల్పులదొర = దేవేంద్రుఁడు, వారువంపుజన్నము=అశ్వమేధయాగము, పాఱులు = బ్రాహ్మణులు, రాచమిన్న=రాజశ్రేష్ఠుఁడు. 33. తామరచూలి = బ్రహ్మదేవుఁడు. 34. పాలమున్నీరు = పాలసంద్రము. 36. చిలువరాసెజ్జ = శేషశయ్య, చొక్కు=పరవశమగు, సుడివాలు= చక్రాయుధము, చిందము = శంఖము, పసిడిదువ్వలువ = పీతాంబరము, మెయి=శరీరము, సోయగము=సౌందర్యము, తొగవిందు=చంద్రుఁడు, వలఱేఁడు=మన్మథుఁడు, అగ్గింపఁగడఁగిరి. పొగడఁదొడఁగిరి. 38. ఎకిమీఁడ = ప్రభువా, పదినూర్ణనోళ్లప్రోడ=వేయిముఖములుగల ఆదిశేషువు. 39. బల్లిదుఁడు=బలవంతుఁడు, రొక్కపుఁగుప్ప = పెన్నిధానము,

40. కడగండ్లు = కష్టములు, (ఈ శబ్దము నిత్యబహువచనాంతము) అడుగుంగవ = పాదద్వయము. 41. చదువులముదుకఁడు=బ్రహ్మదేవుఁడు, పదితలలరక్కసులఱేఁడు=దశకంఠుఁడను రాక్షసరాజు రావణాసురుడు 42. కొఱయయ్యె=తక్కువయ్యెను, వలగొని=చుట్టుకొని, రొక్కపుదొర = కుబేరుఁడు, మిఁసికపలాతి = ఈశ్వరుఁడు. 44. గుదుసుకైదువజోదు = విష్ణుమూర్తి (చక్రాయుధుఁడు), ఇక్క = నివాసము. 45. చక్కాడెవ = చంపెద. 46. పదితేరులదొర = దశరథుఁడు, చెట్టుంద్రిమ్మరులు = వానరులు. 48. సతనాల్కలజేజే = అగ్నిహోత్రుఁడు, పసిడిహరివాణము = బంగారు భోజనపాత్రము, పాలవోరెము = పాయసము. 49. పసాపడి=భుజించి. 50. చిట్టుములు=గర్భిణీస్త్రీలకుఁగల్గు చిన్నయుమ్ములు. 53. పుడమినఁదోడి=భూదేవి. 58. తొలినెల=చైత్రమాసము, తెలిపెక్క = శుక్లపక్షము, తొమ్మిదియవనాట = నవమిరోజున, అఱునొండొవరిక్క = పునర్వసునక్షత్రమున, నాలుగవలగనమున = కర్కటకలగ్నమున, గాములు = గ్రహములు. తటిచెయ్వులు = అవసరకార్యములు, తొడవులు = భూషణములు. 59. పేరులుపెట్టి = నామకరణములాచరించి, ఆమెతలు = విందులు. 60. అదను = సమయము. 61. జాళువామురుగులు = బంగారుకంకణములు, ముత్తియాంపుపేరులు = ముత్యాలహారములు. 62. బూచులదొర = ఈశ్వరుఁడు, తపసిపులి = మునిశ్రేష్ఠుఁడు. 63. మగరాలు = వజ్రములు, నిచ్చలముగ = నిశ్చలముగ. 6 . రాచజోగి రిక్కరాయడః = రాజర్షిచంద్రుఁడా, తొంటిపున్నియాంపుపెంపు = పూర్వజన్మపుణ్యాతిశయము. 66. అందలములు = పల్లకీలు. 67. కనికరపుగనీ = దయానిధీ. 69. జన్నము = యజ్ఞము, చలము=ద్వేషము. 70. గుబ్బలివిల్లలజోదు = ఈశ్వరుఁడు. 72. బీతునుపక = భయంపడక, బెగ్గిలి = భయపడి. బెట్టిదపుమాట = కఠినోక్తి పెఱతెఱంగు=వేఱువిధము. 74. పాడియె = నీతియా. 75. కొంకక=సంశయింపక, ఎద=హృదయము. 76. గీమువేల్పులు=గృహదేవతలు, కానలకు=అరణ్యములకు కనికరపు మనికిపట్టు = దయానిధి, వెఱఁగు = ఆశ్చర్యము. 78. కారుకొనలకు=దట్టపుటడవులకు. 82. పలుమారుస్రుక్కి = చాలకాలముక్లేశమునోర్చి, పున్నియము = తపఃఫలము, కినిసిలిట్టిన = కోపించి శపించిన. 84. తివిరి = ప్రయత్నించి, జన్నపునెపమున = యజ్ఞమనుమిషచేత. 85. అబ్బురంబు = ఆశ్చర్యము, తొలివేల్పుకొమ్మ = రాక్షసాంగన. 88. సింగిణి = ధనుస్సు, గొనయంబు = అల్లెత్రాడు, ములికి = బాణము, కడిమిన్ = విక్రమముతో. 89. ఉసురులు = ప్రాణములు, 90. అలరి= సంతోషించి, జన్నపుటిల్లు = యజ్ఞశాల, అలరుఁదోఁపు = పూలతోట. 91. కొలఁకుల కెలకుల = సరోవరముల పార్శ్వముల. 92. పెనుమినుకులు = వేదములు,

అక్కొనలు = ఉపనిషత్తులు, మరునిగుఱ్ఱపుఁ దుటుముల్ = చిలుకలసమూహములు. 93. మొగులు = మేఘము, ఉలివు = శబ్దము, కప్పుమెడపుల్గగములు = నెమిళ్ల సమూహములు, ఆముగవిసి=పోతరించి. 94. జాటవాకిన్నెర = బంగారువీణ, సుతులు = సుతివేయుటలు, తుమ్మెదబోటికూటువల్ = ఆఁడుతుమ్మెదల సమూహములు. 95. చిఱుగాడ్పులు = మందమారుతములు. 96. ఆకొన్న = ఆఁకలిగొనిన, పాఁపచేడియపిండులు= నాగకన్యల గుంపులు, తపసిరేవెలుఁగు = మునిచంద్రుఁడు, నెలవు = నివాసము. 97. బుజముపుట్టువు కుఱ్ఱబెబ్బులులు=రాజకుమారవరులు, తనియ = తృప్తిపడ 98. బలితపుటాము = బలగర్వము, నల్ల = నెత్తురు, పొలసు = మాంసము. 99. చుఱుకలరఁగ = జవముమెరయ. 100. గిత్తరాతత్తడిఱేఁడు = వృషభవాహనుఁడగు నీశ్వరుఁడు. 103. విన్నుమూలదేవరవిల్లు = శివునిధనుస్సు, ఒట్టు = శపథము. 104. కదలఁజాటఁబనిచె = దిక్కులఁ జాటింపించె, ఉద్ది = సాటి. 105. మూలకు = కొప్పునకు, ఇర్లు = (ఇరులు) చీఁకటి. 106. పుత్తడి = బంగారు. 107. తేఁటిగములు = తుమ్మెద సమూహములు. 108. నల్మొగములప్రోడ = బ్రహ్మదేవుఁడు. 110. తేజులకొటారు = కాంతులనిలయము. 111.అమెలతలతలమానికము=అస్త్రీల శిరోభూషణము. 112.తీపారు తూపుదొర = మన్మథుఁడు. 113. కఱుకుంగైదువ = వాఁడి బాణము. తఱుచులు = విస్తరించుటలు, కన్నాకు = మేలుబంతి. 115. వైళము = (వేళమునకు రూపాంతరము.) వేగము. 116. తెరవు = మార్గము (తెరువునకు రూపాంతరము), పదుకు = (పఱునకు రూపాంతరము) తాయి. 113. జాసు = సౌందర్యము. 119. సోకుదులసూడ = రాక్షసులశత్రువు, మొదలితెఱఁగు = పూర్వవిధము. 120. నిరాజారిసింగము = ముని, శ్రేష్ఠుఁడు, క్రుంకులిడఁగ = స్నానమొనర్ప, జన్నపులిండిరాయండు = దేవేంద్రుఁడు రాజిల్కజిక్కిజోదుపనులు = మన్మథక్రీడలు. 121. కినుక = కోపము. 122 వేంద్రముగ = కఠినముగ, అంగద = విపత్తు. 123. మడఁతితనము = స్త్రీరూపము. 124. విదుకొను = కాపాడుకొను. 125. మున్నీరు = సముద్రము, చదువులతెక్కలికాని = వేదములపహరించినవాని. 126. ప్రాలేఱు = పాలసముద్రము. 127. జాటవాకంటితొలివేల్పు = హిరణ్యాక్షరాక్షసుఁడు, తొల్పందిగున్న = ఆదివరాహము. 128 మానిసి సింగపుమేను = నరసింహాకృతి, పసిండిబొజ్జదొర=కాంచనగర్భుఁడు (బ్రహ్మ) 129. గుజ్జుపదుగు = వామనుఁడు, చాగము = త్యాగము, గొంగ = శత్రువు. 130. ముయ్యేడుమాఱులు = ఇరువదియొక్కసారులు, యసములు = యశస్సులు. 131. ఈరైదుకుత్తుకల పొలయొరపుమన్నీడు = పదికంఠముల రాక్షసరాజు. 132. కొనరిక్క = రేవతి. 133. ఈలువు = పాతివ్రత్యము. 134. తలమె = శక్యమా (తరమెయను పదమునకు

రూపాంతరము.) 135. బత్తి = భక్తి. 139. విడిపట్టులు = విడిదిస్థలములు. 140. కగటుదువ్వలువలు = జలతారుమేలివస్త్రములు. 141. అమరించి = సత్కరించి, పొక్కిలి = కస్తూరి (కస్తూరీమృగము నాభినుండి వచ్చుచున్నది.) 142. సింగాణి = ధనుస్సు. 144. గుబ్బలిరాకన్నియమగఁడు = ఈశ్వరుఁడు, కటిమెడదొర = నల్లని కంఠముగల ప్రభువు (శివుఁడు). 146. విల్లరివోసినప్రోఁడ = వింటనారి సంధించిననేర్పరి, నాఁగటిచాలుపేరియెలనాగలమిన్న = సీత యను పేరనొప్పు స్త్రీలలో శ్రేష్ఠురాలు. 148. మ్రానుపడు = చేష్టలుతక్కు. 150. ఉక్కఱి = బలము నశించి, వింటునంటుగన్ = ఆకసమున వ్యాపింపఁగ. 151. తొలుదాల్పువిల్లు = శివునిధనుస్సు, అబ్బపేరిరాచగిబ్బ = జనకుఁడను రాజశ్రేష్ఠుఁడు. 152. నాన=సంకోచము. 155. చాల్పుటరదంబులతేఁడు = దశరథుఁడను రాజు. 156. మువ్వేలుపులయిక్కకొలము = సూర్యవంశము. 157. లకోరి = బాణము. 160. జాగు = ఆలస్యము. 161. మేలికమ్మ = శుభలేఖ ఓలగంబున = సభలోన. 162. తెంకలు = బంటులు, ఈగి = దానము. 164. కత్తడులు=గుఱ్ఱములు, చదలు = ఆకసము, గడసెలఁదుకలు = వేశ్యాస్త్రీలు. 167. వెనుమినుకుత్రోవ = వేదోక్తమార్గమున. 170. తనియించె = తృప్తిపఱచెను. 171. అకుటింటిప్రోఁడ = మునిశ్రేష్ఠుఁడు. 174. గండ్రగొడ్డలిదాల్పు = పరశురాముఁడు. 175. కఱచినాడ = అభ్యసించితిని, ఐదునూఱుకేల్గవలను గల్గు బల్లిదుఁడు = వేయిచేతులు గల కార్తవీర్యార్జునుఁడు 176. బొట్టెడ = అర్భకుఁడ. 177. ఉబ్బుచు = గర్వించుచు, వీఱిఁడి = వెఱ్ఱివాఁడు. 178. బవరము = యుద్ధము, పుడమిదయ్యంబులు = భూదేవులు. 179. పాఱులు = బ్రాహ్మణులు. 181. తొలిపలుకువారువంబులవలఁతి = ఈశ్వరుఁడు. 184. ప్రోలు = పట్టణము. 185. నాటచేడియలు = నాట్యమొనర్చు స్త్రీలు, సేసలు = అక్షతలు, లోనగరు = అంతఃపురము. 180. పుడమికానుపుచెలి = భూదేవి కూఁతురు (సీత.) 188. వేలుపుటేఱు = గంగానది. 189. గేస్తుండు = సోమయాజి (ఈ పద్యమున శివుని యష్టమూర్తులును పేర్కొనఁబడినవి.)

## అయోధ్యాకాండము

1. పూపజాబిలితాల్పు = మెలకచంద్రుని ధరించినవాఁడు, (ఈశ్వరుఁడు.) 2. కరువలిమేపరిమనికి పట్టుకాఁపుజడిదారి = వాల్మీకిముని. 4. పురుడు = సాటి. 7. పుడమిచెలి యల్లువానిని = రాముని, గాటము = గాఢము. 8. రక్కసిమగువం బొరిగొన్నవాడిమగని = రాక్షసాంగన తాటకను వధియించిన శూరుని. 9. ఇవురొత్తంగన్ = చివురులెత్తఁగా. 10. నిండుకుండలు = పూర్ణకుంభములు, మెకపుటాము = కస్తూరి, సింగారము = శృంగారపదమునకు వికృతి. 11. క్రొవ్విరిసరములు = పూలదండలు.

12. కడయనుపేరటాలు = దిగంగనాపురంధ్రి, ప్రొద్దు = సూర్యుఁడు. 13. విను త్రిమ్మరులు = ఖేచరులు. 14. జమునబ్బ = యమధర్మరాజుతండ్రి - (సూర్యుఁడు). 16. రిక్కలు = నక్షత్రములు. 17. ప్రాయపు బోజుగులు = యౌవనులగు విటులు. 18. తూర్పుగుబ్బలి = పూర్వాద్రి, రేయింతి = రాత్రియను స్త్రీ. 19. మిక్కిలి కంటివేల్పు=ఈశ్వరుఁడు, 20. వేల్పుటేనిక=ఐరావతము, పెట్టుచెట్టులు=కల్పవృక్షములు, నలువబాబా = హంస, రేయెండ = వెన్నెల. 21. తాగపోలఁతి = గయ్యాళియగుస్త్రీ. కోఱమెప్పులు = వరములు, అవియ = బ్రద్దలుకాఁగా. 22. పిఱుతిలియక = వెనుకఁ దీయక. 25. కఱకులు - కఠినోక్తులు, ఇడుమలు = కష్టములు. 32. తొంటినోములు= పూర్వపువ్రతములు, హుళక్కి = అబద్ధము. 33. ఎఱుక = తెలివి. 35. క్రన్నన = శీఘ్రముగ. 37. చుక్కలతెరవున = ఆకాశమున. 39. పులుగులు = పక్షులు. 41. తొగల యెదురుచుక్క = కలువలవైరి (సూర్యుఁడు), గాముల యెకిమీడు = గ్రహములరాజు (సూర్యుఁడు). 42. ఇర్లపేటకాఁడు = సూర్యుఁడు. 44. అదనుచెయ్యులు= సమయకృత్యములు, సత్తియబ్బ=శక్తియనువానితండ్రి (వసిష్ఠుఁడు). 45. వాయిదములు= మంగళవాద్యములు. 46. పుట్టువులేనివాఁ డనెడు పేరఁగ్రాలు నొడయనికొడుకు, అజమహారాజు కొమరుఁడు దశరథుఁడు. 51. ప్రాఁతమినుకు = వేదము. 52. పొత్తములు = పుస్తకములు. 53. ఐదువతాడు = మంగళసూత్రము. 54. ఉప్పిడు ల్నలుప వలదు = ఉపవాసములుసేయ నక్కఱలేదు. 56. పొలమేపరిసూడు = రాక్షసవైరి (రాముఁడు). 58. రఘువుకొలపుసామి = రఘువంశపు ప్రభువు (రాముఁడు). 60. అనతి = ఆజ్ఞ. 64. దయ్యము = దైవము. 69. దొనలు = అమ్ములపొదులు. 70. ఎమ్మెకాఁడ = ప్రియుఁడ, ఎలగాఁగ = సాక్షియగునట్లు. 71. గొడవలు = ఆపదలు. 72. గట్టువాపడఁతుక = ధూర్తురాలు. 73. అన్నులు = స్త్రీలు. 77. దుగ = రెండు, కయిసేయ = అలంకరింప, గొండ్లి = ఆట, పొలయోగిరంపు పొలంతుకలు=రాక్షసస్త్రీలు, 79. ఇయ్యకొని = సమ్మతించి. 81. లక్కుమనుఁడు = లక్ష్మణుఁడు. 82. గేస్తురాలు= ఇల్లాలు. 85. ముది = ముసలితనము. 86. ఆంతులు = శబ్దములు - కలకలములు, అట్టు = నింద. 91. కొఱకొఱ = కోపము. 92. ఉడుకు = బాధ, ఉఱక=మాటాడక. 95. కట్టిఁడి బల్దయ్యము = కఠినుడైన బ్రహ్మదేవుఁడు. 99. కడలేని = అంతులేని, ఆఱచియఱచి = పెల్లుచించిల్లి, జేజేలప్రోలికేఁగె = స్వర్గమునకేఁగెను. 100. సుడి వాలుదాల్పు నడుగునఁబొడమిన పెన్నెల్లి = విష్ణుపాదములజనించిన మహానది (గంగానది). 101. నెక్కొను = ఉండు. 103. మలలతలకట్టు = పర్వతములలో శ్రేష్ఠమయినది. 104. నిద్దంపు = నునుపైన, దుంపబోనములు = కందమూల ఫలాహార

ములు, మెత్తలు = పఱుపులు, తెరవు బడలికలు = మార్గాయాసములు. 106. పెఱజగముచెయ్యాలు = ఉత్తరలోక కృత్యములు. 107. ఎఱఁగి = నమస్కరించి. 108. సొరిది = క్రమము. 109. నేటుచేసి = గణనచేసి. 110. ఆడిక = నింద. 112. నొగిలి = బాధనొంది, నువులుసీళ్లు = తిలోదకములు, ఓరెంపుఁగళ్లు = పిండప్రదానములు. 115. మిత్తివేటకాని తత్తడియూరు = నందిగ్రామము. 116. అనియోరెపుఁదిండిదాసరయ్య = నారదుఁడు. 117. మూఁడుప్రోళ్లు = త్రిపురములు.

## అ ర ణ్య కాం డ ము

1. గొంగ = శత్రువు. 4. తానకము = నివాసము. 8. ఆకుఁజవికె=పర్ణశాల, సుప్పనక = శూర్పణఖ - (రాక్షసస్త్రీ). 12. నాన = లజ్జ, అలుక = కోపము, అలమటింప = దుఃఖింప, ఆలము = యుద్ధము, నల్లద్రావుడుమూఁకలు = రాక్షస సమూహములు. 13. ఔడిదపు ములుకులు = కఠోరబాణములు. 16. కలఁక = వ్యథ, 20. అబ్బురపుఁజెల్వము = ఆశ్చర్యకరమగు సౌందర్యము, 21. కదలివెన్ను = చంద్రుఁడు, మచ్చ = కళంకము. 24. కంచెల = అవిక. 26. తుఱుము = ధమ్మిల్లము-(కొప్పు). 27. మోముగోము = ముఖసౌందర్యము. 28. సోలి = సొమ్మసిల్లి. 36. ఆలించుట = ఆలకించుట, వినుట. 37. బంగరుమెకంబు = బంగారులేడి, క్రేవలను = ప్రక్కలందు. 38. కొంచెము = తక్కువ. 39. బన్నము = కష్టము. 40. కినుక = కోపము. 41. పుడమిపుట్టువు = భూసుత (సీత). 43. తడయు = ఆలసించు, గారడంపు పసిండిజింక= మాయావియగు బంగారులేడి. 46. రొద = శబ్దము, చేటు = కష్టము, వేకమ = శీఘ్రముగ. 47. జేజేల్ ముగురును = వేల్పులు ముగ్గురును (బ్రహ్మ విష్ణుమహేశ్వరులు.) 48. చాయమగఁడు = సూర్యుఁడు. 50. కనలుచు=కోపించుచు. 52. తపసి= ఘూర్తుఁడు. 53. రుదురక్కసరులు = రుద్రాక్షపేరులు. 55. వడువున = విధమున. 58. ఊడిగములు = పరిచర్యలు, వేల్పురాయనిప్రోలు = దేవేంద్రుని పట్టణము - (అమరావతి). 59. కడలఱేండ్లు = దిక్పాలకులు. 61. బేరజంపు రక్కసుండు = కుత్సితుండగు రాక్షసుఁడు. 62. వేల్పుతెరవున = ఆకాశమార్గమున, సాళువపులుఁగు= డేగయనుపక్షి. 66. పంటచెలి = భూదేవి. 67. అనద = అనాథ. 71. ముడికాఁడు= కుజనుఁడు, తొలివేలుపు వంగడంబు = రాక్షసవంశము. 72. కుందనపుం బొమిడికములు = బంగరు కిరీటములు. 75. కడిమి = పట్టుదల, కయ్యము = యుద్ధము, జడబ్రతుకు గూడుపట్టువసామి = జటాయువను పక్షిశ్రేష్ఠుఁడు. 76. ముడిచి=ముడివైచి. 79. మొక్కలము = ముష్కరము, అక్కటికము = దయ. 84. వెమకుచు=వెదకుచు 85. పెనుజేక్కురలు = పెద్ద ప్రవాహములు, చిఱుత గుబ్బలులు = చిన్నగుట్టలు.

86. నెమ్మి = నెమలి, కొంచలార = క్రౌంచపక్షులార, కొలంకుటంచలార = సరోవరములోని హంసలార, నిరాబారికన్నెలార = మునికుమారికలు. 91. కేరెనటంచు = తిరస్కరించెనంచు - పరిహసించెననుచు. 93. ఈడు = సాటి. 94. వెక్కసము = అధికము, వెతలు = వ్యథలు. 95. నట్టువపుల్కులు = మయూరములు, వేనలి = ధమ్మిల్లము, వలవంత = అధికదుఃఖము. 98. అళుకు = భయపడు. 102. జిగిలి = చిక్కనైనది. 103. ఉఱియదొర = ధీరుఁడైనప్రభువు. 104. ప్రోదిసేయు = రక్షించు. 105. దుంతహుమాయివజీరు = యముఁడు. 106. ప్రొద్దువేడి = సూర్యతాపము. 108. దిటము = స్థైర్యము, దక్కనపునేల = దక్షిణభూమి. 109. పక్కిఱేడు = పక్షిరాజు, చక్కాడెద = చంపెద, దరియఁజనుచున్నతఱిఁ = దగ్గఱఁజేరు సమయమునందు. 110. మీతండ్రికనుఁగ = మీతండ్రిస్నేహితుఁడ. 111. అనియొనరింప = యుద్ధముచేయఁగ. 112. తొలిపలుకుఁగొనలు = ఉపనిషత్తులు, జడదారిగములు = మునిబృందములు. 113. కనికరపుగనీ = దయానిధీ. 114. ఇడుమగములు = కష్టపరంపరలు. 115. ఒడలువిడిచి = మరణించి. 116. అగ్గిపనులు = దహనసంస్కారములు, తొలిమినుకుజాడ = వేదోక్తముగ. 117. పొలమేపరి = రాక్షసుఁడు. 118. బలుమొండెపురక్కసుని = కబంధుఁడను రాక్షసుఁడు 120. చెంచుతెఱవ = శబరాంగన - (శబరి). 122. వాఁక = నది, పజ్జ = సమీపము, గట్టు = పర్వతము. 123. చెట్టుఁద్రిమ్మరియెకిమీఁడు = వానరులరాజు - (సుగ్రీవుఁడు). 126. నీర్లదొర = వరుణదేవుఁడు. 127. మిన్నేఱు = గంగాప్రవంతి.

## కిష్కింధాకాండము

2. ప్రొద్దుకుఱ్ఱఁడు=సూర్యపుత్రుఁడు (సుగ్రీవుఁడు). 4. విన్గారిమిమన్నఁడు = విన్. అనఁగా నాకసము. ఆకసము గాలితండ్రియగుటయు, గాలి కొడుకు ఆంజనేయుఁడగుటయు, విన్గారిమి మన్నఁడన నాంజనేయుఁడు. సొబగుకుత్తుకకోతులఱేడు=సుగ్రీవుఁడను కోతులరాజు. 7. ఈఁదచూలి = గాడ్పుకొడుకు (హనుమంతుఁడు) చేయిదోయి = రెండుచేతులు. 9. వలగొని = చుట్టుతిరిగి. 10. ఱెంక = దాసుఁడు. 13. చక్కి = సమీపము. 15. కరువలి = వాయువు. 16. వ్రేల్మిడి = శీఘ్రముగ. 17. ఒచ్చెము = కొంచెము. 18. హజ్జదోయి = పాదద్వయము. 19. పడగదాలుపురాయఁడు = శేషుఁడు, లాతి = ఇతరుఁడు, వ్రేఁగు = భారము. 20. నలువమీఱంగ = చెలువు హెచ్చునట్లు. 21. జతనంబుగ = ప్రయత్నముగ, తొడవులు = ఆభరణములు. 22. అసురుసురు = శ్రమమునందగు ధ్వన్యనుకరణము. 23. ముచ్చొకపురూపులు =

ద్వాదశరూపములు, వెచ్చనిజేజేయనుంగునికుఁగు = సూర్యపుత్త్రుఁడు (సుగ్రీవుఁడు), లొచ్చు = తక్కువ. 25. కొండసూడుపట్టి=ఇంద్రతనయుఁడు (వాలి). 26. గుబ్బలి పెనుబొఱియ = కొండలోపెద్దగుహ, బొబ్బలు = గర్జనములు. 29. కినుకించి = మోన గించి, కొంచు = సంకోచము. 36. రతనాలబొజ్జప్రోయాలు = భూదేవి. 39. ఇవము సూడుపట్టి = మంచునకు శత్రువగు సూర్యునిపుత్త్రుఁడు (సుగ్రీవుఁడు), పాఱుతెంచి = పరువెత్తివచ్చి. 41. ఒదలిచూపుల యొదయఁడు = దేవేంద్రుఁడు. 42. కొఱకొఱ= కోపము. 44. చీఁకటులగొంగ = సూర్యుఁడు. 45. ఇబ్బడి = ఇనుమడి (రెండురెట్లు) తోఁగి = మునిఁగి, చిలుకు = బాణము. 47. చక్కపేరిచెలిని = తారను (సుగ్రీవుని భార్య). 48. ఉడుగరలు = కానుకలు. 49. చెడనిమేలు = శాశ్వతమగు సుకృతి. 51. సదమదమొనరించి = సంహరించి, పదిమోములరక్కసుని=దశకంఠుని. 52. వాన కతి = వర్షాసమయము. 53. గొబ్బున = వేగముగ. 58. వింటఁ = ఆకసమునందు, వేలుపులరాచవిండ్లు = ఇంద్రధనుస్సులు. 60. సురగాడ్పు = సుడిగాలి. 61. అంచ బారులు = హంసలసమూహములు. 63. వేల్పుతెఱవలు = అచ్చరలు. 65. సంజాడు= మాంసము. 66. వంతలఁగొఱలియొఱలె = విచారములనొంది విలపించెను 67. తెర పరిగములు = పాంసులసమూహములు, డిగ్గియ = దిగుడుబావి. 68. పరువంపుఁ బైరులు = ఫలోన్ముఖములగుసస్యములు, తెలిమొగులు = శరత్కాలమేఘములు. 71. అరెకులు = తలారులు. 73. రోయు = వెదకు. 74. దురము=యుద్ధము. 79. జింక వార్వుపడకుగారవపుఁబట్టి = గాలికొడుకు (హనుమంతుఁడు). 80. గోతి = స్త్రీ. 81. తలమానికము = శిరోభూషణము. 83. తొలిదేవర = రాక్షసరాజు. 84. దివి= స్వర్గము. 86. గట్లసూడుకొడుకు కొడుకు = వాలికొమరుఁడు (అంగదుఁడు). 87. మొగిలుపగవాఁడు = వాయువు. 89. కొమ్మమెకపుజోదులు = వానరవీరులు. 91. మున్నీరు = సముద్రము. 93. పిల్లారిజియ్య = కుడుములవేల్పు (వినాయకుఁడు). 94. ఇరులగొంగ = చీఁకటిశత్రువు (సూర్యుఁడు). 95. కుందనము = బంగారు. 97. కడలి = సముద్రము. 99. రాయంచవాడవపుదొర = బ్రహ్మదేవుఁడు. నిచ్చలు= ఎల్లప్పుడు, ఆసము = ప్రసిద్ధి. 100. దిటంబు = ధైర్యము. 101. పిఁక = ఉన్నతి, చుక్కలదారి = నక్షత్రపథము. 102. కడిందిబీతున = అధికభయమున, జేజేదాఁటు = దేవతలసమూహము. 104. నరజామెయి = సూక్ష్మశరీరము, పఱియలు = బ్రద్దలు. 107. పొదలపెదండదుప్పటి = ఫణితోలుపైబట్ట, గాడ్పుతిండిజల్తారవులు = నాగముల భూషణములు, ముమ్మొనవాలు = త్రిశూలాయుధము.

## సుందరకాండము

1. దొర = సదృశము రాజు. 3. ఎలమి = సంతోషము. 4. మాఱటమిత్తియో
యనఁగ = మారురూపునొందిన మృత్యుదేవతయో అనునట్లు. 7. ఎల్లెడఁబరికింపఁగ =
అంతటను బరిశీలింపఁగ. 8. ఉప్పరిగలు = సౌధములు, చప్పరము = మండపము, కొత్త
డంబులు = కోటబురుజులు (కొత్తళమనియు రూపము కలదు), గవనులు = గోపురములు
(గవను ఏకవచన రూపము.) 11. అజ్జలు = పాదములు, ఈరైదు = రెండయిదులు (పది.)
15. సెజ్జపజ్జలకు = శయ్యాసమీపములకు. 16. పెన్నెఱులు = కేశములు. 17. టెంకులు =
నివాసములు. 20, పనియొనర్చన = కార్యమునిర్వర్తింపక. 23. నలువగ్రుడ్డు = బ్రహ్మాండము.
25. మ్రాకులకునిక్క = చెట్లకునిలయము. 28. కుడుపు = ఆహారము. 33. విరాళి =
మోహము, తత్తరము = తొందర. 34. గొనబుపుట్టములు = సొగసైనవస్త్రములు,
వినుమ్రానిపరువంపువిరిదండలు = కల్పవృక్షముయొక్క వికసించిన పూలదండలు జాబిలినవ్వ
వాలు = చంద్రహాసమను కత్తి, మొసలివాప్రోఁగులు = మకరకుండలములు, హొంబొమిడి
కలు = బంగరుకిరీటములు, తాళీలు = పతకములు, సేవళము = మణులుగ్రుచ్చినహారము
(సేవడమనియు రూపము.) 35. ఆలవట్టము = దేవోత్సవములందును రాజాద్యుపచారము
లందు నుపయోగించు గుడ్డగొడుగు, వినుటెంకిచెలులు = దేవతాస్త్రీలు, బరాబరులు =
హెచ్చరికలు, తత్తడిమోరపైదలులు = కిన్నరజాతి స్త్రీలు, ఊడిగంపుచెయ్వులు =
పరిచర్యలు. 38. జన్నియ = వ్రతము. 40. కఱటితనము = మూర్ఖత్వము. 41. మల
గొంగ = దేవేంద్రుఁడు, అలరుటెత్తులు = పూలదండలు, దంటమోములసామి = అగ్ని
హోత్రుఁడు. 42. పఱవక = పరువెత్తక. 45. ప్రన్ననిజాణఁడు = సుందరా
కారుఁడగు సమర్థుఁడు. 46. పూరిపుడక = గడ్డిపోచ. 47. కనుబ్రామి = మోసగించి,
తెక్కలికాఁడు = దొంగ, సిబ్బితి = సిగ్గు. 48. ఎల్లిదము = చులకనయైనది. 50. కొఱవి =
కొఱకంచు, కొఱవింపలగోఁకుకొనఁగఁ గోరెడుకరణి = ఎఱిఁగియే కీడుతెచ్చుకొను విధమున.
51. పాలివాండ్రు = దాయాదులు. 53. ఎరగలి = అగ్ని, చిలుకుటగ్గి = బాణాగ్ని.
అగ్గమై = అధీనమై. 54. జడలసికదేవర = ఈశ్వరుఁడు. 55. పిసాళినాగుఁబాము =
కుటిలమగు సర్పము, అవుడుగఱచి = క్రిందిపెదవికఱచి (అవుడునకు ఔడు అనియు
రూపము.) 56. గద్దఱి = నిపుణుఁడు. 57. ఇరుసతజగములు = పదునాల్గు భువనములు.
58. దివజడలరేయిద్రిమ్మరి = త్రిజటయను రాక్షసి. 59. నీళ్లరాయఁడు = వరుణుఁడు.
60. బమ్మకొలము = బ్రహ్మవంశము, ఎల్లకడలు = అన్నిదిక్కులు, కైదువు = ఆయుధము.
61. కొఱకొఱ = కోపము. 62. ఆమని = వసంతకాలము. 67. కరువలిపట్టి = వాయు
పుత్త్రుఁడు (ఆంజనేయుఁడు.) 70. అన్నుతలమానికము = స్త్రీలకు శిరోభూషణము.

73. కలతెఱఁగు = ఉన్నవిధము. 74. చలినట్టుకతంబున = వాయుదేవుకారణమున. 76. ఇర్లగొఁగకొమరుఁడు = సూర్యపుత్త్రుఁడు (సుగ్రీవుఁడు), అలరొంది = సంతసించి. 79. ఎల్లిట = ఱేపట, తలఁకకుము = చలింపకుము. 80. కీడు = అపాయము. 82. తడవు = ఆలస్యము, దండు = సైన్యము. 85. అక్కు = వక్షము. 86. తడవు మనుము = చిరకాలము జీవింపుము. 87. గబ్బలిద్రిమ్మరిసింగమ = వానరశ్రేష్ఠుఁడ. 88. అప్పనము = అర్పణము, మగంటిమి = పౌరుషము, ఒదవదు = కలుగదు. 89. బల్లిదుఁడు = బలవంతుఁడు కొలముచెలి = కులస్త్రీ. 90. దోసపుపంట = దోషమునకు ఫలము. 92. ఆనవాలు = అభిజ్ఞానము. 93. నచ్చి = నమ్మకముకలిగి. 94. విన్నుచూలి కొమరుఁడు = హనుమంతుఁడు. 95. నుగ్గాడి = ముక్కలుముక్కలుచేసి, పఱచి = పరుగెత్తి. 96. రాచగోతి = రాజస్త్రీ (సీతాదేవి.) 97. మంతనంబున = రహస్యముగ. 99. గండు = పౌరుషము శక్తి, ఈఁదకొమరుని పయి = హనుమంతుని మీఁద. 100. మెయిపెంచి = శరీరమును విస్తరించి పచ్చమావులతేరివజీరుండు = సూర్యుఁడు. 102. నెవ్వడి = మిక్కిలివేగము, చెండాడి = చంపివైచి, జముప్రోలు = యముని పట్టణము. 103. అంపజడివాన = బాణముల వర్షము. 104. నల్లవఱదలుబ్బగ = రక్త ప్రవాహము లతిశయింప, ప్రేలిమిడి = మిక్కిలి వేగముగ, వరుసమెడలనల్లద్రావుడుదొర = రావణుఁడు. 105. కనలి = కోపించి. 103. చేగలమెకము = చేయిగల మృగము (ఏనుఁగు), కాలరిపౌజులు = కాల్బలములు - పదాతిసైన్యములు, కత్తళంబులు = యుద్ధమునం దుపయోగించెడి కవచము - మైమఱువు, చివ్వపట్టెల్ల = యుద్ధరంగమంతయు. 113. వెఱచఱుపక = భయపడక, 114. అడిదము = కత్తి, నొసలు = ఫాలము - నుదురు. 116. దివిజేఁడు = లంకాధిపతి (రావణుఁడు.) 118. నారసములు = బాణములు. 119. మబ్బుత్రోవరికాన = గాలికొడుకు (హనుమంతుఁడు), ప్రాజేజేలజేని ప్రేముడిపట్టి = రావణుని కొమరుఁడు (అక్షయకుమారుఁడు), చెట్టుబిడారుబొబ్బమెకంబు = వానరవీరుఁడు, అనుమఁడు = హనుమంతుఁడు. 125. ఉమ్మలికము = దుఃఖము, తుమ్మట = చంపుట. 126. ఉత్తలము = సంక్షోభము. 131. అబ్రపడి = ఆశ్చర్యమొంది. 132. బమ్మయమ్ము = బ్రహ్మాస్త్రము. 133. ఉలుకు = సంతాపము, అలుక = కోపము. 134. నీరుకుప్ప = సముద్రము. 135. అవియు = బ్రద్దలగు. 137. ఇయ్యోజ = ఈ విధము, ఓజలేనికఱదలు = నీతిలేని మాయమాటలు. 140. అరుగుదెంచినవాఁడక్ = వచ్చినవాఁడను. 146. రక్కసివంగడము = రాక్షసవంశము, టక్కు = మాయ. 147. తూపుటింగలము = బాణాగ్ని. 143. కప్పుమెడవలంతి = పరమేశ్వరుఁడు. 149. తగవు = తగినది - న్యాయము. 154. సంబడము = సంబళము, వెంగలి =

పెట్టివాఁడు. 157. వేయిచేతులఱేఁడు = కార్తవీర్యార్జునుఁడు. 158. కోఁతిబిందములు= క్రోఁతుల సమూహములు. 169. అంటరానివేల్పు = అగ్ని. 172. చిచ్చు = అగ్ని, గట్టువిలుకాఁడు = ఈశ్వరుఁడు, చందము = విధము. 175. జగముగండు = లోకైక వీరుఁడు. 176. తేనెకాన = మధువనము, చూఱగా నారఁగించి = తృప్తిగా భుజించి. 179. ఉల్లమున = మనసునందు. 180. వేల్పులవేల్పు = దేవదేవుఁడ. 182. పున్కల పేరులు = అస్తిమాలలు, మిన్నువాఁక = ఆకాశగంగ.

## యుద్ధకాండము

1. బోఱియకాపు = వాల్మీకి 2. ప్రోడఱేఁడు = ధీరుఁడగురాజు. 5. చేటు = అపాయము. 6. తఱి తారుమాఱుగాఁగొడఁగె = సమయము వ్యత్యాసముకాఁ జొచ్చినది. 7. చిఱుపురువులు = సూక్ష్మకీటకములు 9. వెరవు = ఉపాయము, క్రన్నన = శీఘ్రముగ. 10. గాటంపుటుక్కున = గాఢపరాక్రమున. 12. జేజేలసామి = దేవేంద్రుఁడు, లిబ్బులఱేఁడు=ధనముల కధిపతి. (కుబేరుఁడు). 13. అంచపూమాయిజోదు = బ్రహ్మదేవుఁడు. 15. మొగిత్తెరువు = ఆకాశము, మిత్తి = మృత్యువు, దీవిఱాయఁడా= లంకాధిపా. 16. ప్రొద్దుపస = సూర్యతేజము సతమొసలపట్లు = సప్తసముద్రములు. 17. వలఁతితనము = ప్రౌఢత్వము, లిబ్బులచాన = లక్ష్మీదేవి. 21. కలికపుమానిసి = అర్భకుఁడగుమానవుఁడు, తరమగునే = శక్యమగునే. 22. చౌవంచవట్టులకోన = పంచవటీతీరమున, ఒడలిచూపులయొడయని కొడుకు = ఇంద్రసుతుడగువాలి. 23. తగరు = పొట్టేలు, బలువాజ్జిమెకము = ఏనుఁగు, జతకానిసూడు = సమానత్వములేనివైరము. 24. టాటోటుతనపుపెద్దలు = మోసముచేయుపెద్దవారు. 25. లోనినగరు = అంతః పురము. 28. విడుము = విడిచిపుచ్చుము. 29. మేల్గొనము = ఉత్కృష్టగుణము. 30. తూడుతిండిమావుదొరవంగడంబు = బ్రహ్మవంశము, పెఱతెఱవ = అన్యకాంత. 31. ఈడొదవనికయ్యము = సాటిలేని యుద్ధము, కీడుతెఱంగులు = అపాయములుకల్గువిధములు. 33. నెఱయె = అధికమా. 34. చెడకమనుట = నాశనముకాక జీవించుట. 36. చీఁకునకు = అంధునకు. 37. ఆఱడిఁజెందుట = నిందనొందుట. 39. మనికి = నివాసము, నిదురతమి = నిద్రయందలిప్రీతి. 41. పొట్టియ = వృశ్చికము. 44. క్రొమ్ముడులు = కేశబంధములు. 45. మాఱటమిత్తి = మాఱుమాపునగుమృత్యువు. 46. తాఁచుట = తాడనమొనర్చుట(తన్నుట). 47. మోడ్పుకేల్గవ = ముకుళితముచేసిన హస్తద్వయము. 48. జోగులవెలియావ = తాపసులకామధేనువ. 49. దరి = గట్టు (శరణ్యము). 50. ఏవురు = అయిదుగురు. 51. మఱువు = కవచము (రక్షణము). 53. కల్వలదాయయనుంగుఁబట్టి = సూర్యసుతుఁడు(సుగ్రీవుఁడు), నుడువు = పలుకు.

56. కీటడఁచి=చంపి (ఈపదము గీటడఁచు అని సరళాదిగా శ. ర. కానంబడియెడి). 57. ఇక్క = నిలయము. 58. కావుమనుచు = రక్షింపుమనుచు. 59. పెనుపు = అతిశయము, చేవ = బలము, తేజు = తేజస్సు. 61. అర్మిలి = ప్రీతి. 62. పజ్జదోయి = పాదద్వయము. 64. చిగురుఁగైదువుజోదు = మన్మథుఁడు, గీము = గృహము. 64. జన్నము = యాగము, తెగసతమాఱులు = ఇరువదియొక్కపర్యాయములు, అప్పయానతి = జనకునియాజ్ఞ, కల్లమెకంబు = మాయలేడి, సతముగ = శాశ్వతముగ, సతవార్వములపట్టి = సూర్యపుత్త్రుఁడు (సుగ్రీవుఁడు), గిడ్డయునేలవేల్పు = వామనుఁడగు బ్రాహ్మణుఁడు, (వామనావతారము), మావునెక్కుజగామగండు=గుఱ్ఱమునెక్కు జగత్ప్రభువు, (కల్క్యవతారము), పలురూపులు = అనేకములగునవతారములు, పెనుమిన్కులు = వేదములు, లోపలిదాయలు = అంతశ్శత్రువులు, (అరిషడ్వర్గము), కదలివెన్న = చంద్రుఁడు, వేడివేలుపు = సూర్యుఁడు, గాములు = గ్రహములు, కూళలు = పాపులు, అఱలేనికూరిమి = తక్కువకానిప్రేమ. 68. మెప్పులు = వరములు. 69. జన్నంపుఁదిండిదొరలు = హవిర్భాగములభుజించువారు, (దేవతలు). 70. మినునిసువు = మేఘము, జోళ్లు = కవచములు (జోడుఏకవచనము), వమ్ము = వ్యర్థము, తూపులు = బాణములు, బీరము = వీరమునకువికృతి. 71. దళవాయి = సేనాధిపతి, క్రిక్కిఱిసి = ఎడములేకవ్యాపించి, నూకించె = త్రోపించె. 75. అసలు = అడుసు, బురద. 77. బన్నములు = కష్టములు. 79. చాలుపేరింటిప్రోయాలి మగఁడ = సీతాదేవికి భర్తయగువాఁడా, నేలక్రొన్ననబోఁడి = భూదేవి, నెనరు = ప్రీతి. 80. ఏళ్లరాయఁడు = సముద్రుఁడు, ములికి = బాణము. 85. క్రేళ్లుదాటు = ఎగిరిపడు. 88. నడవ = వంతెన. 90. ఏలలు = ఏలపాటలు. 92. సువేలంబు చేరువ = సువేలమనుపర్వతముదగ్గర. 96. మ్రుచ్చుదనము = దొంగతనము. 96. ప్రోదియిడుకొనుము = వృద్ధినొందించుకొనుము. 97. చామంచు తెఱంగు = చావక యుండువిధము. 98. వేల్పుఱేనిమనుమఁడు=అంగదుఁడు, హజారము=ఆస్థానము, దంబు=అతిశయము. 99. పికాపికలై = చెదరినవారై. 103. నేలకాన్పు = సీతాదేవి (భూపుత్త్రి). 111. అలము = యుద్ధము. 112. కోనమన్కిబంట్లు=వానరయోధులు. 114. ఇంగలము = అగ్ని. 115. కడయొడయలు = దిక్పాలకులు. 116. పునుకతాల్పు = ఈశ్వరుఁడు, కల్లజింక = మాయలేడి, అసదె = అల్పమె. 119. బంటుచెయ్వులు = యోధకృత్యములు. 123. గడితంపుటక్కటికము = అతిశయమగు కనికరము. 125. లగ్గపట్టఁబనిచె = ముట్టడిచేయనియోగించెను. 126. బిందంబులు = సమూహములు. (బృందములనుటకువికృతి). 128. కైదువులు, ఆయుధములు, తుత్తు

ముఱు = పొడిపొడి (తుమురు+తుమురు). 161. మొగుల్త్రోవ = ఆకాశమార్గము, తుల్వలు = దుర్మార్గులు, సాదులు = సజ్జనులు, ప్రోదిగావింప = అభివృద్ధినొందింప, ప్రాఁతజేజేలు = రాక్షసులు, బంగారపుంగంటి కేడ్రిమ్మరి=హిరణ్యాక్షుఁడను రాక్షసుఁడు, పొట్టివై = వామనుఁడవై, మూఁడడ్గులు = మూఁడడుగులు, గయ్యాళిరాపిండులన్ = దుర్మార్గులగురాజులను, లెంకజెల్వ = పూర్వజ్ఞానము. 162. వేదలలుపూనెడుపాము = వేయిశిరములుగల ఆదిశేషువు, పాములవేఁటకాఁడు = గరుత్మంతుఁడు. 163. విచ్చుసైగ్గయి = చెల్లాచెదరై. 168. అక్కజము = ఆశ్చర్యము, పైడియరదము = బంగారుతేరు. 169. జముపట్టు = యమునివాసము, కట్టలుక = మిక్కుటకోపము. 170. చలము=ద్వేషము, అంపజడి = బాణవృష్టి. 171. పిచ్చలింపక=మెచ్చుకొనక. 172 కడతేరు=చచ్చు, కోల్తలసేయలేక =ముఖాముఖియుద్ధముచేయలేక. 174. వెండియుఁ=. మఱియు, తేరుగడపువాఁడు = రథసారథి (సూతుఁడు). 175. దిటముసెడక=ధైర్యము వీడక. 177. సోలి = మైమఱచి. 179. ఉక్కివుఁడు=మోసగాఁడు. 182. మద్ది= సాలవృక్షము, సదమదంబుచేసి = చంపివైచి, సింగపుఱొద = సింహగర్జనము. 186. నలియొనరించి = పొడిచేసి. 191. ఉప్పరముద్రువంగ = ఆకసము దద్దరిల్ల, సొమ్మగొని = మూర్ఛిల్లి. 192. పలులకోరుల = అనేకబాణముల. 193. పొలివోవదిగిన్ = మొద్దుపారని ధైర్యముతో. 195. పిలుకుమార్చె = చంపెను. 196. అదలుచు = భయమొందుచు. 197. నేస్తంబు = స్నేహము (చెలిమి), పుడమికానుపుగేస్తుని = సీతకు భర్తయగురాముని. 198. ఎల్లులు = గొడుగులు, అనికిఁదొడరి = యుద్ధమునకారంభించి. 199. జమునిప్రోలికి = యమునిపట్టణమునకు. 200. నొసలు = ఫాలము, కనలి = కోపించి, బూచిగములు = పిశాచసమూహము, అమెత = విందు. 201. పడవాళ్లు = సేనాధిపతులు (పడవాలు ఏకవచనరూపము), పదికడలు = దశదిశలు. 202. అందలములు = పల్లకీలు, తేజీలు = గుఱ్ఱములు. 203. హొన్బొమిడికమ్ములు = బంగరుకిరీటములు, డాకాలు = ఎడమకాలు, పుత్తడి = బంగారు, వేల్పుమ్రానూవుదెత్తులు = కల్పవృక్షపుసుమదామములు, దెత్తులవాండ్రు = వేత్రహస్తులు. 204. చిచ్చఱపిడుగు= అగ్గిపిడుగు,నరుపుకాఁడు = పిటుఁడు, అగ్గించు = స్తోత్రముచేయు. 205. అలవట్టము = గుడ్డతో గుండ్రముగాఁగూర్చిన విసనకఱ్ఱ, పఱియలువాఱ=బద్దలుకాఁగా. 206. అడవిగీముబంట్లు = వానరయోధులు. 211. నెత్తితొడవు = కిరీటము. 219. అత్తమిలిన= ఒఱగిన. 222. అరి = అల్లెత్రాడునకు మధ్యభాగము, అరచందమామవాలమ్ము = అర్ధచంద్రాకృతిబాణము. 224. కడవచెవులపోటరి కుండచెవులజోదు = కుంభకర్ణుఁడను వీరుఁడు. 225. అటమటి = త్వరగా. 226. పెన్నలలాగున = పెద్దకొండవలె.

232. కయ్యము = యుద్ధము, పోటుకాఁడు = వీరుఁడు. 233. పెనుసత్తి=పెద్దశక్తి, మిత్తి = మృత్యువు, వియరతనంపువంగడపు వెన్నెలరాయని = సూర్యవంశశ్రేష్ఠుఁడగు ప్రభువగు రామునియొక్క. 234. ఓలమాసగొనక = వెనుదీయక. 235. లేటిపదువు= లేళ్లగుంపు, 237. కోల్తల = కోలుతల - ముఖాముఖిచేయు యుద్ధము, కోల్తలచేయు = యుద్ధసన్నాహముచేయు. 238. వాయిఁదెఱచి = నోరువిప్పి. 240. పవలుసేయు వేలుపు = సూర్యుఁడు. 241. మొనలువాలు = శూలాయుధము. 245. నారికెడపు బొండములు = కొబ్బరిబొండములు, ఇంచుగోలల తెఱఁగున=చెఱకుగడలవిధమున, కుత్తుక బొటియ=గుహవంటికంఠము. 247. గాడ్పుతూపు=వాయవ్యాస్త్రము. 250. మేర= హద్దు, దక్కినంపురాయఁడు = దక్షిణదిక్పాలకుఁడు (యముఁడు). 251. కడిమి= బలము. 253. సన్నగాఁడు = అర్భకుఁడు. 260. ఆగడములు = దిట్టతనములు. 261. బవరము = యుద్ధము. 262. వాసిలకోరులు = అమోఘబాణములు. 267. నలువతూపు=బ్రహ్మాస్త్రము. 268. పొలియక=నశింపక. 269. అబ్బ=తండ్రి. 272. మందులగట్టు = సంజీవినిపర్వతము, మనిపె = జీవింపఁజేసెను. 273. చెయువుల సాకిరి కుఱ్ఱఁడు = సూర్యపుత్త్రుఁడు (సుగ్రీవుఁడు). 276. పటాపంచలు = చెల్లాచెదరు. 278. మోసల = మొగసాలయనుటకు రూపాంతరము, ఉగ్గ్రాణము = ధనాగారము. 279. దుగమొగములవేల్పు = అగ్ని. 280. సతనాలుకలు = సప్తజిహ్వలు. 289. ద్రుడ్డులు = గదాయుధములు. 290. గుదెతాలుపుప్రోలికి = దండధరునివీటికి. 293. వాలారుందూపులు = నిశితమగు బాణములు. 296. గాడుపునెయ్యునట్లు = అగ్నివలె. 302. తమ్మికానుపుగ్రుడ్లు = బ్రహ్మాండములు. 305. పొలసుబోనపు మేటి మగండు=రాక్షసవీరుఁడు. 308. పనివిని=అని. 311. మువ్వన్నెమెకము=వ్యాఘ్రము, మొసలికన్నులరాకాసి = మకరాక్షుఁడను రాక్షసుఁడు, సీరాము = శ్రీరాము. 312. లావు = బలము. 314. ముదినేలవేల్పు = ముదుసలిబ్రాహ్మణుఁడు (పరశురాముఁడు), జింకపోతు = లేడిరూపముతాల్చిన మారీచుఁడు. 316. అగ్గలపుకిన్క = అధికమగు కోపము. 317. వమ్ము = వ్యర్థము. 319. నిలిగిన చందంబు = నీల్గినవిధము. 320. వేల్పులాగెల్పుకాని = ఇంద్రజిత్తుు. 323. నాలవతొలిపలుకు = అధర్వణవేదము, కల్లరిసత్తి = మాయాశక్తి. 324. పోటరితనమేది = ధైర్యమునశించి, ఈఱములు = పొదరిండ్లు, ఆసముదూలి = గర్వమునశించి. 327. గారడపు రక్కసుని = మాయా రాక్షసుని. 329. కొండనత్తమిలుమేటిదేవర = దేవేంద్రుఁడు. 333. అంటరాని దేవర = అగ్నిదేవుఁడు. 336. ముక్కంటి = ఈశ్వరుఁడు. 340. పోవఁబెట్టి = దిగ విడిచి. 341. శార్ఙ్గి = దవానలము, పక్కిసామి = గరుత్మంతుఁడు. 349. ఏనుంగు

లెన్మిదియేఁగ్ = అష్టదిగ్గజములును, పాపరాయఁడు = ఆదిశేషువు. 353. గాడ్పుతిండి ములికి = నాగాస్త్రము. 357. అలరువాన = పుష్పవర్షము, అచ్చరలాడిరి = అప్సరోంగనలు నాట్యముచేసిరి. 360. ఉమ్మలిక = దుఃఖము. 364. హుటాహుటి = శీఘ్రముగ, ఇడుమలఁగుడుచు=కష్టములనొందు. 374. మంటంగలపజను = భూమిపై నున్న జనులకు. 380. చిచ్చుఱతూపు = ఆగ్నేయాస్త్రము. 390. పాఱి = పరువెత్తి, కళకళపడుచు = క్షోభమునొందుచు. 392. హుళక్కినిదుర = మూర్ఛ. 403. తూర్పుమల = పూర్వాద్రి. 408. జోగిరూపు = మునీంద్రునాకారము. 409. రుద్రక్కపేరులు = రుద్రాక్షలదండలు, ఉళిక్కి = మిథ్య. 417. పఱియలు = ముక్కలు. 418. వేల్పుటలివ = అప్సరస, కల్లతపసితెఱఁగు = మాయాముని విధము, వేల్పుప్రోలు = స్వర్గలోకము. 428. తెమ్మెరవడి = గాలివేగమున. 429. చిలువ జగంబు = పాతాళలోకము. 432. క్రమ్మఱించిరి = మరలించిరి. 433. దీవి రాయఁడు = లంకాధిపతి. 434. ఒజ్జ = గురువు. 437. సుక్కురుండు = శుక్రాచార్యుఁడు. 438. మించునాల్క రక్కసుఁడు = దీర్ఘజిహ్వుఁడు, పాప జగంబు బోఱియ = పాతాళకుహరము. 443. గీములు = గృహములు, ఇరవు= నివాసము. 447. లోనగరు = అంతఃపురము. 448. సాన = లజ్జ. 451. కికు రించి = మోసగించి. 452. చేడ్పాటు = ఆపద, ఇంకఁబెట్టి = విడిచిపుచ్చి. 465. పసిఁడికన్నుల పొలదిండి = హిరణ్యాక్షుఁడను రాక్షసుఁడు, మానిసి సింగము = నృసింహావతారుఁడు. 468. మొదలిసిరియె = ఆదిలక్ష్మియె. 469. నేలచూలి = భూసుత (సీతాదేవి). 473. ఎపుడుచెడనిమేలు = శాశ్వత సౌఖ్యము. 482. మున్నీటికుద్దియై = సముద్రమునకు సాటియై. 494. రాతి కుసుర్లొసంగినదొరంగని = రామునిచూచి. 497. వెండికొండ = కైలాసపర్వతము. 500. వేయిచేతులయెకిమీఁడు = వేయిచేతులుగల రాజు (కార్తవీర్యార్జునుఁడు.) 501. బటువువాలుతాల్పు = చక్రాయుధుఁడు (విష్ణువు), గుబ్బలివిలుకాఁడు = మేరువు విల్లుగాఁ జేసినవాఁడు (ఈశ్వరుఁడు), అంచగుఱ్ఱపుజోదు = హంసవాహనుఁడు (బ్రహ్మ.) 505. నెఱఁకులు = మర్మస్థానములు. (నెఱకు ఏకవచనరూపము.) 509. పనుపు = ఆజ్ఞ. 518. తెఱగంటివిల్లు = ఇంద్రధనుస్సు (ఆకసమున వర్షసూచకముగాఁ గనఁబడు పలురంగుల హరివిల్లు.) 521. పులుఁగురాతూపు = గారుడాస్త్రము. 526. మానిసి యొదలు = మనుష్యాకారము, తెల్వి = జ్ఞానము (తాను విష్ణుమూర్తి యగుట.) 527. నేతురె = నేయుతురె. 528. వేయిచేతులసామి = సూర్యుఁడు. 532. కయిబల్మి = బాహుబలము. 539. డెప్పరమై = అధికమై. 540. కీడ్డెఱఁగులు = దుశ్శకునములు.

541. పిఱుతివియక = వెనుకదీయక, పసిబుఁడు = వైర్యముకలవాఁడగుచు. 543. కప్పు కత్తుకసామి = నల్లనికంఠముగల ప్రభువు (ఈశ్వరుఁడు), మిత్తికోఱలు = మృత్యుదంష్ట్రలు, బెడిదంపుములుకులు = కఠోరబాణములు, వారువంబులు = గుఱ్ఱములు. 549. మొగిలుతెరువు = ఆకాశము. 550. చదువులపడఁతుక = సరస్వతి. 553. వెన్నునిబొడ్డుబిడ్డని = బ్రహ్మదేవుని, పొలియఁడు = చావఁడు. 557. జగములు సమతఱినెగడెడునగ్గి = ప్రళయకాలాగ్ని, సతపయ్యెరలు = సప్తసంఖ్యాయుతములు, గాడ్పులిండిప్రోలు = పాతాళము. 558. బవరంపునేల = యుద్ధభూమి, కాలివాలు = వజ్రాయుధము. 559. దేవులు = భేరీలను వాద్యములు. 560. ప్రాఁతపలుకుల జాడలు = వేదోక్తమార్గములు. 565. ఉడుగరలు = కానుకలు. 568. ప్రాఁతవేల్పు చానలు = రాక్షసస్త్రీలు. 569. అలరుసరములు = పూలదండలు. 570. కుందన పుటొవలమ్మున = బంగరువన్నె. 571. పలుముగ = దట్టముగ. 572. మగపాడి = వీరత్వము. 573. నేర్పి = నేర్పునరించి. 574. కఱకులు = కఠినపుమాటలు. 577. వామి = రాశి. 578. సొదఁజొచ్చె = అగ్నిలోనఁ బ్రవేశించెను, 582. క్రొన్నెల తాల్పు = ఈశ్వరుఁడు. 583. సిరులయన్ను = లక్ష్మీదేవి. 586. జోతలు = నమస్కారములు. 587. సంగడిచేడియలు = చెలికత్తెలు, జన్నిగట్టుముత్తైదువలు = బ్రాహ్మణుల పుణ్యస్త్రీలు. 588. రొక్కంబు = ధనము, బోనములు = భోజనములు. 589. వెనుకచూపులమెకపుఱేఁడు = భల్లూకపతి (జాంబవంతుఁడు.) 590. ఇమ్ములు = నివాసములు. 591. జన్నములు = యజ్ఞములు, నిచ్చలు = ఎల్లప్పుడు, పాడి = నీతి. 592. సంకు = శంఖము, రిక్కలు = నక్షత్రములు, వేల్పులబోనము = చంద్రుఁడు, నీరింకుమొగులు = శరత్కాలమేఘము, యసము = యశస్సు - (ఇది శత్రుదిగ్విజయ ప్రతాపమువలనఁ గలుగును) 594. కొఱఁత = తక్కువ. 595. గుఱియరసి = లక్ష్యములఁ బరిశీలించి. 596. తిరమయి = శాశ్వతముగ. 598. చిట్టకన్ను = అగ్ని నేత్రము (శివుని మూఁడవకన్ను), గట్టురాకన్నియ = పర్వతరాజపుత్రి (పార్వతి.)

# అకారాది పద్యానుక్రమణిక

ఆ

## క

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | ... | 1 | 0 |
| ఆర్యావాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 0 | 12 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆనందగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రకుమారసంభవము - ఆదిపూడి సోమనాథరావు | ... | 0 | 12 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము), సటీక | ... | 8 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము, మూలము | ... | 0 | 4 |
| „ టీకతో (బ్రౌనుపేపరు) | ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కలితో | ... | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| కవికంఠోక్తి | ... | 0 | 4 |
| కవిజనాశ్రయము | ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | ... | 0 | 12 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కిన్నరీవిజయము - ఆదిపూడిసోమనాథరావు | ... | 0 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 10 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | ... | 0 | 12 |
| „ గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 1 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372, మద్రాసు. 1.



# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అధ్యాత్మరామాయణము, నాగయామాత్య ప్రణీతము | 2 | 0 |
| అప్పకవీయము, క్రొత్తపూర్వ | 5 | 0 |
| అప్పకవీయవిమర్శ, శ్రీగిడుగురామమూర్తిగారిది | 0 | 12 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము 2 సంపుటములు | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము:— | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దఅచ్చు | 1 | 8 |
| ,, టీక (పాతది) | 8 | 0 |
| ఆదిపంచకము | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 7 | 8 |
| శాంతిసప్తకము | 7 | 8 |
| ఆది సభాపర్వములు | 4 | 0 |
| అరణ్యపర్వము | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 4 | 0 |
| కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిపర్వము | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | 4 | 0 |
| ఆంధ్రభాగవతవిమర్శనము, శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది అచ్చు | | |
| ఆంధ్ర శ్రీమద్రామాయణము— శ్రీజనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | 18 | 0 |
| ఉత్తరరామాయణము | 6 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమన | 3 | 0 |
| కళాపూర్ణోదయము, సూరనార్యునిది, లఘుటీకానుక్రమణికతో | 5 | 8 |
| కళాపూర్ణోదయము, మూలము | 4 | 0 |
| కాశీఖండము, శ్రీనాథకవి | 3 | 8 |
| జైమినీభారతము, పిల్లలమర్రి పినవీరభద్రకవి | 2 | 8 |
| దశావతారచరిత్ర | 4 | 0 |
| నరసభూపాలీయము, సటీక | 3 | 0 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికో బైండు | 2 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము | 2 | 8 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకవి | 2 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన | 2 | 0 |
| పాండురంగమాహాత్మ్యము, లఘుటీక, క్యాలికో బైండు | 6 | 8 |
| బసవపురాణము, ద్విపద, చిన్నసైజు | 4 | 8 |
| భాస్కరరామాయణము | 8 | 0 |
| భగవద్గీతా కందార్థములు | 1 | 4 |
| ,, పద్యకావ్యము శ్రీగోపీనాథము వేంకటకవికృతము | 1 | 4 |
| మనుచరిత్ర, వావిళ్ల రామస్వామి శాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలు కాగితములు | 5 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద | 6 | 0 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | 1 | 0 |
| డిటో టీక | 5 | 0 |
| భక్తిరసశతకసంపుటము I, 20 శతకములు | 3 | 0 |
| ,, II | 3 | 0 |
| ,, III | 3 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372, మద్రాసు. 1.

